# విషయసూచిక



## పీఠిక



## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

| విషయము. | పుట. |
| --- | --- |
| నందివాహనుం డై శంకరుండు పరిణయంబునకుం జనుట ... | 138 |
| హిమవంతుపురంబు నలంకరించుట ... | 142 |
| చంద్రోదయవర్ణనము ... | 144 |
| సూర్యోదయవర్ణనము ... | 145 |
| శివుఁడు భూసమత్వంబునకై యగస్త్యుని దక్షిణదిక్కునకుఁ బంపుట | 149 |
| అంగనాజనంబు లీశ్వరునిఁ జూడవచ్చుట ... | ,, |
| శివుండు పార్వతీసహితుండై మంగళస్నానాదులు చేయుట | 155 |
| హిమవంతుండు కన్యాదానము చేయుట ... | 157 |
| బ్రహ్మాదులు నమస్కరించి మన్మథునివృత్తాంతముఁ దెల్పుట | 159 |
| పార్వతిని రజతశైలంబునకుఁ బంపుట ... | 160 |
| శివుఁడు గౌరితో సుఖముగా నుండుట ... | 162 |
| పార్వతి శంకరుని నీలగళకారణం బడుగుట ... | ,, |
| క్షీరసాగరమథనము ... | 167 |
| క్షీరాబ్ధిని హాలాహలము బుట్టుట ... | 168 |
| దేవతలు బ్రహ్మను వేఁడుట ... | 169 |
| శంకరుని దేవతలు స్తుతించుట ... | 170 |
| ఈశ్వరుఁడు హాలాహలమును మ్రింగుట ... | 178 |

## చతుర్థాశ్వాసము

| | |
| --- | --- |
| దధీచి దక్షుని మందలించుట ... | 181 |
| దక్షునియజ్ఞవృత్తాంతము దధీచి శివునకుఁ దెల్పుట ... | 187 |
| శివునిహుంకారంబున వీరభద్రుండు పుట్టుట ... | 188 |
| పార్వతికోపంబున భద్రేశ్వరి యను కన్యపుట్టుట ... | 190 |
| ప్రమథగణములతో వీరభద్రుఁడు దండెత్తుట ... | 194 |

విషయము. | | పుట.
--- | --- | ---

శ్రీరస్తు

# వీరభద్రవిజయము

## ప్రథమాశ్వాసము

### దేవతాప్రార్థన



లలితంపుభూతియును శేషవిభూషణముల్ శిరంబు
పై, వేలుపుటేరు పాపటను వెన్నెలపాపఁడు మేన
గొండరా, చూలియుఁ గేల ముమ్మొనలశూలము
నీలగళంబు గల్గుసా, వేలుపుశ్రీరుమాసగము వేలుపు
మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 1

చ. సిరియును వాణి గౌరియును జెన్నగుకన్యకుమేను వాక్కుఁ
బెన్నురమును నుంకు విచ్చి ముద మొప్ప వరించి జగంబు
లన్నియుం, దిరములు సేయఁ బ్రోవఁ దుదిఁ దీర్పఁగఁ ద్రష్ట
యు గేశుఁడుండునై, హరివిధిశంభుమూర్తి యగునాథ్యుఁడు
మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 2

వ. అని నిఖిలదేవతాప్రార్థనంబుఁ జేసి. 3

సీ. భవభక్తులగువారిఁ బాటించి చూచుచోఁ
జల్లని సంపూర్ణచంద్రుఁ డనఁగ
శరణార్థులగువారిఁ జాలరక్షించుచోఁ
సలలితవజ్రపంజర మనంగ

ఖలుశివద్రోహుల భస్మీకరించుచో
సద్భుతప్రళయకాలాగ్ని యనఁగ
బ్రహ్మాండములనంటఁబట్టి ఘట్టించుచో
నదరి విజృంభించు హరుఁ డనంగ

ఆ. వెలయునట్టి దేవు వీరభద్రేశ్వరు
నఖిలదేవగర్వహరణశూరు
నాత్మఁ దలఁచి మ్రొక్కి యద్దేవుకరుణ సా
ధనములోన నమ్మి మహిమతోడ. 4

చ. కరతల మల్లఁ జాచి పులకండము నెయ్యిఁ బిండి యుం
డ్రముల్, బోరిఁబోరిఁ గళ్లు సేయుచును బుగ్గలఁ బెట్టుచుఁ
బావుకొంచు స్వేచ్ఛరువుగ లీలతో నమలి చిక్కుచు
సొక్కుచు గౌరిముందఱన్, గురువులువారు ప్రేఁగడుపుఁ
గుజ్జుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. 5

సీ. కల్పవల్లియుఁబోలు కాఁడిఁగెనును కాంతి
మెఱుఁగుఁడిగెలతోడ మేలమాడ
పసిఁడికుండలఁబోలు పాలిండ్లుకవకట్టు
చక్రవాకములతో పాటిసేయ
గండుమీలనుబోలు కన్నులచెలువంబు
నీలోత్పలంబుల గేలిసేయ
నిండుచందురుఁబోలు నెమ్మోముదీధితి
కమలపత్రంబులకాంతి నవ్వ

ఆ. పొనసి నిఖిలభువనమోహనలక్ష్మియై
పరఁగుచున్న పద్మపాణి వాణి

నన్ను నమ్మినారు నావారు మీ రని
వాకు లిచ్చుఁగాత మాకు నెపుడు. 6

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి. 7

క. శ్రీరామాయణకథ భువి
వారక నిర్మించినట్టి వాల్మీకి మన
స్ఫారుఁ బరాశరనందను
శ్రీరమ్యుని వాయ కెపుడుఁ జింతింతు మదిన్. 8

సీ. బాణు నంచితశబ్దపారీణు నసమాన
కవితాగుణావాసుఁ గాళిదాసు
మాఘువాక్యామోఘు మణిభద్రు శివభద్రు
రమణీయతరకవిరాజు భోజుఁ
బ్రకటితవిమలప్రభారవి భారవి
నున్నతగుణధుర్యు నన్నపార్యు
సేవితకవిరాజి శ్రీసోమయాజిని
శృంగారకవినాథు రంగనాథు

తే. నవని రెండవశారదయై వెలుంగు
వైభవోద్దాము వేములవాడభీము
నాదిగాఁ గలకవులను నధికభక్తిఁ
దలఁచి వర్ణించి తత్ప్రసాదంబు వడసి. 9

క. భవుఁ జూడక భవి డాయక
భవుపదములు గొల్చి ఘోరభవభంజనులై
భవదూరులై నపుణ్యుల
భవు నర్చనచేసి వరము వడసినవారిన్. 10

సీ. శిరియాలుఁ గరికాలుఁ జేరమునుద్భటు
బాణుఁ గేశవరాజు బసవరాజుఁ
గన్నప్ప జన్నయ్య కరయూరచోడయ్య
కుమ్మరగుండయ్య నెమ్మినాథుఁ
బండితారాధ్యుని భల్లాణునమినంది
మాహేశుమడివాలుమాచిరాజుఁ
చేరమరాజయ్యచిరుతొండనోమాళి
సాంఖ్యతొండనిసురిచముడదేవు
ఆ. వెలయ మఱియుఁ గల్గువీరమాహేశ్వరా
చారపరుల వీరసత్యవ్రతుల
వీరసచ్చరితుల వీరవిక్రములను
బరఁగ మ్రొక్కి తలఁచి భక్తితోడ. 11

వ. తత్ప్రసాదకరుణావిశేషప్రవర్ధమానకవితామహత్వసంపన్నుండ నైన మదీయాంతరంగంబున. 12

సీ. ఏపుణ్యకథ చెప్పి ఈభూమితలములోఁ
బాపసంచయమెల్లఁ బాయవచ్చు
నేపుణ్యకథ చెప్పి యితరులు వొగడంగఁ
గోటిపుణ్యంబులు గూర్పవచ్చు
నేపుణ్యకథ చెప్పి యుత్తరలోకంబులోఁ
బరమకళ్యాణంబుఁ బడయవచ్చు
నేపుణ్యకథ చెప్పి యింద్రాదిసురలచేఁ
బొలుపార సత్పూజఁ బొందవచ్చు
ఆ. నెట్టికథ రచించి యెవ్వరు నెఱుఁగని
యీశు నాదిదేవు నెఱుఁగవచ్చు

నేమికథ యొనర్చి యిలలోన సత్కీర్తిఁ
దనరవచ్చు నంచుఁ దలఁచి తలఁచి. 13

వ. తదీయవిచారచిత్తుండనై తత్కథారంభం బూహించుచున్న
సమయంబున. 14

సీ. పరమభద్రాసనప్రముఖమార్గంబుల
యోగీంద్రు లితఁ డాదియోగి యనఁగ
వీరవ్రతంబున వీరమాహేశులు
వీరమాహేశ్వరవిభుఁ డనంగ
సంతతానుష్ఠాన సత్కర్మనిరతిమై
బ్రాహ్మణు లుత్తమబ్రాహ్మణుఁ డన
వేదాంతసిద్ధాంతవిమలుఁడై చెలఁగుచో
జను లెల్ల ధర్మశాసనుఁ డనంగ

ఆ. వెలయుశంభుమూర్తివీరమాహేశ్వరా
చారవిభుఁడు భక్తిసాగరుండు
యనఘుఁ డివ్వటూరి యారాధ్యచంద్రుండు
సోమనాథసముఁడు సోమగురుఁడు. 15

మ. సరసుల్ పెద్దలు నీతిమంతులు కవుల్ జాణల్ బుధుల్ బంధు
వుల్, దొరలుం జాలఁబురోహితుల్ హితులు మంత్రుల్గాయ
కుల్ పాఠకుల్, సర్వవేదుల్ భరతజ్ఞు లాశ్రితులుదైవజ్ఞుల్
పురాణజ్ఞులుంగ, నరనాథుల్ శివభక్తులున్నిరుపమానందాత్ములై
కొల్వఁగన్. 16

వ. ఒక్కనాఁ డసమానమానసుండై యగణ్యరత్నాంచిత
మగువేదికాతలంబున సమున్నతకనకాసనంబున సుఖం బుండి
శైవపురాణప్రసంగాంతరంగుండై నన్ను రావించిన. 17

ఆ. భయము సంభ్రమంబు భక్తియుఁ గదురంగ
నతనిపాదయుగము నల్లఁ జేరి
పాణియుగము ఫాలభాగంబుఁ గదియించి
ముదముతోడ నేను మ్రొక్కియున్న. 18

వ. అయ్యవసరంబున సోమశేఖరుం డిట్లనియె. 19

సీ. సమయంబులాఱును చర్చించి చర్చించి
చదువులు నాల్గును చదివి చదివి
బహుపురాణంబులు భాషించి భాషించి
యితిహాసముల నెల్ల నెఱిఁగి యెఱిఁగి
కావ్యంబు లెన్నేని ఘర్షించి ఘర్షించి
యఖిలవిద్యలు నాత్మ నరసి యరసి
ఘనులతో సద్గోష్ఠిఁ గావించి కావించి
సకలకృత్యంబులు జరిపిజరిపి

తే. యున్న నిప్పుడు మాకెల్ల నూహలోన
వింతపండువుబోలెను వీరభద్ర
విజయ మెల్లను వినఁ గడువేడ్క యయ్యె
నది దెలుంగున రచియింపు మభిమతముగ. 20

ఆ. పిన్నవాఁడ ననియుఁ బెక్కుసంస్కృతులను
విననివాఁడ ననియు వెఱపుమాను
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైన
కవిత చెప్పలావు గలదు నీకు. 21

వ. అదియునుంగాక నీకు వీరభద్రేశ్వర ప్రసాదంబుఁ గలదు
కావున వాయుపురాణసారం బగు నీకథావృత్తాంతం
బంతయుఁ దెలుంగున రచియింపు మని యాన తిచ్చిన మద్దు

మని మధురవాక్యంబులకు నత్యంతానురాగ సంతుష్టుండనై
తదీయానుమతంబున మదీయవంశావళివర్ణనం బొనరించెద.

## కవివంశాభివర్ణన

క. వేమరు జగములు సేయఁగ
ధీమతిఁబరమేశు నానతిని దక్షుం డై
శ్రీమాధవుపొక్కిటఁగల
తామర నొకనలుమొగాలధాత జనించెన్. 23

క. విదితముగ నతనిమొగములఁ
జదువులు నాల్గును జనించె సరసతగాన
చ్చదువులు నాతనిసృష్టికి
సదమలుఁడు వసిష్ఠతపసి జననం బయ్యెన్. 24

వ. అట్టి వసిష్ఠపుత్త్రుం డగు కౌండిన్యుండు. 25

మ. ధనదుం డాయతపుణ్యమూర్తిమునిమందారుండు సన్మాన్యుఁ
డు, న్ముని నిర్నిద్రదయాత్ముఁడు న్నహితుఁడు న్మార్తాండ
తేజుండు భూతనయాధీశ్వరవర్ణనీయుఁడు తపోగణ్యుండు
నై నట్టికౌండినకుండ న్ముని సన్మునీంద్రపరుఁడై యుద్ధాత్రిఁ
గీర్తింపఁగన్. 26

వ. అట్టికౌండిన్యగోత్త్రంబునం దాపస్తంబసూత్త్రంబున. 27

ఉ. మల్లయభీమనాహ్వయకుమారకుఁ డన్నయమంత్రికిన్ దయా
వెల్లికి గౌరమాంబ కరవిందదళేక్షణకుఁ డై జనించి వ
ర్ధిల్ల వెలుంగుసజ్జనవిధేయుఁడు సోమనసామధేయుఁ డా
మల్లమయందుఁగాంచె సుకుమారులధీరుల సత్కుమారులన్.

ఉ. నీతి యుగంధరుం డనఁగ నిర్మలుఁడై ఘననాగరికుఁడై
ఖ్యాతత కీర్తిరేచనయు నన్నయమంత్రియు సర్వశైవలో

కాతురకారుఁ డెల్లనయు నయ్యలు ప్రగ్గడయు న్దయాగుణ
వ్రాతవిభూషణుండు జనవంద్యుఁడు మాచయ నాఁగ
నున్నతిన్. 29

క. అందుల మధ్యముఁ డెల్లన
మందరధీరుండు నీతిమంతుఁడు వనితా
కందర్పుఁడు మాచాంబిక
నందంబుగఁ బెండ్లియాడె నభినవకీర్తిన్. 30

ఉ. మానిని మాచమాంబకుఁ గుమారుఁడు యెల్లనకుం బ్రసిద్ధి
గా, మానుగ నుద్భవించిరి కుమారులు కేసనయుం గుణా
వళి, న్మానితుఁడైన మాధవుఁడు మాన్యుఁడు నిమ్మడి నాఁగ
మువ్వురున్, భూనుతులైరి తేజమునఁ బోలిరి ధర్మజభీమ
పార్థులన్. 31

ఉ. ఇమ్ముల నర్థికోటి ధన మిమ్మని పల్కిన పల్కకంటెఁ దా
నిమ్మడి నిచ్చు నిచ్చు మది నిమ్మడి పుణ్యముఁ బొందుభాతి లో
కమ్ములఁ గీర్తిఁ జెందఁగణకవ్రజమాన్యుఁడు మానికంబు మా
యిమ్మడి సర్వమార్గముల నిమ్మడి గాక తలంప నల్పమే. 32

క. సాధుగుణాఢ్యుఁడు కేసన
మాధవనందనుఁడు రూపమహితవిభూతిన్
మాధవతల్పము దక్షత
మాధవుఁ డనుకంపవృత్తి మాధవుఁడయ్యెన్. 33

ఉ. భూసురవంద్యునిన్ సుగుణభూషణు నాశ్రితకల్పవృక్షమున్
దానజనప్రసన్ను శివతత్త్వమనోరథకాతుకోన్నతున్
కేసనమంత్రి సత్యనిధిఁ గీర్తివిశాలుఁ జిరాయురున్నతున్ [న్.
జేసి యుమామహేశ్వరులు చెన్నుగఁ గాతురు గాక సత్కృప

క. మంచిగుణంబుల నీతఁడు
మంచిగదా మంచిపేరు మహిఁ దగు ననఁగా
నంచితవితరణఖనియై
మించిన తేజమ్ముతోడ మెఱసె ధరిత్రిన్. 35

ఉ. అట్టి ఘనుండు మంచికి దయాగుణధీమణి మాచమాంబకుం
బుట్టినలక్ష్మికన్య యనఁ బొల్పగు గోపనమూర్తి చెల్లెలిన్
నెట్టనఁ బెండ్లియాడె మహనీయుఁడు కేసనమంత్రి శ్రీసతిన్
దట్టపువేడ్కఁ గేశవుఁడు దాను వరించినభంగిఁ బొంగుచున్.

ఉ. పావనగంగ భోగశచి భాగ్యపుగౌరి గభీరభూమి సం
భావనకుంతి రూపగుణభారతిసంపదలక్ష్మిదేవి సం
సేవితసంజ్ఞ నిశ్చలవిశేష యరుంధతి యైనలక్ష్మి దాఁ
గేవలకన్యయే తలఁపఁ గీర్తనసేయఁదగుఁన్ ధరాస్థలిన్. 37

క. ఆ దంపతులకు సంతత
మోదితచిత్తులకు మిథునముఖ్యులకు దయా
పాదితగుణులకు శంకర
పాదయుగాంభోజభక్తిపారీణులకున్. 38

శా. పారావారుఁడు కాంతివైభవగతిన్ సంపూర్ణచంద్రుండు భూ
దారాహీంద్రసమానదక్షుఁడు సదాధర్మాకరుం డర్థిమం
దారుం డంచితరూపరేఖలను గందర్పుండు భూమీయశ
శ్శ్రీరమ్యుం డగుతిప్పనార్యుఁడు జనించెన్ వంశవర్ధిష్ణుఁడై.

వ. తదనుజుండనై యేను జన్మించి పోతయనామధేయుండనై
పరఁగి జనకశిక్షితవిహితాక్షరాభ్యాసుండనై వీరభద్ర
ప్రసాదలబ్ధకవితాతిశయంబున. 40

ఉ. *భాగవతప్రబంధమతిభాసురతన్ రచియించి దక్షదు
ర్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడ నైతి తన్నిమి
త్తాగతవక్త్రదోష పరిహారముకై యజనైకశైవశా
స్త్రాగము వీరభద్రవిజయంబు రచించెద వేడ్కఁ సాముదిన్. 41

## షష్ఠ్యంతములు

క. కరుణాంచితగుణమణికిని
సురుచిరబాలేందుబింబచూడామణికిన్
వరదైవశిఖామణికిని
జిరతరధీమణికి భక్తచింతామణికిన్. 42

క. హాలాహలభక్షునకును
శైలాదిప్రముఖదేవజనరక్షునకున్
ఫాలానలచక్షునకున్
శ్రీలలితవిచక్షణకును జితదక్షునకున్. 43

క. ముకుళితకరసురపతికిని
సకలబ్రహ్మాండభాండచయమాయానా
టకతంత్రసూత్రధారికిఁ
బ్రకటితవిస్ఫారమతికిఁ బార్వతిపతికిన్. 44

* ఈపద్యము పెక్కుమాతృకలయందుఁ గాన్పింపదు.

# ప్రథమాశ్వాసము

## కథాప్రారంభము

5. మత్సమర్పితం బగువితతవిస్ఫురితవీరభద్రవిజయాంచితకథాప్రసంగప్రారంభం బెట్టిదనిన మహితమాతులుంగమందారచందనసాల భల్లాతకీప్రముఖరాజితకుంభినీవిరాజితంబును కురువిందకుందమహిమ్లాత మధూకశతపత్ర కమలకల్హారకరవీరమల్లికాదివల్లీసంఫుల్లపుష్పవల్లీలలిత పరిమళసుగంధబంధురదిగంతరాళంబును నిజవిరోధంబుఁ దొఱంగినగతి వసియించు చంచరీకశారికాకీరసాకీలచక్రవాకనీలకంఠకనకనయన కంకసాళలింగక్రౌంచకారంభకారండకానకపోత పారావతశకుని భరద్వాజచకోరలావుకజీవంజీవవాయ పారాలికోయష్టికడిండిభపార పశాతఖండసారంగత్పదారంగగణనాదప్రమోదితంబును మండితగండభేరుండవేదండకంఠీరవశరభశార్దూలశంబరజంబూకగవయవరాహప్లవంగ శల్యసారంగచమరీమృగగోకర్ణవృకాదిమహామృగమందిరంబును దందశూకగాధేయమార్జాలమూషకనివాసంబును సకలపుణ్యతరంగిణీమంగళసంగమంబును వినిర్మలసరోవరవిలసితంబును అనుపమమునినాదనిరంతరబహుళపాఠ నిఖలనిగమకలకలారావఘటితగగనతలంబును ధర్మతపోధనధాన్యదానతాపసోత్తమ సంతతసంతుష్టమహామధూమసమ్మిళితబృందారకాలోకనంబును సర్వ

భువనమహారణ్యరత్నంబును సకలమునిజనస్తోత్రపాత్రంబును
నగునైమిశారణ్యపుణ్యక్షేత్రంబునందు. 45

చ. వెనుపగ దీర్ఘసత్ర మనువేరిటియాగముఁ జేసి పుణ్యులై
మును లొకకొంద ఱుత్తములు మోదముతో సుఖగోష్ఠి
నుండ నయ్యనిలుఁడు వచ్చి శైవకథ లన్నియు నిచ్చలుఁ
జెప్పుచుండఁగాఁ, దనరుచు నొక్కనాఁ డచటితాపసు లెల్లను
వాయుదేవుతోన్. 46

ఉ. శైవకథాప్రసంగములు శైవజనంబుల దివ్యకీర్తనల్
శైవపురాణసారములు శైవరహస్యములున్ మహాయశ
శ్శ్రీవర నీకుమానసము సిద్ధము నీ వెఱుఁగంగరాని యా
శైవము లేదు రూపమును సారము నీకు ముఖస్థమారయన్.

చ. శివకథ లెల్ల వేదములచేత నెఱింగినమేటి వీవ యో
పవనసురాసురేంద్రనుత భాసురపుణ్య సురాగ్రగణ్య యా
యవిరళవీరభద్రవిజయాకరసారసుధారసంబు మా
చెవులకు మన్మనోరథము చెల్వముగాఁ జిలికింపవే దయన్.

వ. అని మఱియు బహుప్రకారంబుల నమ్మహామునులు సంస్తుతింప
నవ్వాయుదేవుం డగణితసంతోషమానసుం డై యిట్లనియె.

సీ. దేవాదిదేవుని తెఱఁగెట్టిదందమా
తెఱఁగు లెల్లను బుట్టు తెఱఁగుదాన
మదనమదారాతిఁ జదివెదమందమా
చదువుల కెల్లను మొదలుదాన
బ్రహ్మాదివంద్యుని బరికింతమందమా
బ్రహ్మాదులకునైన బ్రహ్మదాన

జేవకోశాధ్యుని చెలికాడముందమా
తెలిసిన మీఁదటిధృతియుఁదాన

తే. యెంత యనఁగ నేర్తు నేమని వర్ణింతు
నేది యాది యంత్య మేదియరయ
సకలమునకు నతనిసంతతానందంబు
నెఱిఁగి కొలఁదిసేయ నెట్లువచ్చు. 50

వ. ఐనను నానేర్చువిధంబున మీరడిగినయర్థంబు సవిస్తరంబుగా వినిపింతు నని యమ్మహామునులకు వాయుదేవుం డిట్లనియె.

ఉ. తొల్లియుగాదులందు భవదూరుఁడు చంద్రవిభూషణుం
డుమావల్లభుఁ డాదినాయకుఁడు వాసవవంద్యుఁడు వెండి
కొండపై, నెల్లగణంబులుఁ గొలువ నేర్పునఁ బర్వతరాజ
పుత్రితో, నల్లలితాత్ముఁ డై సకలసంపదలం గొలువుండె
సొంపుతోన్. 52

వ. ఇట్లు పరమేశ్వరుండు రజతధరణీధరశిఖరంబున నగణ్యరమ్యోత్తరరత్నసింహాసనంబునం గొలు వున్నసమయంబున. 53

క. వారునకుఁ దమపనులన్నియు
వరుస న్విన్నపము సేయవలెనని దేవా
సురమునిగంధర్వాధిపు
లరయఁగఁ గైలాసమునకు నరిగిరి ప్రీతిన్. 54

క. చదువులు పెక్కులుగల వా
చదువులకును మొదలునాల్గుచదువులు
గలవా చదువులకు మొదలుగలిగిన
చదువులు గల శంభుఁ గొలువఁ జదువులు వచ్చెన్. 55

ఉ. పన్నగవైరి నెక్కి యిరుపక్కియల న్మను లర్థిఁ గొల్వఁగా
సన్నుతి నారదాదియతిసంఘము సేయగ నభ్రవీథిపై
నున్నతమై మణుల్ వెలుఁగ నూర్జితకీర్తిరమావిభుండు దాఁ
బన్నగకంకణుం గొలువ భాసురుఁ డై చనుదెంచె నెమ్మితోన్.

ఉ. తారతుషారహార హిమధామసితాంబుజశారదాభ్రమం
దారనిభోజ్జ్వలం బగుచుఁ దద్దయు వేగ మరాళవాహుఁ డై
భూరిగుణాకరుం డమృతభుక్పతివంద్యుఁడు ధాత వచ్చె వి
స్ఫారుఁడు భారతీవిభుఁడు పార్వతినాథునిఁ గొల్వ భక్తితోన్.

ఉ. దేవజనాధినాథులును దేవగురుండును సంస్తుతింప నై
రావణదంతి నెక్కి తగు రాజకదంబము చక్రవర్తులున్
వావిరిఁ గొల్వఁగా నిగమవంద్యునిఁ గొల్వ శచీవిభుండు స
ద్భావుఁడు నాకవల్లభుఁడు ధన్యుఁడు వచ్చె నగణ్యపుణ్యుఁ డై.

క. శిఖ లయ్యేడును వెల్గఁగ
సుఖతర మగు నజము నెక్కి శోభిల్లుచుఁ ద
న్నఖిలమునులు నుతి సేయఁగ
నఖిలేశ్వరుఁ గొల్వ వచ్చె ననలుఁడు ప్రీతిన్. 59

క. దండప్రచండహస్తులు
మండితగతిఁ దన్నుఁ గొలువ మదమహిషారూ
ఢుండై వచ్చెఁ గృతాంతుఁడు
ఖండితశుండాలదనుజు కడకుం గొలువన్. 60

క. మిక్కిలి విభవము మెఱయఁగ
గ్రక్కున మానవుని నెక్కి కడువేడుకతోఁ
జక్కని నైరృతి వచ్చెను
చుక్కలరాయనిధరించు సుభగునిఁ గొలువన్. 61

క. మీనంబునెక్కి వరుణుఁడు
కానుక లెన్నేని గొనుచుఁ గాంతలు గొలువన్
దా నరుగుదెంచె రాజిత
మీనధ్వజహరుని గొలువ మించినభక్తిన్. 62

క. గౌరీనాయకుఁ గొలువఁగ
సారంగధ్వజుఁడు నగుచు సంభ్రమలీలం
దారాపథమున వచ్చెను
దారాచలశిఖరమునకుఁ దద్దయు వేడ్కన్. 63

ఉ. మంగళదివ్యసంపదలు మానుగ నన్నియుఁ గొంచు గిన్నరుల్
ముంగలఁ బేర్మితో నడువ మోదముఁ బొంది తురంగవాహుఁ
డై, సంగతి సిద్ధులు న్నరులు సంయములుం దను గారవింపఁ
గా,సంగడికానిఁగొల్వ నతిసంపద నేఁగెఁ గుబేరుఁడాఢ్యుఁడై.

క. గణనాథులు కొల్వఁగ గో
గణపతివాహనుఁడు భుజగకంకణుఁ గొలువన్
గణుతింపరాని వేడుక
ఫణిధరుఁ డీశానుఁ డరిగె భవ్యాత్మకుఁడై. 65

వ. ఇవ్విధంబున. 66

సీ. *పవిశిఖాదండాదిపాశధనుఃఖడ్గ
శూలచక్రదండసుభగు లగుచు
హంసతార్క్ష్యవృషాదివారిహయమృగఝష
కాషాయవేషితగమను లగుచు
సరసిజకింకరాసురధునీలఘుచిత్త
ఘనభూతి శ్రీరాజికలితు లగుచు

* ఈ పద్యము పెక్కుమాతృకలయందుఁ గనఁబడదు.

సంవర్త్యదకోదండమంగమితాభ్రస
త్త్వ ప్రభాభోగనిత్యాత్ము లగుచు
ఆ. హరిశిఖియమదైత్యవరుణచంద్రకుబేర
శివహరియజు లాదిశివుని గొలువ
నరుగుదెంచి రంత సానంద మైన కై
లాసమునకు శివునివాసమునకు. 67

వ. ఇట్లరుగుదెంచి సకలభువనప్రధానదేవతలును సప్తలోక
పాలురును సనకసనందనాది యోగీంద్రులును సిద్ధకిన్నరకింపు
రుషగరుడగంధర్వవిద్యాధరులును మార్కండేయఘటజ
మరీచి గౌతమకశ్యప వామదేవాత్రిభృగుదధీచ్యుపమన్యు
దుర్వాస నారదాదు లగుమహామునులును ననంతసంతసం
బునఁ గలధౌతధరశిఖరంబుఁ బ్రవేశించి దేవదేవుని
దివ్యాలయంబు డాయం బోయి తదీయద్వారంబున నంద
ఱుం బాదచారులై దౌవారికు లగుజయవిజయుల నాలో
కించి యి ట్లనిరి. 68

ఉ. ఎచ్చట నున్నవాఁడు శివుఁ డేమివిధంబున నున్నవాఁడొకో
వచ్చితి మెల్లవారమును వారిజలోచనుఁ డాదిగాఁగ మా
వచ్చినరాక నీవు గొలువవచ్చినవా రని చంద్రమౌళికిం
జెచ్చెర మీరువిన్నపము చేసి తగన్ మఱుమాట చెప్పుఁడా.

వ. అని పలికిన వారును నగుఁగాక యని శంకరునాస్థానమంటపంబు
దరియం జొచ్చి యద్దేవునకు నమస్కారంబు లాచరించి యి
ట్లనిరి. 70

ఉ. శ్రీవనితావిభుండు సరసీరుహగర్భుఁడు నింద్రుఁ డాదిగా
దేవతలు న్మునీంద్రులును దేవరఁ గన్గొన వచ్చినారు దు

గ్రావిభు కిప్పుడే యవసరం బని శ్రీమొగపాలినున్న వా
రేవిధ మింక వారలకు నేర్పడ నానతి యీవె శంకరా. 71

వ. అనవుఁడు నవ్విన్నపం బవధరించి వారలం దోడి తెండని యానతిచ్చిన వారును జని దేవతల కిట్లనిరి. 72

క. మీరాక విన్నవించిన
గౌరీపతికొలువులోనఁ గారుణ్యముతో
వారలఁ బుత్తెమ్మనిరీను
మీరలు చనుఁ డవసరంబు మేలని పలుకన్. 73

క. ముదమున హరియును నజుఁడును
చదువులు మును లాదిగాఁగ సకలజనంబుల్
మదనారిఁ గొలువ వచ్చిరి
పదపడి సంభ్రమము భయము భక్తియుఁ గదురన్. 74

వ. ఇవ్విధంబునఁ గొలువు చొచ్చి యమ్మహాదేవునిం గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి నిటలతటసంఘటిత ముకుళితకరకమలులును సర్వాంగపులకాంచితులును నై యిట్లని స్తుతియింపం దొడంగిరి. 75

క. జయజయ గౌరీవల్లభ
జయజయ గంగావతంస జయనిస్సంగా
జయజయ గోపతివాహన
జయజయ వేదాంతవేద్య జయ పరమేశా. 76

క. జయజయ పరమపరాయణ
జయజయ భవ్యానుభావ జయసర్వేశా
జయజయ త్రిపురాసురహర
జయజయ లోకాధినాథ జయ శ్రీకంఠా. 77

వ. అని మఱియు ననేకవిధంబుల నుతియించి తత్ప్రసాదకరుణా విశేషంబుల నానందించి యుచితాసనంబులనుండ రక్ష్యోలు వగమ్యరమ్యనిఖిల దేవతాజనకిరీటకీలితదివ్యమణి ప్రభాపటల దేదీప్యమాన తేజో మహిమాభిరామంబును అగణితగణాలంకృతంబును నసమానమానితంబును అనంతవైభవ ప్రమోదితంబును నై యొప్పుచున్న సమయంబున. 78

మ. వారి లాభంబె శిఖీ సుఖంబె యమ నిత్యానంద మే నైరుతీ యిరవే పార్థివ మేలె మారుతి సుఖంబే కిన్నరాధీశ్వరా పరిణామంబె శివాశివంబె ద్రుహిణా భద్రంబె గోవింద శ్రీకర మేయంచుదయాళుఁడై యడిగెఁ శ్రీకంఠుండు దేవాదులన్.

వ. ఇట్లు పరమేశ్వరుం డడిగిన నందఱు నాలాగునఁ దమతమ పరిణామంబులు విన్నవించి దేవా భవదీయకరుణావిశేషంబున సర్వసంపన్నం బై యుండుఁ గావున మాకు నేకార్యంబును నప్రతిహతంబై చెల్లుచుండు నని పలికి సుఖగోష్ఠినున్న సమయంబున. 80

దక్షుఁడు రజతగిరి కరుగుట

క. ఘనుఁడ దగుశంభుఁడు గొలువఁ
తనరుట విని మునులు గొలువ దక్షుఁడు వేగన్
జనియె రజతాద్రి శిఖరికిఁ
దనయంతనె యజ్ఞసాక్షుఁ దర్శింపంగన్. 81

క. చని గిరిమందిరుసన్నిధి
వినయంబున నిల్చియున్న వేడుక నతఁడున్
మునులను సంభావించిన
యనువునఁ దనుఁ గారవించె నప్పుడు కరుణన్. 82

వ. ఇట్లఖిలభువనాధీశ్వరుండు గారవించిన. 83

ఉ. అద్రిర శంకరుండు వినయంబున నా కెదు రేగుదెంచి సా
పెద్దతనం బెఱింగి తగఁ బెద్దఱికం బొకయించుకైనఁ దా
గ్రద్దనఁ జేయఁడయ్యె మఱిగౌరియు మన్నన సేయదయ్యె నీ
పెద్దలు నవ్వ లాతిమునిబృందముచాడ్పునఁ జేసి రిమ్మెయిన్.

క. అని తనపాలిటికర్మము
పెనఁగొని తనుఁ జుట్టుముట్ట ప్రేరేపంగాఁ
జెనఁటి యగుదక్షుఁ డప్పుడు
మనమునఁ గోపంబు నొంది మలహరు విడిచెన్. 85

వ. ఇట్లు దేవదేవునిమహత్త్వంబుఁ దెలియక వృథావైరంబున దక్షుం డటు వాసి చనియు నంత నమ్మహేశ్వరుఁ గొల్వవచ్చిన దేవేంద్రాదిబృందారకసంఘంబులు పునఃపునః ప్రణామంబు లాచరించి చనిరి తదనంతరంబ. 86

క. అక్కడ దక్షుం డరుగుచుఁ
జొక్కుచు స్రుక్కుచును సిగ్గు వొందఁగఁ గోపం
బెక్కువ గా నంతంతటఁ
జిక్కుచుఁ దలపోఁతనొంది చిత్తము గలఁగన్. 87

క. నాకులు వచ్చిన నిచటికి
నాకును రానేల నేఁడు నా కిందులకున్
రాకున్న నేమికొఱఁతగుఁ
బ్రాకటముగ ధిక్కరింపఁ బడితిం గాదే. 88

క. దేవత లందఱుఁ దమకొక
దేవతవలె నెంచుఁ దన్ను దేవర యంచున్

వావిరిఁ గొలిచిన నా కీ
దేవర వలదనుచు మాఱు తెచ్చెద ననుచున్. 89

ఆ. జాలిఁబడుచు నలఁగి లోలోనఁ గుందుచుఁ
జిన్నవోయి మొగము జేవురింప
నింటి కరిగి యున్న నీక్షించి యిట్లని
పలికె దక్షుఁ జూచి భార్య ప్రీతి. 90

క. మనయల్లుని మనబిడ్డను
గనుఁగొంటిరె మంగళంబె కరుణ స్వారే
మని మిమ్ము గారవించిరి
వినిపింపుఁడు వీనులలర వినియెద ననినన్. 91

వ. దక్షుం డి ట్లనియె. 92

మత్తకోకిల. మాకు మామ గదా యితం డని మన్ననల్ దగఁ
జేయఁడే, లోకనాథుఁడ నంచు గర్వము లోలతం బడి
యున్నవాఁ, డికతంబుల నేమి చెప్పుదు నింతిరో విను నాకు
నున్, నీకుఁ గూఁతురు నైనగౌరియు నిక్క మేమియుఁ
బల్కదే. 93

మత్తకోకిల. కాన నిఁకను దీనికిం బ్రతికార మే నొనరించెదన్
బూని చేసెద నేఁటియజ్ఞముఁ బూజ చేసెదఁ గేశవున్
మానులున్ వసువుల్ దిగీశులు మర్త్యు లుండఁగ నొప్పఁగాఁ
మానినీ చను దెంతు రిచ్చట మాటమాత్రనఁ బిల్చినన్. 94

మత్తకోకిల. పిలుతు దివ్యుల నందఱిన్ వెలిబెట్టు దిప్పుడు భర్గు
నిన్, వెలయ నిశ్చయ మిట్టి దంచును వేదవేద్యమహాత్త్వ
మున్, దలఁప గోచర మైనఁ దొట్టిన దామసంబునఁ గ్రొంగి
యాఖలుఁడు దక్షుఁడు పాపదక్షుఁడు కర్మదక్షుఁడదక్షుఁడై.

—● దక్షుఁడు దివిజులఁ బిలుచుట ●—

క. హరితపనరాజకమలజ
హరిశిఖియమదనుజవరుణవాయుకుబేరే
శ్వరకిన్నర మునివరసుర
గరుడోరగసిద్ధసాధ్యఖచరులఁ బిలిచెన్. 96

క. పిలిచిన సౌరభములతో
నలరుచుఁ జనుదెంచి వార లప్పుడు దమకుఁ
వలనగు తావుల నుండిరి
కలకలమై వివిధనిగమఘనరవ మొదవన్. 97

క. అల్లుండ్రఁ గూఁతులందఱఁ
బొల్లమితిం బిలిచితెచ్చి పూజనలిడుచుఁ
కల్లతనంబున దక్షుఁడు
చెల్లింపఁ దొడంగెఁ గ్రతువు శివరహితముగన్. 98

క. అంతట నారదముని దా
నంతయుఁ గని నవ్వి దేవతారాధ్యుఁడు దా
నెంతయు నిచ్చట లేఁడని
సంతసమునఁ జనియె రజతశైలముకడకున్. 99

—● నారదుఁడు పార్వతికి దక్షుఁడు యజ్ఞము చేయుటఁ దెలుపుట ●—

క. చని దాక్షాయణిఁ గనుగొని
వినతుండై కేలుమోడ్చి విన్నపము వథా
రనవరతసురవరార్చిత
వనజాయతనేత్ర గంధవారణగమనా. 100

ఉ. తల్లి మీజనకుండు దక్షుఁడు మదాంధప్రేరితస్వాంతుఁడై
ఫుల్లాంభోజదళాక్షి తత్త్వముఁ దలంపక లేక వెల్వెట్టి శో

భిల్లం దక్కినభూరిదేవగణముల్ బిల్పించి దుర్యాగముం
జెల్లింపం దమకట్టినాఁడిదె మిముం జింతింపఁ డింతేనియున్.

వ. అని విన్నవించి. 102

క. ఇది నారా కని ముని నా
రదుఁ డరిగినపిదప గౌరి రాజానన దా
మదసారికి నెల్లప్పుడు
మది దప్పనిభార్య గాన మనమునఁ గలఁగెన్. 103

క. చదువులు పెక్కులు చదివియు
మదిమదిమయి యుండి నేఁడు మలహారువెలిగా
నిదియేల చేయఁ దొడగెను
మదమున నని వగచుఁ బదరు మదిలోఁ బెగడున్. 104

క. ఏ వినుపింపక యుండఁట
దేవాధీశుండు వినినఁ దెగువఁగ్ గోపం
బేవంక వ్రాలి చొచ్చునొ
యేవిధ మొనరింతు దీని కేమి దలంతున్. 105

ఉ. చెప్పినఁ దప్పువచ్చునొకొ చెప్పక యున్నను దప్పువచ్చునో
తప్పు దొలంగరానియది దారుణ మెమ్మెయి నాథుచేత నే
యొప్పున నైనుండెదను యొప్పమినైనను నిర్వహించెదన్
దప్పినఁబిన్నబుద్ధి యగుఁదా ననుచున్మదినిశ్చయంబుతోన్.

క. వడవడవడకుచు నుడుగుచుఁ
జిడిముడిమయినొంది కలఁగి చింతాకులయై
వెడఁగుఁదనంబున నిలుచుచుఁ
గడువాడినపువ్వుభంగిఁ గాంతి దొలంగన్. 107

క. పెదవులు దడవ్రుచుఁ గొంకుచు
వదరుచు బెగడుచును నడుగు లల్లననిడుచున్
వదనము వంచుచు నడఁగుచుఁ
దుదినాలుక తొట్రుపడఁగఁ దౌవ్వాలి వగతోన్. 108

క. చను దెంచి శంభుకట్టెదు
రను నిలిచి కరంబు మోడ్చి యపహారు ద్విప
ఘ్న కుంభిదైత్యవిదళన
వనజాతభవాండజనకవనజాక్షనుతా. 109

క. కఱకంఠ మిమ్ముఁ బిలువక
తెఱగించక లేక మిమ్ముఁ దెలియక దక్షుం
డఱిమిఱి యాగము సేయుచు
మెఱయుచున్నాఁడు రాజమిహిరాగ్నదృశా. 110

ఉ. నాథ శచీమనఃకమలనాథుఁడు కిన్నరనాథుఁడున్ రమా
నాథుఁడు భారతీహృదయనాథుఁడు పంకజనాథుఁడున్ జగ
న్నాథ దురాత్మునోమునకు నందముఁ బొందుచుఁ బోయి
నారు మహా,నాథసురాధినాథదిననాథభుజంగమనాథవందితా.

క. మఱియును దక్కినసురలును
గరుడోరగయక్షదైత్యగంధర్వాధీ
శ్వరు లెల్లఁ జన్నవారలు
దురితాత్మునియాగమునకు దురితారాతీ. 112

క. ఇదితొల్లి లేనిచందం
బదియేమో యింతచంద మవధారనితాఁ
గదలక కుదురై నిలిచిన
ముదితం గని కరుణమదిని మునుకొని నిగుడన్. 113

వ. పరమేశ్వరుం డి ట్లనిరియె. 114

చ. చనుపకగంధి నీపలుకుసంగతి చాలదు వాఁడు దివ్యులకా
మునులను బిల్చి నోము పెనుమూఢత నోచిననోముఁగాక
యౌవనజనిభాననా యుచితవాక్యము లేలొకొ నీతులేలొ
కో, మనమునఁ బిల్వమి న్మనకు మాన్యత కేమి కొఱంత చం
డికా. 115

ఉ. మెచ్చనిమామలిండ్లకును మే కొని శోభనవేళఁ బిల్వమిం
బొచ్చెముగల్గుఁబోఁ దగుట పోలదు నల్లుర కెజ్జగంబులం
బొచ్చెము లేదు కన్యలకుఁ బుట్టినయిండ్లకుఁ బోవ లోకము
న్మెచ్చును బొమ్ము పబ్బముకు మీతలిదండ్రులఁజూడఁబైదలీ.

గీ. అనుచుఁ జంద్రజూటుఁ డానతి యిచ్చిన
శివుఁడు దన్ను జేటుచేసె ననుచు
ఫాలమందు పాణిపద్మము ల్దరియించి
వెలఁది మ్రొక్కి నిలిచె వెఱపుతోడ. 117

మత్తకోకిల—

తల్లి యాదిగఁ దండ్రి యాదిగఁ దాత యాదిగఁ గల్గువా
రెల్లభంగుల నీవె కాని మహేశ యన్య మెఱుంగ నే
నుల్లమందునఁ జిత్తగించితి వొప్పముల్ దగు నయ్య యా
ప్రల్లదుం డట నాకుఁ దండ్రి భరంబు వల్కితి శంకరా. 118

వ. ఇట్లని. 119

మత్తకోకిల.—

శ్రీలలాటము సంఘటించిన చేతులా నవి నాళినీ
లాలకల్మదభృంగముల్ నయనాళికల్వలు జక్కవల్

పాలయిండ్లు మరాళముల్ నడభక్తి నీరుకడల్ దగక్
గాలిగాఁ గలకంఠి నిల్చెఁ గొలంకుభంగి దలంకుచున్. 120

వ. అప్పుడు దరహాసితవదనుండై యప్పరమేశ్వరుం డిట్లనియె.

ఉ. మాటలు వేయు నేమిటికి మాకడ నీవును నేము నీకడం
బాటలగంధి యుండుదుము పాలకళిద్దము నర్థ మట్లు నా
మాటలుదాఁటఁ గా వలదు మన్నన నీచెలు లెల్లఁగొల్వఁగా
వోటిరొ పొమ్ము నీజనకు పొందగునోమునకుం గుటుంబినీ.

దాక్షాయణి దక్షునింటి కరుగుట

చ. అని నియమించి శంభుఁడు గణాధిపులన్ బిలిపించి దక్షునం
దన తనపుట్టినింటికిని ధన్యత జన్నము జూడఁబోయెడిన్
దినకరమండలప్రభల దివ్యవిమానముఁ దెండురండు పొం
డనవుడు వారు దెచ్చి రతిపాటకదివ్యవిమానరాజమున్.

వ. అంత నప్పరమేశ్వరియు నమ్మహాదేవునకు వినయభ్రాంతగ
కరణయై సాష్టాంగదండప్రణామంబు లాచరించి యమ్మహా
దేవు ననేకప్రకారంబుల నుతియించి యద్దేవు ననుమతం
బున నానాసహస్రకోటితరణికిరణ ప్రభోజ్జ్వలంబై నభోభా
గంబు విడంబించు సువర్ణాంచితం బగుదివ్యవిమానంబునఁ
బ్రవేశించి యందు సుందరరత్నాంచితాసనాసీనయై యుండు
నవసరంబున. 124

సీ. వీణియ నీవు దే వీణాసుభాషిణి
మృగనాభి నీవు దే మృగనిభాక్షి
రాజహంసికఁ దెమ్ము రాజహంసికయాన
కీరంబు నీవు దే కీరవాణి

మణిహారములు దేహ్యు మణిగణాలంకృత
పుష్పములు నీవు దే పుష్పబోడి
గంధంబు నీవు దే గంధసింధురయాన
కనకంబు నీవు దే కనకవర్ణ
ఆ. పాలతీయాడుపసిండి బొమ్మలు నీవు దే
పసిడిబొమ్మఁ బోలుపడఁతి మఱియు
వలయునట్టి పెక్కువస్తువు*ల్ గొనిరండు
గౌరివెంట మనకుఁ గదలవలయు. 125
వ. ఇవ్విధంబున నమ్మహాదేవి చెలికత్తెలు మొత్తంబులై తమలో బహుప్రకారంబులఁ బను లేర్పఱిచికొని ప్రమథగణసుందరీ సమేతంబుగా గజకర్ణ లంబకర్ణ లంబోదరసూర్యవర్ణసోమవర్ణ శితమాయ మహామాయ మహేశ మృత్యుహారాదులు మొదలుగాఁగల మహాప్రమథగణంబులు గొలువ దివ్యవిమానారూఢ యై యుండె నప్పు డవ్విమానంబు ముందంబున గడపం దొడంగి రంత నదియును మనోవేగంబున దక్షుని యాగమంటపమ్ముఁ గదిసిన నక్కన్యకారత్నంబు తన సఖీజనంబులుం దానును గగనగమనంబు డిగ్గి. 126
చ. సలలిత మై గణోత్తములు ఝల్లనిపించు పసిండిదండముల్
కలఁగొనఁ బట్టి బిట్టు త్రిజగన్నుతవల్లభ వచ్చె వీరహో
తలఁగి తొలంగి పాయుఁ డని తాపసు లాదిగ నెల్లవారలన్, జలమున బాయఁ ద్రోయుచును సందడి వాపి గణాళిఁ గొల్వఁగన్. 127

* లెల్లను జిక్కుకుండఁ దెండు చెలువలెల్ల.

సీ. వేదండగమనలు వింజామరలు వీవ
పల్లవాంఘ్రులు వేడ్కఁ బలసి నడువ
లలితరంభోరువు ల్వెలిగొడుగులు పట్ట
సైకతజఘనలు సన్నుతింప
హరిరాజసమమధ్య లంకించి పాడంగఁ
గరికుంభకుచలు మంగళము నుడువ
కమలబాహులతలు కళ్యాణములు పాడ
రాజనిభాస్యలు రమణఁ గొలువ
ఆ. లోల మీనభృంగలోచన ధమ్మిల్ల
వతులు గొంద అతులగతులనడువ
తల్లిదండ్రి చెలుల దర్శింప నమ్మహా
కాళి నడచె యాగశాలకడకు. 128

వ. ఇట్లు నడచి. 129

మ. ఘనహేమోన్నతయాగమంటపముపైఁ గళ్యాణి నిల్చుండఁ
గాఁ, గనియుం గాననియట్లు వోరెుఁ దగుసత్కారంబులం
దేమిటన్, వనితం దల్పకపోయె తొల్లిటి వృథావైరంబుతోఁ
బూజలన్, దనిపెం గూఁతుల నల్లురన్ దివిజాలన్ దక్షుండు
దత్పూత్తుఁడై. 130

దక్షుఁడు దాక్షాయణిం దిరస్కరించుట

ఆ. అట్టివిధము చూచి యాత్మలోఁ గోపంబు
పుట్టుటయును ధీరబుద్ధి నద్రి
కన్యయైన మేటి గావున సైరించి
సామవృత్తి నాదిశాయ పలికె. 131

శా. తండ్రీ నీదగు నోము చూడఁ దగమా తర్కింప నాపిన్న చె
ల్లెండ్రం బిల్చియు నన్నుఁ జీరవు మదీయాధీశు నీయున్నయ
ల్లుండ్రంబిల్చియుఁ బిల్వరావు యిలవేల్పుల్ గర్తలేవ్వాఁజనల్
వీండ్రం జేసిన నేమి గల్గు చెపుమా విశ్వేశ్వరుం డుండఁగన్.

శా. దేవేంద్రాదిదిగీశసంఘములకున్ దివ్యప్రభావత్తులే
దేవుం డిచ్చె ధరాధరుం డజరుఁ డేదేవుండు శేషాహికే
దేవుం డిచ్చె నగణ్యదక్షత జగద్దేవేశుఁ డెవ్వాఁడు త
ద్దేవుం డిచ్చును నేఁడు రావలవదే ధీయుక్తిఁ జింతింపుమా.

క. ఏదేవుకతన విష్ణుం
డేదేవునికతన బ్రహ్మ యీడేరిరి తా
మేదేవుఁ గూర్చి బ్రతికిరి
యాదేవుఁడు రాక వీరి కరుగం దగునే? 134

క. అనవుడు దక్షుం డదరుచుఁ
గనలుచుఁ గోపించి చూచి కమలదళాక్షీ
విను నీకంటెను నెక్కుడు
వనితము నీయున్న కూఁతులందఱు గౌరీ. 135

తరల:—

పరగ నీతనయాధినాథులు భాగ్యవంతులు శ్రీయుతుల్
వరుసఁ దల్లియుఁ దండ్రియుం గలవారు నిత్యమహావ్రతుల్
ధరణిలోఁ గులగోత్రవంతులు తద్‌జ్ఞు లెందుఁ దలంపఁగా
తరుణి యున్నియు నేల నీపతి తల్లిదండ్రులఁ జెప్పుమా. 136

సీ. కట్టంగ దిక్కులే కాని కోకలు లేవు
పూయ గంధము లేదు భూతిగాని

కాలకూటమెకాని కంఠమాలిక లేదు
ఫణిగాని తొడుగంగ మణులు లేవు
పలినాకసమెకాని తలపెండ్రుకలు లేవు
తలకుఁ బువ్వులు లేవు నెలయకాని
కుడువ గంచము లేదు పెడదపుర్రెయకాని
యొక్క గుఱ్ఱము లేదు యెద్దుగాని
ఆ. మూఁడుమూర్తులందు మొంగి నెవ్వఁడునుగాఁడు
జాతి లేదు పుట్టుజాడ లేదు
పరముఁ డొంటిగాఁడు బ్రహ్మాదు లెఱుఁగరు
తిరుగుజోగిఁ దగునె దేవుఁడనఁగ. 137
ఉ. లోకములోన లేఁడు నృపలోకములోనన లేఁడు కుండలీ
ల్లోకములోన లేఁడు మునిలోకములోనను లేఁడు దేవతా
లోకములోన లేఁడు సురలోకములోనను లేఁడు వెఱ్ఱిమం
బోఁకలఁబోవు చేనెఱిఁగి పూజలు సేయఁగ నెంతవాఁడొకో.
క. తానెక్కడ నే నెక్కడ
తా నాకుం దలప సరియె తనుఁ గొలువంగా
నేనాఁడు వచ్చి నిలచిన
తానాకుఁ బ్రియంబు సేయఁ దలఁచెనె చెపుమా. 139
క. నీనాయకుఁ డల్లుం డగుఁ
గాని మము ధిక్కరించెఁ గాక భవానీ
మానుగఁ గనియును నీవును
కాననిగతి నుండ లేల గర్వము లేలా. 140
క. చెలువా పిలువక ముందట
వలనటె మాయింటి కేల వచ్చితి చెపుమా

పిలువని పేరంటము పని
గలవారువుబోలె సిగ్గు గాదె రాఁగన్. 141

వ. అనవుడు నమ్మహాదేవి కోపవివశ యై యయ్యాగమంటపం
బున సుఖాసీను లై యున్న సభాసదుల నవలోకించి యి
ట్లనియె. 142

చ. నిగమములార ధర్మపదనిర్ణయులార మునీంద్రులార యో
నిగమముఖోత్తములార ఘననిర్ణయులార దిగీంద్రులార భూ
గగనచరాదులార భవఖండనులార యతీంద్రులార యే
నిగమములందుఁ జెప్పె శివనింద యెఱింగితి రేనిఁ జెప్పరే.

చ. ఎఱుఁగరు బ్రహ్మవిష్ణువులు నిం తని కానఁగ లేరు దేవతల్
గురియిడ లేరు తాపసులు గోచరనీయులు గాని యోగులా
పరముఁ దలంప లే రతని భాగులగణ్యము లిట్టిచోట వీ
డొఱపున శంకరుం దెగడనోపె సభాసదులార వింటిరే. 144

ఉ. వేదములం దెఱింగినవివేకము లెక్కడఁ బోయె నేఁడు పు
ణ్యోదయబుద్ధి యెం దణఁగి యున్నది నేఁడు దపంబుఁ బొల్లయే
నీదగుదక్షతాద్భుతము నీతియు నెక్కడ దాఁగె నేఁడు బ్ర
హ్మాదులఁబోలు ప్రజ్ఞ యది యారడి వోయెనె నీకు నక్కటా.

శా. ఏరా దక్ష యదక్షమానస వృథా యీదూషణం బేలరా
యోరీ పాపము లెల్లఁ బో విడువరా యుగ్రాత్ముఁ జేపట్టరా
వైరం బొప్పదురా శివుం దలఁపరా వర్ణింపరా రాజితో
త్కారాత్ముం డగు నీలకంఠుఁ దెగడంగా రాదురా దుర్మతీ.

క. చదువులు సాలుగు శివుఁ గని
యెదమించును వెదకుఁ గాని యెఱ్బ్యంగులఁ ద

త్పదములరూపముఁ గానక
పదపడి తమలోనఁ జిక్కుపడ్డవి దశా. 147

సీ. కలయ నీరేడులోకముల దొంతులతోడఁ
బొగొప్ప మూఁడురూపములతోడ
మూఁడుమంత్రములతో మూఁడుకాలములతో
భ్రమయించు పుణ్యపాపములతోడ
సలలితఖేచరాచరజంతుకోటితో
భూరితేజములతో భూతితోడఁ
జంద్రానలావనీజలవాయుగగనాత్మ
తరణులతోడఁ జిత్రములతోడ

ఆ. భర్గదివ్యమహిమ బ్రహ్మాండములుసేయుఁ
గాచు నడఁచుఁగాని కానరాదు
నిఖిలమెల్లఁ దాన నీవును నేనును
దాన కాన నింద దగదు సేయ. 148

వ. అదియునుంగాక. 149

క. దేవతలు మునులు గ్రుతమిడి
దేవుఁడు పరమేశుఁ డైనదేవుం డనుచుం
భావించినచోఁ జదువులు
దేవుఁడు శ్రీకంఠుఁడనుచుఁ దెలిపెనొ లేదో. 150

క. మఱి యాగంబులలోపలఁ
బురదనుజారాతి ప్రథమపూజ్యుం డెలమిం
సురలకు నందలిహవ్యము
లరయఁగ నతఁ డెలమినిచ్చె నంతయువినమే ? 151

క. విశ్వములోపలఁ దనరెడు
శాశ్వత మగు *శివునిమహిమ చెప్పఁగనీకుఁ
విశ్వాసంబును గల్గదు
యీశ్వరుమహిమాబ్ధి నీకు నెఱుఁగ న్వశమే. 152

మత్తకోకిల.—
సాహసంబున మందరంబును పారె కవ్వముఁ జేసితా
రూహతక్షీర పయోధిఁ ద్రచ్చుచు నున్న శ్రీరమణాదులన్
దాహదోహలనీలవర్ణులఁ దద్దయు న్వడిఁ జేయుహా
లాహల మ్మటుచేతఁ బట్టి గళంబులోన ధరింపఁడే. 153

క. బ్రహ్మశిరంబును ద్రుంచుట
బ్రహ్మాండము లతనియందుఁ బ్రభవించుటయున్
బ్రహ్మాదు లెఱుఁగకుండుట
బ్రహ్మాదులచేత వినవె భర్గునిమహిమల్. 154

క. శివుఁడెచ్చట వేంచేయును
శివతర మచ్చోటు వినుతిసేయఁగ వశమే
శివుఁడెచ్చట వేంచేయఁడు
శివుఁడెచ్చో నిండిలేఁడు సిద్ధము దక్షా. 155

క. హరుఁగూర్చి సేయుతప్పులు
హరమై యొప్పిద మొనర్చు నప్పురుషులకున్
హరుని వెలిసేయుతొప్పులు
హరమై తప్పిదము లనెడునది మఱచితివే. 156

క. ఖండేందుబింబభూషణు
నొండొరులకు నెఱుఁగవశమె యోహో వినుమా

* వేదసంజ్ఞ సద్విజ్ఞానమున్ శర్వదైవ్యభరిఁ జెల్లును.

మండితముగు నీయాగము
పండినతుదిఁ బండుపండు భర్గుఁడు కాఁడే. 157

క. అట్టిమహేశ్వరుఁ డిచటికి
నెట్టనరాఁగలఁడు చెఱుప నీయజ్ఞము నీ
పుట్టినదేహముతోఁడను
పట్టున శివుఁజేరరాదు పరమార్థ మిలన్. 158

క. ఈయొడలు రోఁత గాదే
పాయక పరమేశునొందఁ బని సేయంగా
వేయును నేటికి మాటలు
పోయెదరా కీడునొంది పొగిలి దురాత్మా. 159

దాక్షాయణి దేహంబుఁ దొఱఁగుట

సీ. అనుచు మహేశ్వరి యమరులు బెగడంగఁ
బూని భద్రాసనాసీన యగుచు
శంకరశ్రీపాదపంకజయుగళంబుఁ
దనమనస్సరసిలోఁ దనర నిలిపి
వెలుఁగుమూలాధారవేదిపై శివయోగ
వహ్ని మేల్కొలిపి యవ్వలను మిగిలి
తనుఁదాన చింతించి తరణిచంద్రులవడి
నరుగంగనీక ఘోరాగ్నిఁ దెచ్చి
ఆ. యందు నిల్పి దివ్యముగు తనమైదీఁగె
రాజహంసగమన రాజవదన
పరమయోగశక్తి భస్మంబుగాఁ జేసి
పుణ్యతనువు తరుణి పొందెనపుడు. 160

చ. తులు వగుదక్షునింట మఱితోఁచిన వేడిమి మంచుకొండలోఁ
దొలువక పోవ దన్న క్రియఁ దోయజలోచన గౌరి* బాలయై
లలితలతావరాంగసువిలాసిని యై కొమరాలు నై వని [కున్.
ర్మలగతి మేఁగెఁ గొండలకు రా జగుకొండకు మంచుఁగొండ

వ. అంతఁ దత్ప్రకారంబు వీక్షించి దక్షుమఖమంటపంబున సుఖా
సీనులై యున్న బ్రహ్మ విష్ణుసూర్యచంద్ర దేవేంద్ర దండధర
వరుణకుబేరాదిదేవజనంబులు మహాభీతచిత్తులైరి మూర్తి
మంతంబులైన మంత్రంబులు తంత్రంబులు చాలించె పాప
కర్ముం డగుదక్షుని నిందించి బ్రహ్మ తనలోకంబునకుం బోయె
మఱియుఁ దక్కినవార లందఱు తమతమ నివాసంబులకుం
జనిరి తత్సమయంబున. 162

సీ. కైలాసగిరిమీఁద కఱకంఠుఁ డొకనాఁడు
కర మొప్పఁ గొలువుండి గౌరిఁ దలఁచి
యిదియేమి రాదయ్యె నీరేజలోచన
యని యవ్విధం బెల్ల నాత్మ నెఱిఁగి
సుందరి తనకుఁ గూర్పుటయెల్ల భావించి
శంభుండు మనమునఁ జాల నొచ్చి
యిదియేమి పంపితి నీదక్షునింటికి
మీనాక్షి తా నేల చేసు వాసె

ఆ. పొలఁతి నిన్న నేను బొమ్మని తరిమినఁ
బోవనొల్లననియెఁ బువ్వుఁబోఁడి
పంకజాక్షి నొంటిఁ బంపినకతమున
వెల్తితనము వచ్చె వేయునేల. 163

* బాలయై.

వ. అని మఱియుఁ బరమేశ్వరుం డిట్లు గౌరీదేవి సనంతకరుణా పూరితమానసుండై తలంచి వెండియుఁ దనమనంబున. 164

మ. పుడమిన్ రాజ్యముఁ గోలుపోయి తగ నేడ్పుం బొంది శోకించు న్నజ్జడధి*శాంతకుఁ డైన యింద్రుని కిలన్ జన్మించి రోషాంబుధిం, బడ వైవస్వతమనువ్వనాఁడు ముద మొప్పన్ రాజ్యముం జేయఁగాఁ,గడ తేర్తున్నని పాపదక్షునకు వేగన్ శాప మిచ్చెన్ వడిన్. 165

శంకరుండు దక్షునకు శాపం బిచ్చుట

వ. ఇట్లు పరమేశ్వరుండు శాపం బిచ్చిన దక్షుండు దదీయప్రకారంబు నొందె నంత. 166

శా. ప్రాలేయాచలవల్లభుండు నియతిం బాటించి సద్భక్తితోఁ గాళీసుందరిఁ గూఁతుఁ గాఁ దలఁచి వేడ్కల్ పల్లవింపన్ యశశ్శ్రీలోలుండు తపంబు సేయ నచటన్ శృంగారసాంగత్యమై, లోలానందము బొంది యున్న నతఁ డాలోకించి సంరంభుఁ డై. 167

దాక్షాయణి హిమవత్పుత్త్రియై పుట్టుట

ఉ. చంచలనేత్రి యోముగుద చల్లనిచూపులతల్లి నిన్ను నేఁ గాంచిన యంతనుండి పులకల్ మెయినిండఁగ నంకురింప నీ మించినరాకయున్ విభుని పేరయు నీదగు పేరు పెంపు నీ మంచిగుణంబు లన్నియును మంగళవంతములంచు మ్రొక్కుడున్. 168

వ. అనిన సాకుమారీతిలకం బి ట్లనియె. 169

* శాక్షజ, శాక్షక.

శా. నానాథుండు మహేంద్రదేవమునిరాణ్ణాగేంద్రదిగ్రాజవాక్
శ్రీనాథాగ్రకిరీటకూటవిలసచ్ఛృంగారదివ్యప్రభా
నానారత్ననికాయ సంతతలసన్న వ్యస్ఫురత్పాదుకే
శానాలంకృతుఁ డీశుఁ డాతనికి నిల్లాలౌ శివాసుందరిన్. 170

క. నీకుం గూఁతుర నయ్యెదఁ
జేకొనుమీ తండ్రి యనుఁడు శ్రీకంఠున కీ
వేకాంత వైన నిజముగ
నీకుం గలరూపుచూపు నీవు కుమారీ. 171

తే. అనుడును హిమవంతు నాలోకనముఁ జేసి
తోలఁకునగవు మొగముఁ దొంగలింప
తండ్రి నీదుపుత్రి తానెంత యోకన్ను
లారఁజూడు మనుచు నంబుజాక్షి. 172

సీ. పొలుపారు నీరేడుభువనంబులకునెల్ల
మహితమై దేదీప్యమాన మగుచుఁ
గ్రొమ్మెఱుంగులమంటఁగూడియు నెంతయు
*వితతమైతోఁకుచు వెనుకరాగ
వచ్చికూడనిభంగి వలనించుకయు లేక
యేరుపఱుపరాక యెఱుఁగరాక
యేవర్ణమునుగాక యేరూపమునుగాక
కొలఁదియు లేకున్కి పొలయునట్లు

ఆ. కమలజాండమెల్ల గన్నియ దానయై
తోఁచియున్నఁ జూచి తొట్రుపడుచు

* పెన్నెలతో నెండ పెలసినట్లు.

మూర్ఛవోయి తెలిసి మోడ్పుఁగేలెనయుంగఁ
బడఁతి సన్నుతించెఁ బర్వతుండు. 173

## హిమవంతుఁడు స్తుతిసేయుట

ఉ. ఈపరిపాటియింత గల దిట్టవిధం బని నిర్ణయింపఁగా
నాపరమేశుఁ డైన కమలాక్షుఁడు నైన విరించి యైన వా
రోపరు యిట్లు నిన్నెఱుఁగ నోపుదురే పరులెల్ల నమ్మ నీ
రూపము సర్వమున్ గలుగురూపము గాదె తలంపఁ జండికా.

మ. నరదేవాసురపూజితాంఘ్రియుగళా నారాయణీ శాంకరీ
కరుణాపూరితమానసా త్రిణయనీ కళ్యాణ యుక్తా నిశా
చరదర్పోన్నతసంహారీ సదమలా చండార్చినీ యోగినీ
తరుణీ యోగమువందితా భగవతీ తల్లీ జగన్మోహినీ. 175

శా. నాకుం గూఁతురవైతి వీవు తరుణీ నాభోక్తదా నెంతయో
నాకుల్ మెచ్చఁగ నింత దేవరకుఁ గళ్యాణిన్ సమర్పించియా
శ్రీకంఠాంకున కిట్లు మామ యగునే శీతాచలుం డంచు ము
ల్లోకంబుల్ వినుతింపఁ గంటి నిపుడో లోలాక్షి నీసత్కృపన్.

క. నీయందె సకలగిరులును
నీయందె మహార్ణవములు నిలయున్ జగముల్
నీయందె యుద్భవించును
నీయందే యడఁగియుండు నిరుపమమూర్తీ. 177

క. ఉత్పత్తిస్థితిలయముల
కుత్పాదనహేతువనుచు నూహించి నినున్
దాత్పర్యంబున మునులును
సత్పురుషులు చెప్ప విందు సదమలమూర్తీ. 178

క. సన్నములకుఁ గడుసన్నము
నున్నతముల కున్నతంబు నొప్పిదములకున్
జిన్నెయన నొప్పు రుచులకుఁ
జిన్నన నీచిన్నిగుణము దేవీ గౌరీ! 179

క. నిన్ను మహేశ్వరుఁ డెఱుఁగును
నెన్నమహేశ్వరుని నీవు నెఱుఁగుదు గౌరీ!
యన్యులకెల్లను దరమే
నిన్నును నీనాథు నెఱుఁగ నిక్కము తల్లీ! 180

క. ధారుణి దివ్యాకారం
బారయ యొప్పిదముభంగి యది యిది యనఁగా
నేరరు బ్రహ్మాదులు నిను
నేరుతునే నీదుమహిమ నీరజనేత్రా! 181

వ. అని యనేకవిధంబుల నుతించి మఱియుఁ దుహినధరణీధర నాయకుం డిట్లనియె. 182

ఉ. పిన్నవు గమ్ము నీమహిమ పెంపుఁ దలంపక తప్పఁ జేసితిన్
గన్నులపండువయ్యె నినుఁ గంటిఁ గృతార్థుఁడ నైతిఁ జాలున
మ్మన్న యటంచుఁ బర్వతుఁడు మానుగ మ్రొక్కినఁ జూచి
కన్యయై, క్రన్నన నిల్చి తండ్రి మునుకన్నను ముద్దులుచేసి
వేడ్కతోన్. 183

వ. ఇట్లు ప్రసన్నయైయున్న నమ్మహీధరనాయకుం డిట్లనియె. 184

శా. శ్రీలావణ్యవిశేషపుణ్య యనుచున్ జింతింపఁగాఁ గంటి శ్రీ
కైలాసాద్రి మహేంద్రవల్లభునకున్ గన్యం దనం గంటి నీ
శ్రీలోలం బగుపాదపద్మయుగమున్ సేవింపఁగాఁ గంటి నీ
వాలింపం బరమేష్ఠినిన్ దనిపి యిట్లర్థించితేఁ బార్వతీ! 185

సీ. కడు నెండిపోయిన ఘనతటాకమునకు
వారిపూరము నిండ వచ్చినట్లు
తనరాక తఱిఁ జూచి వనజంబు లుబ్బంగఁ
బొలుపొంద నర్కుండు వొడిచినట్లు
కమలహీనంబైన కమలాకరంబులోఁ
గమలపుంజంబులు గలిగినట్లు
ఘనతమఃపటలంబు గప్పినమింటిపైఁ
దుది చంద్రబింబంబు దోఁచినట్లు
ఆ. గిరులలోన నొక్కగిరి నైన నాపేరు
వెలయఁ జేసి తిపుడు జలజనయన
నీకుఁ దండ్రినైతి నాకింత చాలదే
యిది మహాద్భుతంబు యిందువదన. 186

క. ఏ నీకుఁ దొల్లి కొడుకను
మానుగ నాకిపుడు నీవు మహిఁ గూఁతుర వై
మానిని పుట్టితి విప్పుడు
భూనుతముగ నాకు నిట్టిపుణ్యము గలదే. 187

చ. అని గిరినాథుఁ డుబ్బికొనియాడుచుఁ గానక కన్నకూఁతురన్
వినయముతోడ నెత్తుకొని వీటికి వేగమె యేగి యప్పు డ
ల్లన తనయుండు రాజధవళాయము చొచ్చి కుమారిఁ జూపు
డున్, గనుఁగొని సొంపుతో నతని కామిని మేనక సంభ్ర
మంబునన్. 188

ఆ. పాలయిండ్లమీఁది పయ్యెద వీడంగ
బన్నసరము లలర బారపాచి

కౌఁగిలించి వేడ్కఁ గమలాయతాక్షి తాఁ
గోర్కి పల్లవింపఁ గూఁతుఁ జూచి. 189

సీ. రా లోకసుందరి రా జగన్మోహినీ
రావమ్మ శైలాసరాజపత్ని
రా కన్యకామణీ రా రాజబింబాస్య
రావమ్మ యౌవనరాజ్యలక్ష్మి
రా ఓ మహాకాళి రాఓ సరోజాక్షి
రావమ్మ భారతీరమణవినుత
రా ఓ జగన్మాత రా ఓ సదానంద
రావమ్మ మత్తేభరాజగమన
ఆ. యనుచుఁ బెక్కుగతుల నంకించి యంకించి
దగిలి మేనకాఖ్య తన్నుఁ బిలువఁ
దండ్రి చెయ్యిడిగ్గి తద్దయు వేడ్కతోఁ
గామినీలలామ గౌరి యపుడు. 190

సీ. కలహంసనడలొప్ప ఘంటలరవమొప్ప
రంజిల్లు నూపురారావమొప్ప
పాటించికట్టిన పట్టుచెం*దియమొప్ప
బాలచన్నులమీఁద పయ్యెదొప్ప
కంఠహారములొప్పఁ గరకంకణములొప్పఁ
గడకఁ గేయూరాదితోడవులొప్ప
నన్నపునడుమొప్ప నవరైనపిఱుఁదొప్ప
లలితకనకకుండలములునొప్ప

* పట్టువస్త్రంబొప్ప.

ఆ. ఫాలుఁజూపులొప్ప నీలాలకములొప్ప
భూతితో నుదుటఁ ద్రిపుండ్ర మొప్పఁ
జిఱుత ముద్దులొప్పఁ జెక్కుటమెఱుఁగొప్పఁ
దరుణి జేరవచ్చె తల్లికడకు. 191

వ. ఇట్లు పార్వతీమహాదేవి డాయ నేతెంచి. 192

సీ. కమనీయమోహనాకారభారతి వచ్చె
దయతోడ నన్నుఁ గన్నతల్లి వచ్చె
చాతుర్యగాంభీర్య జగతికన్నియ వచ్చె
లాలితసంపదలక్ష్మి వచ్చె
భూరిలోకైకవిభూతిధారుణి వచ్చె
మంగళపావన గంగ వచ్చె
తెఱఁగొప్ప దేవాదిదేవవల్లభ వచ్చె
మానితంబగు మహామాయ వచ్చె

గీ. తల్లివచ్చెను నన్నేలుతల్లి వచ్చె
బాల వచ్చెను ప్రౌఢైకబాల వచ్చె
అబల కరుణింపనేతెంచె ననుచుఁ దిగిచి
కౌఁగిలించెను మేనక గౌరిఁ జూచి. 193

వ. అప్పుడి ట్లనియె. 194

శా. నీవా సర్వజనైకమాతవు సతీ నిన్నుం మహాభక్తితో
దేవేంద్రాదులు పూజసేయుదురు నీధీరత్వమా యెవ్వరుం
భావింపం గలవారులేరు నిఖిలబ్రహ్మాండభాండావళుల్
నీవే సేయు మహేంద్రజాలతతులే నీలాలకా బాలికా.

సీ. చిలుకలకొల్కివే శృంగారగౌరివే
మముఁ గన్నతల్లివే మగువ నీవు

వర మేరు నమ్మినపట్టంపుదేవివే
మిన్నేటిసవతివే మెలఁత నీవు
నాతపగఫలమవే నన్నేలుశక్తివే
నాముద్దుపట్టివే నాతి నీవు
మూఁడులోకములకు మూలంపుమూర్తివే
యవ్వలతల్లివే యతివ నీవు
ఆ. అమ్మ నిన్నుఁగన్నయంత నుండియు నాకు
బలసి కోర్కె లెల్లఁ బల్లవించెఁ
గోమలాంగి నీవు కూఁతుర వైతివి
కన్య యిట్లుభోక్త గలదె నాకు. 196
క. అని యిట్లు మేనకాంగన
ఘనముగ నిచ్చలును దగిలి గౌరవమున స
న్ననసేయుచు భాషించుచుఁ
జెనుపున గౌరికుమారిఁ జెనుచుచు నుండెన్. 197
ఆ. ఇట్లు గౌరిదేవి హిమశైలపతియింట
నమర ముద్దుబాల రై చరించి
కొంతగాలమునకుఁ గోమలి వెలుగొందె
సకలజనులు దన్ను సన్నుతింప. 198
సీ. ఒకనాఁటి కొకనాఁటి కొక్కొక్కమిక్కిలి
రేఖ నొప్పెడి చంద్రరేఖమాడ్కి
నొరగింపఁ గరఁగింప నొక్కొక్కవన్నియ
గలుగుచునున్న బంగారుకరణి
నాఁడునాఁటికిఁ బోవనవకంబుఁ గొనుచెల్వు
గంగాప్రవాహంబుఁ దొంగలింపఁ

జనుఁడోయి క్రిక్కిరి సౌరభ్య తనువుతో
నొప్పులకుప్పయై యుప్పతిల్ల
తే. అనుదినంబును నొకచంద మతిశయిల్ల
సమ్మహాదేవి యభివృద్ధి నలరుచుండె
పొందఁ గల్గునొక్కొ భూతేశు భువనేశుఁ
బంచముఖుని ననుచుఁ బలుకుచుండు. 199

శా. రంగత్స్ఫారమనోరథభ్రమరికల్ రమ్యాననాంభోజముల్
నింగిం గ్రాలెడు లేఁతనవ్వుసురువుల్ సేవింపఁ జెంపారుడో
ర్భంగంబుల్ తనరారు శంకరమహాపద్మాకరంబందు నా
యంగం బంగజకేళిపూరమున నోలాడించు టెం కెన్నఁడో?

వ. అని యివ్విధంబున. 201

సీ. శృంగారములుసేయ శృంగారి యొల్లదు
పువ్వులు దురుమదు పువ్వుఁబోడి
పలుకంగనేరదు పలుకనేరనిఖాతిఁ
జంచలత్వము నొందుఁ జంచలాక్షి
సరసులఁ గ్రీడింప సరసిజానన వోదు
మానంబుతోఁ గుందు మానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన
చెలువలఁ బిలువదు చెలులచెలియ
తే. ముకుర మేప్రొద్దుఁ జూడదు ముకురవదన
తరుణి మఱియును సర్వకృత్యములు మఱచి
హరునితోడిదె గొండాటయై లతాంగి
యుగ్రతాపంబు సైరింప కున్నఁ జూచి. 202

ఆ. కూడియాడుచున్న కోమలిజనములు
శిశిరవిధులఁ గొంత సేద దీర్చి
శైలరాజుఁ గానఁ జనుదెంచి యతనికి
వెలఁదు లివ్విధమును విన్నవింప. 203

క. అతఁ డంతయు నప్పుడు దన
సతి యగు మేనకకుఁ జెప్పి చయ్యన గౌరీ
సతిఁగానవచ్చి యక్కడ
హిమవంతుఁడు పల్కెఁ దియ్యమాటలు వెలయన్. 204

హిమవంతుఁడు పార్వతికి శివునిం జూపుట

శా. అమ్మా పార్వతి దేవదేవుఁ డగునాయర్ధేందుచూడామణిన్
రమ్మా కానఁగఁబోదమంచు ముదమారం బాలఁ గొంచున్
బ్రయాణమ్మై శీతనగాంతరాళమునకున్ నక్షత్రవీథిన్ మహా
సమ్మోదంబునఁ బోయి యంతఁ గనియెన్ శైలేంద్రుఁ డమ్ముం
దటన్. 205

చ. ఘనతరమాతులుంగవటఖర్జురరంభకదంబనింబచం
దననవచంపకక్రముకతాలతమాలవిశాలసాలరో
చనవరగంధసారఘనసారయుదుంబరచూతకేతకీ
పనసలవంగలుంగతరుపంక్తుల నొప్పినదాని వెండియున్. 206

క. కొలకులఁ దిరిగెడుహంసల
కలకలనాదముల కీరకలకలములునుం
గలకంఠంబులనాదము
లలినాదములమరు సుందరారామంబున్. 207

వ. కని యమ్మహావనంబు దరియం జొచ్చి తత్ప్రదేశంబున. 208

మ. పరఁగ న్వేల్పులచింత మాని యచలబ్రహ్మాసనాసీనుఁ డై
తిర మైరాజితదేహము న్విమలభూతిన్ దీర్చి కూర్చుండె తా
గరుసుల్ సేరక తన్నుఁ దాన తలఁపై గాఢాత్ముఁ డై నిష్ఠతో
హరుఁడయ్యోగసమాధిమై దవిలి నిత్యానందుఁ డై యుండఁ
గన్. 209

చ. చెలువయు దాను గాంచి శివుఁ జేర భయంపడి కొంతదవ్వు
లన్,నిలచె గిరీంద్రశేఖరుఁడు నీలగళుండును నంతలోనఁ జెం
బాలయ సమాధి మాని కడుసొప్పుగఁ గన్నులువిచ్చి చూచు
చోఁ, బలికె ధరాధరుండలరి పార్వతికిం దగఁ బ్రీతితోడు
తన్. 210

మ. అదె శంభుండు సమాధి వోవిడిచె నిత్యానందమున్ దోఁచె
న్నల్ల దెకాన్పింపెఁ గృపాత్ములం దెలిచెఁ దానాలించె లోకం
బులన్,మదవేదండసమానయాన మునిరాణ్మందారునిం జేరఁ
గా, నదనై యున్నది సమ్ముఖంబునకు డాయం బోదమా
పార్వతీ. 211

వ. అని విచారించి. 212

క. గిరిరాజు తన్ను దగ్గర
నరుదెంచి వినమ్రుఁ డగుచు నబ్జదళాక్షిన్
దరిశనము వెట్టి నిలచినఁ
గరుణయు మోదంబుఁ బుట్టెఁ గాలకంఠునకున్. 213

సీ. కాముని బాణమో కందర్పదీపమో
కాంతిరేఖయొ వేల్పుకన్యయొక్కొ
మెలఁగెడుతీఁగయో మెఱుఁగులబొమ్మయో
తీరగుబంగారుతీఁగయొక్కొ

మోహాంబుదీపమో మోహనవార్ధిఫేనమో
లాలితమోహనలక్ష్మిరూపముకో
చిత్రంపురేఖయో శృంగారపుబొమ్మయో చ
రేఖయో పూర్ణేందురేఖరూపుకో
ఆ. యనఁగ నొప్పుదాని నభినవలావణ్య
రూపకాంతులందు రూఢి కెక్కి
పరఁగుచున్నదానిఁ బర్వతకన్యక
జూచి వెఱఁగుపడియె సోమధరుఁడు. 214

వ. అయ్యవసరంబున. 215

ఉ. ఆచపలాక్షి చిత్తమున నయ్యురగాధిపబాహుకంకణుం
జూచుచు నుండెఁ గాని మఱిచూచినచూపు మరల్ప లేమినిం
జూచి మహేంద్రవల్లభుఁడు శూలికి మ్రొక్కఁగదమ్మ బాలికా
చూచెదుగాని నీ వనుచు సుందరి మ్రొక్కఁగఁ బంచి వేడ్క
తోన్. 216

వ. పరమసమ్మోదంబున నమ్మహాత్మునికి సాష్టాంగదండప్రణామంబులాచరించి కరకమలంబులు ముకుళించి యిట్లనిరి.

క. జయజయ శ్రీగిరిమందిర
జయజయ మందారహార సలలితవర్ణా
జయజయ భువనాధీశ్వర
జయజయ యోగీంద్రపారిజాత మహేశా. 218

క. జయజయ హాలాహలధర
జయజయ దేవేంద్ర కమలసంభవ వినుతా
జయజయ పన్నగకంకణ
జయజయ గంగావతంస జయ చంద్రధరా. 219

సీ. కుసుమదామంబులు కోమలి తనమాళిఁ
బెట్టదు నీమాళిఁ బెట్టిగాని
గజరాజనిభయాన గంధంబు తనమేన
నలఁదదు నీమేన నలఁది కాని
రాజీవదళనేత్ర రత్నకంకణములు
దొడుగదు నీకేలఁ దొడిఁగి కాని
పుష్కరానన పట్టుఁబుట్టంబుఁ గట్టదు
కటకటో నీకటిఁ గట్టి కాని
ఆ. మహితలోలనేత్ర మాటాడ దెప్పుడుఁ
గొంచెమేని నిన్నుఁ గోరి కాని
యింత పిదప నిప్పు డేమియు నొల్లదు
నిన్ను కాని దేవ నిశ్చయంబు. 220

నగజను శివునికి శుశ్రూష చేయ నప్పగించుట

మ. అవధారీశ్వర విన్నపంబు మదిలో నాలించి రక్షింపుమీ
యువిదారత్నముఁ బెట్టి పోయెదను మీ యొద్దన్ భవద్దాసియై
శివుటన్ వర్తన సేయు చుండెడిని ప్రీతిం దీని రక్షింపుఁడీ
యవిరోధంబున లీలఁ బంపి పరిచర్యల్ చాల సేయింపుఁడీ.
క. కొండిక బాలిక యెఱుఁగదు
సుండీ యెంతయును ముగుదసుండీ యనుచున్
ఖండేందుబింబమౌళికిఁ
గొండలరా జప్పగించెఁ గూఁతుం గౌరిన్. 222
వ. ఇవ్విధంబునం బరమేశ్వరునకుఁ బరిచర్యలు సేయ నమ్మహా
దేవిని సమర్పించి యతం డద్దేవునకు వెండియుం దండప్రణా
మంబు చేసి తనమందిరంబునకుఁ జనియె నంతఁ 223

మ. శివుఁ జూచుం దమకించి సిగ్గు నగుడుం జిక్కం గరంగుం
మదిఁ, భవుఁజేరం గమకించుఁ జంచలపడుం భావించు నెంచు
న్వాడిం, గవయంగాఁ బడు నాథుఁగౌఁగిటను సింగారింతునో
యంచు నో,శివ రక్షా యని పిల్తునా యనుచు రాజీవాక్షి
సంరబ్ధయై. 224

సీ. పరమేశురూపంబు పలుమాఱు నందంద
వాడిచూపులఁ జూచు వాని మిగులఁ
బులకించు దలఁకించుఁ బొలఁతి విచారించుఁ
జేరి పూవులఁ బూజసేయు నబల
పంపక యట మున్న పరిచర్య లొనరించుఁ
దరిమి నచిత్తంబు తరగఁ బట్టు
దేవరమనసు దాఁ దెఱఁగొప్ప వర్తించు
గడు నప్రమత్తయై కన్య మెలఁగు
తే. కాముతూపుల ఘాటికిఁ గాక శంభు
నంటి యొక్కొక్కమాటొత్త నప్పళించుఁ
దెంపు సేయంగ వెఱచు నద్దేవి యిట్లు
శివుని కెప్పుడు పరిచర్య సేయుచుండె. 225

ఉ. ప్రొద్దున వచ్చి నిచ్చలును బొల్పగుశీతశిలాతలంబునం
గ్రద్దన నిల్చి యుండి కలికంఠుఁడు యోగసమాధినిష్ఠమైఁ
బెద్దయుఁ బ్రొద్దు నిల్పుటయుఁ బిమ్మట గౌరియు నిర్మలాత్మ
యై,ప్రొద్దున వచ్చి వల్లభునిపూజలుసేయు ననేకభంగులన్.

క. విడువక పూజలు సేయఁగ
నుడుగక యోగంబుమీఁద నుండఁగఁ దలఁపు

లొప్పెడుమటయు గాని గానం
బడ దెంతయు సంగమంబు పతికిఁ సతికిన్. 227

వ. ఇవ్విధంబునం గొంతకాలంబు దేవి దేవరకుం బరిచర్యలు
సేయుచుండె నని చెప్పి. 228

ఆశ్వాసాంతము

మత్తకోకిల.—

రాజచందనకుందశంఖమరాళహీరపటీరవి
భ్రాజితాంగమునీంద్రమానసపద్మహంస రమాంగనా
రాజనాయకధారుణీధరరాజనందననాయకా
రాజరాజమనస్సరోజవిరాజితాంబుజనాయకా. 229

క. ప్రమథగణహృదయరంజన
ప్రమథగణాంభోధిచంద్ర ప్రమథాధిపతీ
ప్రమథగణవినుతపదయుగ
ప్రమథగణాంభోజబాలభాస్కరమూర్తీ. 230

మాలినీ.—

నిగమభువనదీపా నిర్మలానందరూపా
యగణితగుణధీరా యప్రతర్క్యప్రకారా
గగనజలధిహారా ఖండరాజద్విహారా
యువతిమదనమూర్తీ యోగిహృద్ధ్యాంతవర్తీ. 231

గద్య. ఇది శ్రీమన్మహామహేశ్వర యువుటూరి సోమనారాధ్య
దివ్యశ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్త్ర పోతయనామ
ధేయప్రణీతంబైన వీరభద్రవిజయం బనుమహాపురాణ

కథయందు దేవేంద్రాదిదేవగణంబులు శివునిసందర్శనంబు సేయుటయు దక్షయాగంబును దాక్షాయణి నారదువలన విని శంభుని కెఱింగించుటయు శంభుండు పనుప దివ్యరథారూఢ యై పార్వతీదేవి దక్షునింటికి వచ్చుటయు దక్షుఁడు సేయు శివనింద వినఁజాలక యమ్మహాదేవి దేహంబు దొఱఁగుటయు హిమవంతునకుఁ గుమారియై శాంకరి పొడచూపుటయు తదీయతపోమహత్త్వంబును నగజ శివునకుఁ బరిచర్యలు సేయుటయు నన్నది ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు

# వీరభద్రవిజయము

## ద్వితీయాశ్వాసము



కైలాసనగేంద్ర
ప్రాకటసానుప్రదేశబహువనరాజీ
వాకరగంధసమేత
శ్రీకరవిభవాభిరామ శ్రీగిరిధామా. 1

వ. పరమజ్ఞానభావుం డగు వాయుదేవుం డమ్మహామునుల కి
ట్లనియె. 2

మ. రమణన్ ఘోరతపంబు చేసి చెలువారం బ్రహ్మ మెప్పించి లో
కము లెల్లం బరిమార్చినట్టి వెలివుం దర్పంబుఁ దేజంబు వి
క్రమసైన్యంబును లక్ష్మియుం బడసి సంగ్రామంబులోఁ దార
కుం, డమరేంద్రాదుల గెల్చి మత్తు సని దండై పోరు
నత్యుగ్రుఁడై. 3

వ. ఇట్లు పోయి. 4

సీ. ఆలంబులో నింద్రు నాలంబు గావించి
వహ్నికిఁ దనకోపవహ్ని చూపి

యంతకునకుఁ దాను నంతకమూర్తియై
యసురకు నసురయై యలవు మెఱసి
నీరధీశ్వరు పెంపు నీఱుగా నలయించి
గాలిబలంబెల్లఁ గాలి చేసి
నెఱయంగ ధననాథు నిర్ధనుఁ గావించి
హరునిబలంబెల్ల హతముఁ జేసి
తే. యమరగంధర్వయక్షరాక్షసపిశాచ
గరుడపన్నగ మానవగ్రహామునీంద్ర
చయము నెల్లను బలుమాఱు చంపి శౌర్య
భాసురుం డగునత్తారకాసురుండు. 5

చ. తమతమరాజ్యసంపదలు తద్దయుఁ జేకొని పోక వెండియుఁ
దముఁ బలుమాఱుఁ దారకుఁడు తల్లడపెట్టిననింద్రుఁడాదిగా
నమరులు లోకపాలురును నాపదఁ బొంది కలంగి బ్రహ్మలో
కమునకుఁబోయిపద్మభవుఁగాంచి ప్రణామము లాచరించుచున్.

బృహస్పతి బ్రహ్మకుఁ దారకాసురుఁడుచేయు బాధలంజెలుపుట.

వ. సురాచార్యుండు బ్రహ్మదేవున కిట్లనియె. 7

లయగ్రాహి:—

ఆఁకొని కరాళగతి భీకరపుఁ జూపులను
భేకములమాఁకలను వీఁకఁ గని యాద
ర్వీకరము మ్రింగుక్రియ నాకపులతో నిఖిల
లోకములు దారకుఁడు చేకొని హరింపన్
బ్రాకటపుఁగామినుల వీఁకఁ జెఱవట్టి మఱి
నాకముఖపట్టణము లాఁకగొని యుండన్

డాకకును గాక యిటు నీకు వినిపింప ఘన
శోకమున వచ్చితిమి గైకొను విరించీ. 8

క. తాపసుల నెల్లఁ జంపెను
కోపంబున సురలఁ జెఱలు గొని వర్తిల్లెఁ
బాపపురక్కసునకు మీ
రేపారఁ ద్రిలోకవిజయ మిత్తురె చెప్పుఁడా. 9

వ. అనవుఁడు దరహాసితవదనుండై రాజీవసంభవుం డిట్లనియె.

క. ఏను వర మీక యుండిన
వానితపోవహ్ని జగము వలగొని కాల్చుఁ
నే నేల వెత్తి నయ్యెదఁ
గాన సురాధీశులార కలఁగకుఁ డింకన్. 11

వ. అని మఱియును. 12

ఉ. శూలికి శీతలాచలముచూలికిఁ గూరిమితోడఁబుట్టు న
బ్బాలుఁడు గాని దానవునిఁ బట్టి మహోగ్రతఁగీటడంపఁగాఁ
జాలఁడు సిద్ధ మీపలుకు సర్వయుపాయములందు భావజుఁ
ఫాలతలాక్షు నీక్షణమె బర్వతకన్యకఁ గూర్చఁ బంపుఁడా.13

వ. అని కమలసంభవుండు విచారించి కార్యంబు తేటపడం బలి
కిన నగుఁ గాక యని మహామోదంబున. 14

క. నిర్జరలోకము గొలువఁగ
నిర్జరనాథుండు చిత్తనిర్జరుఁ దగుచుఁ
నిర్జరగేహిను లలరఁగఁ
నిర్జరపురి కేఁగెఁ దాను నిర్జరమతియై. 15

వ. అట్లేఁగి నాకంబునందు, 16

శా. మందారోన్నతపారిజాతకలికామాకందపుష్పావళీ
మందాలోలసుగంధమారుతమనోమాన్యత్వసమ్మోదిరై
నందాత్ముల్ సురసిద్ధసాధ్యవిలసన్నాగేంద్రబృందంబు లిం
పొందం గొల్వ ననంతరాజ్యసిరిఁ గొల్వుండెన్ సురేంద్రుం
డొగిన్. 17

వ. అట్లు కొలు వుండి. 18

సీ. ఘాసిల్లుపువ్వుల బాణపఙ్క్తులవానిఁ
గొమరారు కెందమ్మిఁగొడుగువానిఁ
కలహంసశారికా కలకంఠములవాని
వెలుఁగొందు తియ్యని వింటివాని
మందానిలలలామ మదభృంగములవానిఁ
దెలిగొప్పపువ్వుల తేరువాని
బలువీను టెక్కెంబు పడగఁ గొప్పెడువాని
సామనిసారథి యైనవాని
తే. అందమైనవాని నకలంకశృంగార
విభవలక్ష్మిచేత వెలయువాని
మోదవృత్తివాని మోహనాకృతివానిఁ
గాముఁ దలఁచె నాకధాముఁ డపుడు. 19

వ. అయ్యవసరంబున. 20

లయగ్రాహి.—
తన్ను మదిలోన వెయికన్నుల పురందరుఁడు
సన్నుతగతిం దలఁప వెన్నునిసుతుండుం
జెన్నులు వెసం దలకి యున్నఁ గని తా నతనిఁ
దిన్నఁగనుఁ గౌఁగిటను నున్న రతికాముం

చిన్నతన మెంత చెప్పఁగ నెన్నఁ బోలుఁ నెన్నెలవి
నన్ను మరుపం దగునె యన్న బుధనుందుఁగా
నిన్ను వెలిగా సకలసత్పథులఁ దలఁతునె ప్ర
సన్నమతితోడ నను మన్నింపవె యింకున్. 21

క. నను దేవేంద్రుఁడు దలఁచెను
పనిగొని నేఁ జేల దలఁచె పంకజనేత్రీ
తన కే కార్యము గలిగెనొ
పనిలేక తలంపఁ డతఁడు భామిని నన్నున్. 22

మ. లలనా పంపుము తన్నిమిత్త మరయన్ లక్షింప నీప్రొద్దు పో
వలయున్ వజ్రి దలంచుచోట రమణీ వర్ణింపఁగాఁ గార్య
ముల్, గల వెన్నేనియు నన్న నాపను లెఱుంగం జెప్పఁ
డాలించెదన్, వెలఁది ముగ్ధవుగాన రాచపనులుర్విన్ జెప్పఁగా
వచ్చునే. 23

చ. ఎనయఁగ సర్వలోకములు నేలెడురాజులరాజు గాఁడె యా
తని దెస భ్రాంతియే పనులు తప్పక పోయిన బుద్ధి నావుడున్
వెనువుగ నింద్రువీటికిని వేర్కొని పోయెద నేని నేను నీ
వెనుకను వత్తు నంచుఁ జలి వేఁడుకఁ బల్కిన నల్ల నవ్వుచున్.

వ. ఆయువతికి సుమనాయకుం డిట్లనియె. 25

శా. ఇల్లాం డ్రైన కులాంగనల్ మగలతో నేకాంతురా తొల్లి శో
భిల్లంగాఁ దగ వొప్పు రాట్సభలకు స్త్రీసాక్షి మున్నెన్నమా
యిల్లాం డ్రెవ్వరు ప్రాణవల్లభులతో నిట్లాడఁగా నేర్తురే
సల్లాలిత్యమె దేవతాసభ లనన్ సంకేతశైలంబులే. 26

క. వేలుపులరాచసభకును
బోలదు నీరాక వినుము పోఁగదు నీవి

ల్లాలవు సురేంద్రుసభకును
నే లని రతి నూరడించె నేచినవేడ్కన్. 27

సీ. పాటించి మృగనాభిపంకంబు మైఁ బూసి
కప్పురంబునఁ దిలకంబుఁ దీర్చి
కమ్మనిపువ్వులసొమ్ములు ధరియించి
లాలితమణికుండలములు వెట్టి
వెన్నెలనిగ్గులై వెలుఁగుచీరెలు గట్టి
పసిడివాంపావళి పట్టుఁ గట్టి
మాధవీమల్లికామాలతీనవకుంద
దామంబు లింపార తలను దురిమి

తే. పాంథజనములగుండెలు పగిలి నిగుడ
మెరయునందియ డాకాల మ్రోయుచుండ
మగల మగువలఁ గరగించు మాయలాఁడు
లలితశృంగారవైభవలక్ష్మి మెఱసి. 28

లయగ్రాహి.—

తుమ్మెదలు పెక్కు మురిపమ్ముల వెస న్ముసరి
జొమ్ము రని పద్మముకుళమ్ముల మహాళిం
ఖమ్ములు భ్రమింప రసికమ్ము వెలయం బొగడు
సమ్మదపుఁ జిల్కలరవమ్ములు చెలంగన్
గ్రమ్మి కలకంఠములు నిమ్ముల మరాళములు
గ్రమ్మగను గాలి గడుఁ గమ్మనయి వీవన్
కమ్మ నగువిల్లుఁ బువుటమ్ములను బట్టి వెల
య మ్మరుఁడు పువ్వులరథమ్ము వెస నెక్కెన్. 29

వ. ఇట్లగణ్యశృంగారవైభవాడంబరుండై రతీదేవిదీవెనలు గైకొని వీడ్కొని కదలి యక్కందర్పుం డమరేంద్రపురంబు నకుం బ్రయాణంబు చేసి గగనంబున వచ్చుచు. 30

## అమరావతీవర్ణనము

సీ. కొమరొందు పొడవైనగోపురంబులచేతఁ
దనరారు దివ్యసౌధములచేత
బహురత్నకాంచనప్రాసాదములచేతఁ
గమనీయవిపణిమార్గములచేత
పుణ్యజనాళిచే బృందారకాప్సరో
గంధర్వకిన్నరగణముచేత
బహువిమానములచే బహువాద్యములచేత
బహువనాంతరసరఃప్రతతిచేత

ఆ. పసిఁడికొండమీఁద బహువైభవమ్ముల
లలితదేవరాజ్యలక్ష్మి మెఱసి
సకలభువనభవనచారుదీపం బైన
పట్టణంబు వజ్రిపట్టణంబు. 31

వ. కనుంగొని యనంతవైభవంబున నన్నగరంబు ప్రవేశించి గోవిందనందనుం డసమానసుందరుండై చనుదెంచుచున్న సమయంబున 32

ఉ. ఓలి నలంకరించుకొని యొండొరు మెచ్చనివైభవంబునన్
గ్రాలుచు మేడ లెక్కి యమరావతిలోఁ గలకన్నె లందఱున్
సోలుచు జాలకావళులఁ జూచుచు నోసతులార యీరతీ
లోలునిఁ గంటిరే యనుచు లోలత నప్పుడొకర్తొకర్తతోన్.

సీ. కమనీయసంఫుల్లకమలాక్షి యీతఁడే
　　కామినీమోహనాకారధరుఁడు
సలలితసంపూర్ణచంద్రాస్య యీతఁడే
　　బిరుదుగండరగండబిరుదువాఁడు
ఘనతరమదమత్తగజయాన యీతఁడే
　　పంచబాణంబుల బహుళయశుఁడు
కొమరారునవపుష్పకోమలి యీతఁడే
　　మగువల మగలను మలచుశెట్టి
ఆ. యనుచుఁ జూచి చూచి యంగజునాకార
సరసిలోన మునిఁగి జాలిఁ గొనుచు
నొనర గోడ వ్రాసినట్టి రూపంబుల
కరణి నుండ్రి దివిజకాంత లెల్ల. 34

వ. అంత నద్దేవేంద్రుమందిరంబు చేరం బోయి. 35

ఉ. సంగడిఁ గోయిలల్ నడువ సందడి వాయుచుఁ జంచరీకముల్
మంగళగీతముల్ చదువ మానుగ రాజమరాళసంఘముల్
చెంగట రాఁగ వాసవుని శ్రీమొగసాల రథంబు డిగ్గి యా
యంగభవుండు చొచ్చె నమరాధిపుకొలువుఁ బ్రమోద
మగ్నుఁ డై. 36

వ. ఇట్లు దివ్యాస్థానమంటపంబు దరియం జొచ్చి. 37

సీ. అతిమోహనాకారుఁ డై వెలింగెడువాని
　　నభినవశృంగారుఁ డైనవాని
కడిమిమై నాకలోకంబు నేలెడువాని
　　నొడలెల్లఁ గన్నులై వెలయువాని

పొలుపారఁ గేల దంభోళి యొప్పెడువాని
నత్యంతవైభవుం డైనవాని
కేయూరకంకణాంకితబాహువులవాని
నిద్ధమైనమణికిరీటమ్మువాని
ఆ. గరుడసిద్ధసాధ్యగంధర్వకిన్నర
భుజగపతులు గొలువ పొలుపుమిగిలి
తేజరిల్లువాని దేవేంద్రుఁ బొడఁగాంచి
సమ్మదమున నంగసంభవుండు. 38

వ. ఇట్లు పొడఁగాంచి నిరుపమనయవినయభయజనితమానసుండై నమస్కారంబు చేసినకుసుమసాయకుం గనుంగొని విపుల ప్రమోదంబున నెదురు వచ్చి వలదు తగ దని బాహుపల్లవంబుల నల్లనెత్తి పలుమాఱు నందందఁ గౌఁగిలించుకొని దేవేంద్రుఁడును నతులితతేజోమహిమాభిరాము కనకమణిగణాలంకారసింహాసనాసీనుం జేసి మఱియు నొక్కదివ్యహారంబు సమర్పించి మహనీయమధురవచనముల నిట్లనియె.

క. చనుదెంచితే కుసుమాయుధ
చనుదెంచితే పంచబాణ శంబరవైరీ
చనుదెంచితె కందర్పక
చనుదెంచితె యెల్లపనులు సన్మోదములే. 40

వ. అని మహేంద్రుం డడిగిన నంగసంభవుం డిట్లనియె. 41

ఉ. ఓమహితప్రతాప భువనోన్నత మీరు గలంతకాలము
న్నేమి కొఱంత సమ్మదము నిప్పుడు నన్నుఁ దలంపఁ గారణం
బేమి సురేంద్ర! నీతలఁచునంతఁ గృతార్థుఁడ నైతిఁ జాలదే
నీమదిలో ననుం దలఁప నేఁడొకకార్యము నీకుఁ గల్గెనే.

వ. అనిన విని పురందరుం డిందిరానందనున కిట్లనియె. 43

ఉ. నీభుజదండవిక్రమము నీమహిమాతిశయాభిరామముం
శోభితకీర్తి మైఁగలుగఁ*జేకొనెఁ గార్యము మమ్ము జోకతో
సాభరమైనకార్యముల సారయ నెవ్వరిభార మయ్యెరో
శోభితమూర్తిరో భువనసుందరరో గురుధైర్యమందరా.

క. నీకును భారము గా దేఁ
జేకొని యొనరింతుఁ గాక చెప్పెద నొకటిన్
లోకంబులవారలకును
సాకులకును నీవు మేలొనర్చుట సుమ్మీ 45

క. వారిజగర్భునివరమునఁ
దారకుఁ డనుదానవుండు తద్దయుఁ గడిమిన్
గారించె నఖిలజగములు
పోరం గడతేరఁ డెట్టిపురుషులచేతన్. 46

క. పురహరునకు నద్రిజకును
బరఁగం బ్రభవించునట్టి బలియుఁడు వానిం
బరిమార్చు నద్రికన్యకఁ
బురహరునకుఁ గూర్చి కీర్తిఁ బొందుము మదనా. 47

సీ. ఇది యెంతపని నీకు నిందిరానందన
తలఁపులోపలఁ జేర్చిఁ దలఁతుగాక
తలఁచి నీభుజదండదర్పంబు శోభిల్లఁ
గొనకొని మము వీడుకొందుగాక
కొనినబలంబులు కొమరారఁగాఁ గొల్వ
భూతేశుపై దండు వోదుగాక

---

* జోకినకార్యము...జోకఁబో.

పోయి విజృంభించి పొరి నారి పారించి
తీపులవిల్లెక్కు డీతు గాక

ఆ. తిగిచి పువ్వుటమ్ము తెలఁగొప్ప సంధించి
విశ్వనాథుమీఁద విడుతుగాక
విడిచి కలఁచి నేర్చి విశ్వేశుమ్రుడుకేళి
యేర్పడంగ గిరిజ కిత్తుఁ గాక. 48

వ. అని ప్రియంబులు పలుకుచున్న పురందరుం గనుంగొని
కందర్పుం డి ట్లనియె. 49

శా. ఓహో యీపని నన్నుఁ బంపఁ దగవా యూహింప నాకేల శివ
ద్రోహం బిట్టిదిఁ జేయఁగాఁ దగునె యీ ద్రోహంబుఁ
గావింపఁగా, నాహో వద్దని మాన్పఁబట్ట కిడిచేయ స్మీరు
పొమ్మందురే, మోహాతీతుఁడు శంభుఁ డాతనికి నేమో
హంబు లే దెమ్మెయిన్. 50

ఆ. కొలఁది లేదు పేర్చి కోపించె నేని వి
రించినైన శిరము ద్రెంచికాని
విడువకున్న బిరుదువిన్నాఁడ వెన్నాడ
నథవు జేరవెఱతు నమరనాథ. 51

క. తలఁపులు మఱపులు దమలో
పల మఱచి విరాళవృత్తిఁ బరమేశుఁడు దాఁ
గలఁడని లేఁ డని యెఱుఁగరు
సురలఁ గడచినట్టివాఁడు సొరఁ జొరవేదీ. 52

క. అరయ నేకాంతస్థలిఁ
జేరంగా రాదు నాకుఁ జేరఁగఁ దరమే

*అరయ శోకావస్థలఁ
జేరి వెలుంగొందు శాఖఁ జేరం దరమే. 53

వ. అదియునుం గాక. 54

సీ. పుండరీకాక్షునిపుత్త్రుండ నై నేను
నిభచర్మధరునిపై నెట్లు వోదు
వోయిన నద్దేవుభూరిప్రతాపాగ్ని
నెరయంగ నాతేజ మెందు మోచు
మోచిన పరమేశుమూర్తి యేఁ గనుఁగొని
యుదిరి విజృంభించి యెట్లు వత్తు
వచ్చిన మాతండ్రి వారిఁ గోపించి
యేచూపుచూచునో యేను వెఱతు

ఆ. వెఱతునయ్య యెన్నివిధములఁ జెప్పిన
నొల్లఁడి గాదు నా కగోచరంబు
నిక్క మివ్విధంబు నీయాన దేవేంద్ర
మృగకులేంద్రు నోర్వ మృగమువశమె. 55

వ. అనవుడు రతీమనోహరునకు శచీమనోహరుం డి ట్లనియె. 56

ఆ. పొందుగానిపనికి పొమ్మందునే నిన్ను
నింత చింతయేల యిట్టిపనికి
దర్పచిత్తుఁ డైన తారకాసురుచేతి
బాధ మాన్పి కీర్తిఁ బడయుమయ్య. 57

సీ. జగములోపలఁ గల జంతురాసులఁబట్టి
మనసులఁ గలఁచు నీమహిమ మహిమ

* ధీరతఁ ద్రిపురాంతకుఁడను ఘోరాక్షునివహ్ని పాలఁబడనోపఁజామీ!

నాటుచో గంటు గానఁగరాక వాఁడి యై
సరిలేక నాటునీశరము శరము
పరమేష్ఠిసృష్టి లోపలి పురుషుల కెల్ల
దీపమై వెలుఁగు నీరూపు రూపు
అఖిలంబు నొందాఁక నంచాఁక నందమై
పృథుతరంబైన నీబిరుదు బిరుదు
ఆ. శూలి నైనఁ దాపసుల నైనబాధింతు
గాలినైన నెట్టిఘనుల నైనఁ
గలదె నీదుపేర్మి ఘనత తక్కొరులకు
నిన్నుఁ బోల వశమె నిరుపమాంగ. 58
క. ఒప్పనిపని కేఁ బంపను
ఒప్పఁగఁ బుష్పాలపూజ లొనరించుగలిగా
గప్పము దేవరశిరమును
నిప్పుడు నీపుష్పశరము లింతే చాలున్. 59
శా. లోకాధీశుఁడు శూలి నిన్నుఁ గనినా లోకోపకారార్థియై
యీకాత్యాయనిఁదన్నుఁగూర్పఁదనపై వేతెంచినాఁడంచుదా
నేకీడుం దలపోయకుండు నటుగం డీమాట సిద్ధంబు నీ
కీకార్యం బవలీలగా నెఱుఁగుమీ యేపారఁ గందర్పకా.
క. ఇట్టివిధంబులు చెప్పిన
నెట్టన నినుఁబోఁటివాఁడు నెరబిరు దైనా
ఘట్టనఁ గావించెద నని
బెట్టిదములు పలుకుఁ గాక పిఱికియు నగునే. 61
క. ఎంతపని యైన మైకొని
పంతంబునఁ జేయు నీవు భయమున నకటా

చింతించెదు పలుమాఱును
చింతించుట నీకుఁ దగదు చిత్తజ వినుమా. 62

సీ. కలకంఠగణముల కలనాదములతోడఁ
కలహంసనాదంబులు గడలుకొనఁగ
అరయ డాకాలి పెండెరము నాదమ్ముతో
ఝుంకారనాదంబు జడిగొనంగ
భూరిసుందర రాజకీరనాదములతో
విడవింటినాదంబు సుడిగొనంగ
నందంద చెలరేఁగి యార్పునాదములతో
శరవేగనాదంబు జడలుకొనఁగ

తే. కలిసి వెన్నెలగాయంగఁ గమ్మగాలి
రొలమి వీవంగఁ బూవింటి నెక్కుద్రోచి
శరము సంధించి యేయుచో శంకరుండు
కలఁగునంగజ మమ్మెల్లఁ గావుమయ్య. 63

వ. అని మఱియును బ్రియంబును కఱకును దొరల నాడు దేవేంద్రవచనంబులకు విహ్వలీకృతమానసుం డై కొంత ప్రొద్దు విచారించి యెట్టకేలకు నొడంబడి సురేంద్రా భవదీయమనోరథంబు సఫలంబుఁ జేసెద నని పల్కి మఱియు నిట్లనియె.

ఉ. ఒంటుతనంబు పెంపెసఁగఁ బచ్చనికార్ముక మెక్కుపెట్టి యా
యొంటరి యైనయట్టి శివయోగసముద్రము నాదుకోలలన్
వెంటలు చేసి శీఘ్రమున నిక్కముగాఁ జలికొండకూతుపు
ట్టింటికి గౌరివెంటఁ జన నీశునితోఁ బలుకన్ సురాధిపా. 65

వ. అనిన విని పురందరాదిదేవగణంబులు బహుప్రకారంబుల నంగజాతుని వినుతించి వీడ్కొల్పిన నత్యంతకర్మపాశబద్ధమానసుండై నిజమందిరంబునకుం జనియె. 66

కందర్పుఁడు రతీదేవికి తానరిగినవృత్తాంతంబు చెప్పుట

క. తననాథుఁడు వచ్చుట గని
వినయంబున నెదురువచ్చి విభుచిహ్నముఁ దాఁ
గనుఁగొని పెదవులు దడపుచుఁ
దనపతికి రతీలతాంగి దా నిట్లనియెన్. 67

సీ. చిత్తసంభవ నీదుశృంగారవారాశి
మాఁగియున్నదిగాని మ్రోఁత లేదు
కందర్ప నీముఖకమలముకళ యొల్ల
నెక్కడఁ జొచ్చెనో యెఱుఁగరాదు
మదన నీతియ్యనిమాటలు చెలరేఁగి
వింతలై పలుమాఱు వినఁగరావు
అంగజ నీలోచనారవిందంబులు
సురిఁగి యున్నవి గాని సొంపు లేదు

ఆ. ఎట్టిపనికిఁ దలఁచె నేమని పంపెనో
భూధరారి నిన్ను బుజ్జగించి
విబుధులెల్లఁ బంప వెఱ్ఱివై యేపనుల్
సేయ నియ్యకొంటి చెప్పవయ్య. 68

వ. అని పలికినఁ బ్రాణవల్లభవదనం బాలోకించి పంచబాణుం డిట్లనియె. 69

సీ. నాతి యిక్కడ నుండి నాకంబునకుం బోయి
యమరావతీపురం బమరఁ జేరి

దేవకాంతలు రెండుదెసలఁ జూచుచు నుండ
దేవేంద్రు మొగసాలఁ దేరు డిగ్గి
పోయి నే మ్రొక్కినఁ బొలుపార మన్నించి
నాకాధినాథుండు నన్నుఁ జూచి
బాలేందుమౌళికిఁ బార్వతికన్నియఁ
గూర్పంగఁబుట్టెడు కొమరుచేత
ఆ. దారుణాత్మకుండు తారకదైత్యుండు
చేఁగు ననుచుఁ జెప్పి వీడుకొలిపె
వనితపంపు వూని వచ్చితి నింక దం
డెత్తి పోవవలయు నీశుమీఁద. 70

రతీదేవి శివునిపైఁ బోవలదని మన్మథుని మందలించుట

వ. అనవుడు నక్కాంతాతిలకంబు విస్మయాకులచిత్తయై
మూర్ఛిల్లి తెలివొంది నగవును గోపంబును దైన్యంబును
సుడివడుచుండ నిట్లనియె. 71

శా. ఏలా మన్మథ యిట్లు పల్కెఁ దగవా యీచందముల్ మేలె
నీ, వేలా మూఢుఁడవైతి నీదుమది దా నెచ్చోటికిం బోయె
మి, థ్యాలాపంబులఁ బల్క నీకుఁ * దగ భవ్యంబె రతి
క్రీడయే, కాలారిం ద్రిపురారిఁ జేరవశమే కందర్ప నీబోటికిన్.

వ. అదియునుంగాక. 73

క. నిఖిలప్రపంచంబు నిర్మించి శోభిల్లు
పరమేష్ఠికంటె నీబలము బలమె
మూఁడువేల్పులఁ బట్టి మూలకుఁ జొనిపిన
కరివైరికంటె నీవెరవు వెరవె

* దగి యిట్లాడంగరక్రీడయే.

ఘనభీకరాటోపకలితుఁడై వర్తిల్లు
    లయకాలుకంటె నీలావు లావె
ఖలదైవములనెల్ల ఖండించి మించిన
    యంతకుకంటె నీయరుదు యరుదె
ఆ. యొట్టిఘనులఁబట్టి యొనయంగఁ దలకొని
తెచ్చి విఱిచి త్రుంచి వచ్చినాఁడు
వలదు శంభుతోడవైరంబు మన్మథ
యూరకుండి చచ్చువారు గలరె. 74

చ. కలువలరాజు పువ్వు కడికంచము బ్రహ్మకపాల మన్నువ
న్నెలపులితోలు చీర పదనిర్మలపద్మము విష్ణువక్షము వే
దలలవిభుండు కంకణము తప్పని లెంకలు దేవసంఘముల్
సలలిత మమ్మహామహిమ సర్వము వాని గణింపవచ్చునే. 75

శా. పుట్టించుం భువనంబు నల్మొగములం బొల్పారఁగా ధాతయై
పట్టై రక్షణసేయుచుండును సుధాపర్యంకుఁడై రుద్రుఁడై
కట్టల్కం దెగటార్చు నిట్లు మఱియుం గర్వించి లీలాగతిం
గట్టా యిట్లు మహేశుమీఁద నరుగంగాఁ బాడియే
మన్మథా. 76

ఉ. ఏమని చెప్పవచ్చు నతఁ డెంతటివాఁ డని పల్కవచ్చు నీ
భూమియు నాకసంబు జలపూరము నాత్మయు నగ్ని
గాలియుఁ, సోముఁడు చండభానుఁ డగు సూర్యుఁడు
నాతఁడుఁ దాను బ్రహ్మయుం, దామరసాక్షుఁడు న్నతని
తత్త్వముఁ గానరు నీకు శక్యమే. 77

మ. చదువుల్ మంత్రములుం బురాణచయముల్ శాస్త్రంబులుం
గూడి యమ్మదుకం గానఁగ లేక తోఁచినగతిం వాదించి

వర్ణించునా,చదువుల్ పూర్వులు కన్న విన్నతపసుల్ ప్రస్త్రం
డముల్ కుక్షిలో, నుదయుం బైనవి గాన నస్మహిము దా
నూహింపరా దేరికిన్. 78

శా. కల్లోలధ్వని మంత్రజాలములునుం గాయంబు శాకీనముల్
సల్లాలిత్యతటిద్విజాల్ మణులు నక్షత్రావళుల్ ఫేనముల్
తెల్లంబై నత్రిమూర్తు లూర్ములు గతుల్ దివ్యప్రభావంబు
రం,జిల్లంగా జలపూరసంకుల మహాశ్రీకంఠవారాశికిన్. 79

వ. మఱియు నిట్లనిరొ. 80

సీ. భూకాంత తేరును బూవుల తేరును
నిర్జరసుభటులు స్మిరభటులు
కనకాచలమువిల్లు కడుతియ్య నగువిల్లు
మేటినందిపడగ మీనుపడగ
బహుమంత్రవాజులు పచ్చనివాజులు
పెక్కుదలలనారి భృంగనారి
నలుమొగంబులయంత నవవసంతుఁడు యంత
పురుషోత్తముండమ్ము పూవుటమ్ము

ఆ. వెలయరేయుఁబగలు వెలిఁగించుకన్నులు
తమ్మి కండ్లు త్రిపురదైత్యకోటి
గురి విటవ్రజంబు గురి యతనికి నీకు
నేమి సెప్పవచ్చు నెంత కెంత. 81

క. నిరుపమ నిర్మలనిశ్చల
పరమమహాదివ్యయోగభరితనిజాంతః
కరణుఁడు శివునిం గెల్చుట
విరహాంబుఁ బొరిగొంటకాదు విరహారాతీ. 82

సీ. ఖద్యోతబృందంబు గర్వింప వచ్చునే
పరఁగ దేజఃప్రదీపంబుమీఁద
పరఁగఁదేజఃప్రదీపంబు శోభిల్లునే
యాభీల ఘోరదావాగ్నిమీఁద
ఆభీలఘోరదావాగ్ని పెంపేర్చునే
పవలింటి భానుబింబంబుమీఁద
పవలింటిభానుబింబంబు వెలుంగునే
ప్రళయకాలానలప్రభలమీఁద
తే. ప్రళయకాలాగ్నికోటిచేఁ బ్రజ్వరిల్లు
మంటఁ గలకంటఁబరఁగు ముక్కంటిమీఁద
వ్రాల నేరదు నీ పెంపు దూలుఁ గాని
జితజగజ్జనసంభూత చిత్తజాత. 83

క. అని నేర్పు మెఱసి పలుమఱుఁ
దనకుం గడుబుద్ధిచెప్ప దామరసాక్షిం
గని కర్మపాశహతుఁడై
తనసతికి మనోభవుండు దా నిట్లనియెన్. 84

మ. బలభేదాద్యదిసురాళితోఁ బలుకు నా పంతంబు * చెల్లింప ను
త్పలగంధీతలఁపొండె గాని యతఁ డీబ్రహ్మాండభాండావళుల్
కలఁగం జేయు సదాశివుం డని రొయుంగంజాలుదుం జాలునే
కలకంఠీరవకంబుకంఠి శివు వక్కాణింప నిం కేటికిన్. 85

వ. అని పల్కి మరుండు మదాంధసింధురంబునుం బోలె సతు
లితమదోద్రేకమానసుం డై తదవసరంబున. 86

* చెల్లింతును, త్పలగంధి దగుబొందు, శాలి (చూడు) ముక(డీ.

క. ఖండేందుధరునివిూఁదను
దండెత్తఁగవలయు ననుచుఁ దనబలములఁ బి
ల్వుండని కాలరి తుమ్మెద
తండములకు మరుఁడు పంపెఁ దద్దయు వేడ్కన్. 87

ఉ. పంపినఁ గాలరుల్గదలి పంకజరేణువు రేగునట్లు గా
వింపుచుఁ బోయి జొమ్మరని పిల్చినఁ దద్బలముల్ చెలంగఁ గాఁ
గంపితులై పతిం గొలువ గ్రక్కున నప్పుడు వచ్చి రోలిమైఁ
దెంపును సొంపుగ్రాలఁ గడుదీవ్రగతిం రతినాథుఁ గానగన్.

క. వనములఁ గొలఁకులఁ దిరిగెడి
ఘనకోకిల కీరభృంగ కాదంబతతుల్
చనుదెంచి కొల్చె పశ్చిము
ఘనతరశైలార్కతేజుఁ గామునిఁ గడఁకన్. 89

వ. అయ్యవసరంబున. 90

సీ. బలము నేర్పులతోడఁ బన్నించి తెండని
పడవాలు కోకిలపంక్తిఁ బంపె
భేరీమృదంగాదిచారునాదంబులు
సేనయఁ దుమ్మెదల మ్రోయింపఁ బంపె
రాకీరములఁ గట్టి రథమాయితముసేయ
సంగడికాని వసంతుఁ బంపె
మహాసీయమగుచున్న మనబలంబుల నెల్ల
గమనింపుమని కమ్మగాలిఁ బంపె
ఆ. మేలుబలమువాఁడు మీనుటెక్కెమువాఁడు*
నిఖిల మెల్లఁ గలఁచు నేర్పువాఁడు

పచ్చవింటివాఁడు పరగఁ బల్విపుటమ్ము
గలుగువాఁడు ప్రౌఢగతులవాఁడు. 91

క. తనతేజము తనబలమును
తనగర్వము తనమదంబు దనసంపదయుఁ జ
ఘనతరముగ నచ్చెరువుగఁ
పనిగొని పరమేశుమీఁదఁ బైనంబఱ్యెన్. 92

వ. అంత. 93

సీ. కమలఖండము సున్నఁగాఁ జేసి యురుసుగాఁ
గావించి కెందమ్మికండ్లఁ గూర్చి
తగ నించు మోసుల నొగలుగాఁ గావించి
కర మొప్పఁ గేదఁగికాఁడి వెట్టి
సంపెంగమొగ్గల చనుగొయ్య లొనరించి
పల్లవంబులు మీఁదఁ బఱపుఁ జేసి
చెలువైన పొగడదండలచేత బిగియించి
రొలదీఁగెపలుపులు లీలఁ బొనిచి

ఆ. తెఱఁగు లరసి పువ్వుతేనెఁ గందెనవెట్టి
గండురాజకీరగములఁ గట్టి
మెఱయ చిగురుగొడుగు మీను టెక్కెము గ్రాలఁ
దేరు బన్ని సురభి తెచ్చె నపుడు. 94

వ. ఇట్లు మహిమాతిశయం బగుసుమరథం బాయత్తంబు చేసి వసంతుఁ డనంతవైభవంబున నంగసంభవుం గాంచి దేవర యానతిచ్చినవిధంబునఁ దేరాయత్తంబుచేసి తెచ్చితినదియునుం గాక పికమధురమరాళసేనా నాయకులదండు గండుమొనలై రతీంద్రానీరాకగోరుచు మొగసాల నున్నవారని విన్నవించిన

నవతరించి పురారాతిమీఁద దండు గదునించి మెయి వెంచి
విజృంభించి సముంచితపుష్పబాణాసనతూణీరసమేతుండును
త్రిభువనభవనాభినవసుందరుండును రంగద్భృంగమంగళ
సంగీతపాఠకానేక నిర్మలమహనీయ నాదమోదిత మాన
సుండును భూరికీరకైవారనిజగుణాలంకారుండును కలహంస
నాదగణపరివృతుండును సగణ్యపుష్పరథారూఢుండును
జగన్మోహనుండును సగోచరచారుశృంగారుండును హారకే
యూరమణిమకుటాభిరాముండును రమణీయరతిరామాసం
యుతుండును కలకంఠకీరసేనాధిష్ఠితుండును పల్లవఛత్ర
చామరకేతనాలంకృతుండునై నభోభాగంబునం బొడ్వు
చుండె నయ్యవసరంబున. 95

మ. కనియెం గాముఁడు మాతులుంగకదళీఖర్జూరపున్నాగచం
దనజంబీరకదంబరంభఫలినీదాడిమమందారకాం
చనవాగార్జునబింబకంటకఫలానంతప్రవాళావళీ
వనసంరంభము శీతవంతమును శర్వాణీప్రియారామమున్.

వ. కని యమ్మహావనంబు దరియం జొచ్చి. 97

సీ. తనమనోవీథిపై దర్పంబు రెట్టించి
చెన్నొంద వెడవిల్లుఁ జేతఁ బట్టి
దట్టపుమొల్లలు తలఁ జొమ్మికము వెట్టి
సొంపారఁ బూవులజోడుఁ దొడిగి
తనబలంబులనెల్ల మొనలుగాఁ గావించి
కలువలతూణీరములు ధరించి
యక్కజముగ మీనకెక్కి మెత్తించి రా
చిల్కలతేరెక్కి చివురుగొడుగు

ఆ. వాలకోలంబు బట్టంగఁ గడు వేడ్క
గిరచయము తన్నుఁ గీర్తిసేయఁ
గమ్మగాలితోడఁ గదనసన్నద్ధుఁడై
కాముఁ డేగె సోమజూటుకడకు. 98

వ. ఇవ్విధంబున నత్యంతసమ్మదంబున సకలసన్నాహబలపరివృతుండై నిదురవోయినపంచాననంబు నందంద మేలుకొలుపు మదగజంబుచందంబున నిందిరానందనుండు నిరుపమనిర్వాణనిర్వంచకనిర్విషయనిరానందమానసుండును సకలబ్రహ్మాండభాండసందోహావిలంబితనిర్మలపరమభద్రాసీన దివ్యయోగధ్యానసంతతభరితాంతరంగుండును నిర్గుణుండును నిర్వికారుండును నై తన్నుం దాన తలపోయుచు నశ్రాంతసచ్చిదానందహృదయుం డగునమ్మహేశ్వరుం గాంచి యల్లనల్లన డాయం బోయి తదీయాభిముఖుండై మనోభవుండు,

లయగ్రాహి:—

ఇంచువిలుకాఁడు వెస నించువిలుఁ జూచి మెయిఁ
బెంచి తమక మ్మినుమడించి గుణముల్మ్రో
యించి దివిజారి నలయించి విటచిత్తములు
చించి పువుటమ్ము మెఱయించి కడిమిన్ సం
ధించి శివు నేయఁ గమకించి తనచిత్తమునఁ
బంచముఖమానససముంచితము నాలో
కించి వెఱఁగంది గుఱి యించుకయుఁ గానక చ
లించి నిలిచెన్ గళవలించి భయవృత్తిన్. 100

మ. విలుఁజూచున్ వెలిఁజూచుఁజూచుసురలన్ విశ్వేశ్వరుంజూచుఁ
గొందలమందుం దలపోయఁజొచ్చుఁగడిమిన్ దర్పాకరాలం

కృతో, జ్జ్వలవిభ్రాజితనిత్యనిర్గుణతపోవారాన్నిధింజేశ్వరం
గలఁపం జూచుఁ గలంపలేక తలకుం గాముండుని శ్చేష్టుఁడై.

క. అంత శివార్చన సేయఁగఁ
గాంతాతిలకంబు శైలకన్నియ వచ్చెన్
కంతునిదీపమొ యనఁగా
నెంతయు లావణ్యమున మహేశ్వరుకడకున్. 102

క. గిరినందన డాయం జని
యరుదుగ మణిపూజసేయ నత్తఱి మారున్
గిరిజకరంబులు సోఁకినఁ
బరమేశునిచిత్త మెల్లఁ బరవశమయ్యెన్. 103

వ. ఆసమయంబున. 104

శా. టంకారధ్వని నింగి నిండ వెడవింటం బుష్పబాణంబు ని
శ్శంకం బూని సురేంద్రు కిచ్చినప్రతిజ్ఞాసిద్ధి గాఁ జేసి తాఁ
గింక న్విల్లెగఁ దీసి గౌరి శివునిం గేలెత్తి పూజించుచో
హుంకారించుచు నీశు నేసె మదనుం డుజ్జృంభసంరంభుఁడై.

క. మదనుం డేసినబాణము
హృదయంబునఁ గాడి పార నీశుఁడు దన్నున్
బెదరించె నెవ్వఁ డక్కడ
మదచిత్తుఁడు ఘోరకర్మమానసుఁ డనుచున్. 106

క. ఏసియు నంతటఁ దనియక
ఖాసిలి వెండియును బుష్పబాణము నారిం
బోసిన మానససంభవు
నీశుఁడు గను విచ్చి చూచె నెవ్వఁడొ యనుచున్. 107

వ. ఇట్లు చూచిన. 108

మ. కులశైలంబులు ఛేదిలన్ జలనిధుల్ కోలాహలంబై చెనం
గలఁగన్ దిక్కులు ఘూర్ణిలన్ జగము లాకంపింప విశ్వంభరా
స్థల మల్లాడ నభస్థలిం గరుడగంధర్వామరాధీశ్వరుల్ [లన్.
పలుమాఱుం బెగడొందఁ జుక్కలురలన్ బ్రహ్మాదులున్ భీతి

క. భుగభుగ యను పెనుమంటలు
భగభగ మని మండ నంత బ్రహ్మాండంబున్
దిగుదిగులు దిగులుదిగు లనఁ
దెగి మరుపైఁ జిచ్చుకన్ను దేవుఁడు విచ్చెన్. 110

క. దిక్కు లెఱమంటఁ గప్పెను
మిక్కిలిగా మింటనెగయుమిడుఁగురుగములున్
గ్రక్కదలి రాల వడిగాఁ
జుక్కలు ధరఁ బడఁగ మింట సురలుం గలఁగన్. 111

వ. అంత. 112

సీ. కలహంసములతోడ గండుగోయిలలతో
మేలైన కమ్మదెమ్మెరలతోడ
చిలుకలగములతో నలరుల తేరుతో
శరము వూన్చిన శరాసనముతోడ
పుష్పహారములతోఁ *బుష్పవస్త్రములతోఁ
దనరారు మకరకేతనముతోడ
పువ్వులజోడుతోఁ బువ్వులదోనలతోఁ
గోమరారు చిగురాకుగొడుగుతోడ

*బుష్పాస్త్రములతోడ.

ఆ. మఱియుఁ దగినయట్టి మహితశృంగారంబు
తోడఁ గూడి వేగఁ దూలి తూలి
శివునినుదుటికంటిచిచ్చుచే సుడివడి
పంచవింటిజోదు భస్మమయ్యె. 113

క. ఓహో దారుణతమ మిది
యాహా మరుఁ డీల్గె నీల్గె నని శివమదనో
గ్రాహవము చూచి మింటను
హాహానాదంబులిచ్చి రమరేంద్రాదుల్. 114

వ. మఱియు నయ్యవసరంబున ఫాలలోచనాభీలపావకకరాళ జ్వాలావళీపాతభస్మీభూతుం డై చేతోజాతుండు దెగుటఁ గనుంగొని విస్మయాకులచిత్తయై యతని సతియైన రతీదేవి తల్లని యుల్లంబుపల్లటిల్ల నొల్లం బోయి మూర్ఛిల్లి యల్లన తెలివొంది శోకంపువెల్లి మునింగి కలంగుచుఁ దొలంగరాని బలువగలపాలై తూలుచు వదనంబును శిరంబును వదన గహ్వరంబు నందంద మోదుకొనుచు మదనుండు వాలిసిన చోటికి డాయం బోయి యిట్లని విలపింపం దొడంగె. 115

ఉ. హా వలరాజ హా మదన హా మధురాయతచారులోచనా
హా*విరహాళిధూననిరంతరచాపలసత్ప్రతాప
హా వనజాతనేత్రతనయా యెట డాఁగితి నాకుఁ జెప్పుమా
సేవితమైననీబలము చెల్వము మంటలలోన డాఁగెనో. 116

శా. కట్టా దేవరకంటిమంటలు నినుం గారించుచో మన్మథా
చట్టాలం దలిదండ్రులం దలఁగితో శోకంబునుం బొందితో

* విటలోకమానసనిరంతరతాప.

పట్టంగాలని శోకవార్ధిఁ బడి నీప్రాణేశ్వరిం బిల్చితో
యెట్టుం బోవఁగ లేక మంటలకు నై యేమంటి వోయన్న హా.

ఉ. గ్రక్కున రావె నామదన కావవె నావలరాజ నన్ను నీ
చక్కఁదనంబుమోహమును శౌర్యము నేఁగతిఁదూలిపోయెనీ
వెక్కడఁ బోయి తింక నది యెక్కడ నున్నది పాప దైవమా
అక్కట చెల్లబో కటకటా యిది ప్రాఁతఫలంబు తప్పునే. 118

సీ. పోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు
పుష్పబాణము లెందుఁ బోయె నేఁడు
ఈరేడుజగముల నేపుమైఁ గరగించు
కడిఁది యెచ్చట దూలిగ్రాఁగె నేఁడు
కాముకవ్రాతంబు గర్వంబు గబళించు
టంకారరవ మెందు డాఁగె నేఁడు
విటులగుండెలలోన విదళించుచిగురాకు
సంపెటప్రే టెందు సమసె నేఁడు

ఆ. నిన్నఁగాన నిపుడు నీవెందుఁ బోయితి
ప్రాణనాథ నన్నుఁ బాయఁదగునె
విరహిచిత్తచోర విఖ్యాతసుకుమార
అమరశైలధీర హరికుమార! 119

క. వారక నిఖిలజనంబుల
నీరసమున సతులఁ బతుల నేచి కలంపన్
నేరిచి శివునిఁ గలంపఁగ
నేరవలేవైతి మదన నిన్నేమందున్. 120

శా. తల్లిందండ్రియుఁ దాతయుం గురుఁడునుం దైవంబు నాప్రాణ
ముల్, ఉల్లంబందున నీవె కాఁ దలఁచి నే నొప్పారగాఁ

నిర్యోదశ, శైల్యంబో నిను నమ్మియుండఁగను పేత్రికంతుపై
వచ్చి నీ పొత్తై పోవుట నేనెఱుంగుదు నె నీపుణ్యంబు లిట్ల
య్యె నే. 121

ఉ. తల్లులు పుణ్యగేహినులు దండ్రులు పుణ్యజనంబు లంచు నా
యుల్లమునందు నేఁ దలఁతు నోసురగేహినులార మీరు నా
తల్లులు నేను గూఁతురను ధర్మపురోశములదానఁ గాన మీ
యల్లుని నిచ్చి నన్నరల నైదువఁ జేయరె మీకు మ్రొక్కె
దన్. 122

ఉ. దేవతలార మీకొలకు ధీరగతిం బెడవింటిజోదు దా
దేవరచేతఁ జచ్చె వన దేవతలెల్లను పాడి నాకు నా
దేవర మీకు నీదగవు తెల్లముగా శివుఁ గొల్చి యిచ్చినన్
గావరె ప్రోవరే పగవుగ్రక్షునఁ బాపరె మీకు మ్రొక్కె
దన్. 123

ఉ. ఏ వలరాజుభార్యను సురేంద్రునిశోడల శంభుచేత నా
దేవరఁ గోలుపోయి కడు దీనత నొందుచున్నదానఁ జం
డోవనవీథి నున్న ఖచరోత్తములార దిగింద్రులార రం
డోవనవాసులార వినరో మునులార యనాథవాక్యముల్.

సీ. పురుషభిక్షముపెట్టి పుణ్యంబు సేయరే
తపముసేయుచున్న తపసులార
ధర్మమెంతయు భర్తృదానంబు సేయరే
దివినున్న యింద్రాదిదివిజులార
నావల్లభుని నిచ్చి నన్ను రక్షింపరే
తలయెత్తి చూచి గంధర్వులార

దిక్కుమాలినదాన దిక్కయి కావరే
ధర్మమానసులగు తండ్రులార
తే. అమరశరణంబు వేడెద నన్నలార
అధిపుఁ గోల్పడి కడుదీన నైనదానఁ
గరుణఁ గావంగ నింక నెవ్వరును లేరు
పుణ్యవతాను మొఱాలించి ప్రోవరయ్య. 125
శా. రారే యేడుఁపు మాన్పరే మధురిపుల్ రప్పింపరే కావరే
పోరే కు రయ్యరిగింపరే సిరికి నాపుణ్యంబు విన్పింపరే
తేరే దేవర వేడి నా పెనిమిటిన్ దీర్ఘాయుషాపేతుగా
నీరే మంగళసూత్రబంధనము మీ కెంతేనిపుణ్యం బగున్.
సీ. పరమేశుఁ డనియెడిపడమటికొండపైఁ
గుసుమబాణార్కుండు గ్రుంకె నేఁడు
గౌరీశుఁ డనియెడు గంభీరవార్ధిలో
నరిగి మన్మథకలశంబవిసె నేఁడు
ఫాలాక్షుఁ డనియెడి బడబానలములోనఁ
గందర్పకాంభోధి గ్రాఁగె నేఁడు
మలహరుఁ డనియెడు మహితమార్తాండుచే
మదనాంధకారము మ్రగ్గె నేఁడు
ఆ. నేఁడు మునులతపము నిష్కళంకత నొందె
నేఁడు యతులమనసు నిండియుండె
నేఁడు జగము లెల్ల నిర్మలాత్మక మయ్యె
నేమి సేయనేర్తు నెందుఁ జొత్తు. 127
చ. అతిమురితేఁ జిన్ననాఁడు చెలులందఱు గొల్వఁగఁ గూడియాడ
నీ, చిఱుతది పుణ్యకాంత యనిచేతులవ్రాఁతలు చూచి పెద్ద

లే, మెఱుగుదు మంచు చెప్పటలు యెంతయు తథ్యము
గాకపోవునే, యెఱుకలు మాలి పోఁబిదప నే విలపించుట
కెల్లమయ్యెఁ జో. 128

సీ. ఉచితమార్గంబున నుపలాలనము జేసి
యెలమి రక్షించువా రెవ్వరింక
అటవారు నిటవారు నయ్యేడుగడయు నై
యెలమి నన్నేలువా రెవ్వ రింక
లీల నర్థించిన లేదని పలుకక
యిష్టంబు లిచ్చువా రెవ్వ రింక
కర్ణంబులకు నింపు గా నిష్టవాక్యంబు
లేపారఁ బల్కువా రెవ్వరింక
ఆ. నేఁడు నాథ నీవు నీత్రైన పిమ్మట
తివిరి నన్నుఁ గావ దిక్కు లేమి
తలఁపులోనఁ దలఁపఁ దగదయ్యె చెల్లబో
వీరసూకళత్ర విష్ణుపుత్ర. 129

క. అంగజ నే ననుమాటలు
వెంగలి రై వినవె కాక వేగము నీకుం
సంగరరంగములోపల
గంగాధరుఁ గవయఁ దరము గాదంటిఁ గదే. 130

మ. కోలది౯ మీఱినశంభుయోగశరధిం గుప్పింప రాదంటిఁగాఁ
గలలో నైనను నొప్పనంటి భవుఁదాఁక౯ వద్దువద్దంటి దు
ర్బలమై యూరక వచ్చి శూలిరుషకుం బాలైతివే యక్కటా
తొలి నేనోచిననోము లిప్పుడు భవద్దూరంబు గావించెనే.

సీ. ఎప్పుడు గోపించి యెనయంగ యోగంబు
మానునో యీయంగమాయగొంత
యెప్పుడు మరని దా నీక్షించి తెలిసెనో
ధృతిఁ బుట్టువులు లేని తిరిపజోగి
యెప్డు విజృంభించి యెఱమంట లెగయంగ
ముక్కన్ను దెఱచెనో ముందుకతపసి
యెప్పుడు గృపమాలి యెప్పుడు గాల్చెనో
కులగోత్రములు లేని గూఢబలుఁడు
ఆ. అనుచు నెంతవైర మనుచు నెద్దియుఁ జూడఁ
డనుచు మదనువనిత యవనిమీఁద
మూర్ఛవోయి తెలిసి మోము మొత్తి బిట్టేడ్చెఁ
గడఁగి శోకవార్ధి గడలుకొనఁగ. 132
వ. మఱియు నత్యంతదురంతసంతాపచింతాక్రాంత యై అంత
కంతకు నక్కాంతాతిలకంబు మహాశోకవేగంబున. 133
సీ. మెఱుఁగుఁదీఁగెయుఁబోలు మైఁదీఁగె నులియంగ
పదపడి వలికిలోఁ బొదలువెట్టు
కోకద్వయముఁబోని కుచకుంభములు గంద
నలినాక్షి కరతాడనంబు సేయు
నీలాలగతిఁ బోలు నీలంపుటలకలు
ముడివడయూడి యమ్ముదితయేడ్చు
కల్హారములఁ బోలుకన్నులు గతిచెడఁ
గమలాక్షి కడునశ్రుకణము లొలుక
తే. ఇంతి విలపించు నత్యంతమేచ్చుఁ బొక్కు
నధిప చనుదెంచి కావవె యనుచుఁ జివుకు

ప్రక్కు మూర్ఛిల్లు దెలివొందు సురలఁ దిట్టు
మగుడ నెంతయు సంతాపమగ్న యగుచు. 134

వ. తనమనంబున ని ట్లనియె. 135

మ. నిను వేభంగులఁ బాయఁ జాల వనితా నిర్భేదమం దేమియు
న్మనప్రాణంబులు రెండు నొక్కటిసుమీ సారీమణి నమ్ముమీ
యని కావించినబాస లన్నియును గల్లయ్యెం గదా లక్షీనం
దన యెవ్వారికినైన దైవఘటనల్ తప్పింపఁగా వచ్చునే. 136

క. అని విలపించుచుఁ గుందుచుఁ
దనచేరువ నున్నయట్టి తాపసవర్యున్
ధననాథమిత్రు నీశ్వరుఁ
గనుఁగొని శోకాతురమునఁ గన్నియ పలికెన్. 137

క. తగు నంబిక శంభునిఁ గని
తగ మిమ్మిద్దఱను గూర్పఁదగు నమ్మరుపైఁ
బగమీఱఁ గృపఁ దలంపక
తెగఁ జిచ్చరకన్నుమీటుఁ దెరువం దగునే. 138

క. తొలి నీవు దుష్టజనులం
బొలియింతువు లోకపతులఁ బోషింతువు నిం
దలఁ బొందవు మరు నిట్టులఁ
బొలియించుట సాదునో ముపుణ్యము రుద్రా. 139

క. యేచినమన్మథు దశశత
లోచనుఁ డిటఁ దెచ్చి నీదులోచనవహ్నిం
ద్రోచెనె యిటుగా నోచితి
యాచంద్రము తైనసోము లిప్పుడు రుద్రా. 140

క. అనుమాటలు విని శంభుఁడు
తనమది నీవనిత శోకతాపాకులయై
తను నేమనియాడునో యని
చనియెఁ శీఘ్రమున రజతశైలముకడకున్. 141

వ. అంతఁ గంతుచెలికాఁడు వసంతుం డిట్లని విలపింపం దొడంగె.

ఉ. సంగతితోడ నావలచుజాణఁడు పాంథజనాపహారి నా
సంగడికాఁడు నన్నెలమి వల్లనిరేలిక దేవతార్థ మీ
జంగముమీఁద వచ్చి బలసంపద నాతనికంటిమంటలన్
సంగరభూమిలో మడిసెఁ జయ్యన దేహముఁ బాసి దైవమా.

ఉ. శంకర జోగిఁ దెచ్చి సమపారనివాసునిఁ జేయ కున్నచో
నంకిలిగల్గు నీజగము లన్నియు నిర్జరకోటితోడ నే
వంకకు వ్రాలునంచు సురవల్లభుఁ డక్కట తన్నుఁ బంప మీ
నాంకుఁడు వచ్చి నేఁడు త్రిపురాంతకుచేఁ దెగటారెఁ జెల్లఁబో.

క. మానిని మదనునియుద్ధము
గానంగా నేర నైతి కాముఁడు రాఁగన్
దా నేల పాసిపోయితి
భూనుతగుణహారుఁ గోలుపోయితి నకటా. 145

క. అని యామని విలపింపఁగఁ
గని తూలుచు మోదికొనుచుఁ గడువగతోడన్
మనసిజవల్లభ మఱి దా
విను మని యామనికిఁ బలికె విపులాతురయై. 146

క. అన్నా నీచెలికాఁ డిటు
వెన్నెలధరుమీఁద వచ్చి వేఁగుట నీకున్

బన్నుగ నెవ్వరు చెప్పిరి
కన్నారఁగ నట్టివేళ గాంచితొ లేదో. 147

క. తారకు తపోమహత్త్వము
నారయ దేవతలు నతనియానందంబుగా
గౌరీనాయకు కోపము
కోరిక మరుఁ బట్టి భుక్తిఁ గొనిరొయింం జుమ్మీ. 148

ఆ. ప్రాణనాథుఁ బాసి ప్రాణంబు నిలువదు
పోవవలయు నాకుఁ బోవకున్న
సురభి యింక నీవు సొదఁ బేర్చ వేవేగఁ
జిచ్చుఁ జొత్తు గామఁ జేరవలసి. 149

క. అనలముఖంబున సతులకు
ననుగమనము చేసి దివికి నధిపుఁడు దానుం
జనుట మహాధర్మం బని
వినిపించెడిబుధులమాట వినవే చెపుమా. 150

వ. అనిన వసంతుండు ప్రలాపించు తదీయప్రకారంబుల విచా
రించి సముచితప్రకారంబున ని ట్లనిరెు. 151

సీ. యేల నిట్లాడెద వేకచిత్తంబున
నామాట వినవమ్మ నలిననేత్ర
గౌరినాయకుఁ డింక గౌరీసమేతుఁ డై
సుఖమున్న నింద్రాదిసురలు వచ్చి
నీప్రాణనాథుండు నిష్ప్రాపుఁ డని చెప్ప
మరలను బడయు దీవరుదుగాఁగ
అదిగాక మన్మథుం డమరులపంపునఁ
జెడినవాఁడును గానఁ జెప్పి బలిమి

ఆ. విబుధు లెల్ల విన్నవించిన పరమేశ్వ
రుండు భక్తవత్సలుండు గాన
పంచబాణు నిచ్చు భావింపు మిమ్మాట
వెలఁది నమ్ము నీవు వేయునేల. 152

క. అని పలికిన పలుకులకును
ననుగుణమై యీప్రకారముగ నిజమనుచుఁ
వినువీథి నొక్కనినదము
ననుగుణముగ మ్రోసె జనుల కాశ్చర్యముగన్. 153

వ. ఇట్లు పలికిన గగనవాణిపలుకులును వసంతుపలుకులు
నాలించి రతీదేవి యి ట్లనియె. 154

ఉ. ఎచ్చటనుండి యిందుధరుఁ డిప్పుడు పార్వతిఁ గూడుఁగూడెఁ
బో, యిచ్చునె మన్మథుం దివిజు లెప్పుడు చెప్పుదు రిట్టివాక్య
ముల్, మెచ్చునె లోకముల్ వినిన మేదినిఁ జచ్చిన వారు
వత్తురే, చెచ్చెర నిప్పుడీబయలు చెప్పినమాటలు నమ్మవచ్చునే.

ఉ. ఏలదురాశ పోవిడువు మెన్నికలుంగులనైన శోకసం
గాకులచిత్తనై విధవనై గతిమాలిన దీనురాలనై
తూలుచుఁ గాలుచు న్వగల దుస్థితిఁ బొందఁగఁజాలఁబావక
జ్వాలలఁ జొచ్చి నాహృదయవల్లభు మన్మథుఁ గానఁ బోయె
దన్. 156

వ. అని బహుప్రకారంబుల రతియును వసంతుండును దమలో
నుచితాలాపంబులు పలుకుచున్నసమయంబున. 157

ఉ. ఏల మృగాక్షి నాపలుకు లేటికి నమ్మవు శూలి కొండరా
చూలి వివాహమైనరయిడ శోభనముంగళవృత్తి నున్నచో
వేలుపు లెల్ల నంగజుఁడు వేఁగుటఁ జెప్పినఁ గామునిచ్చునా

నీలగళాంతకుఁ డీవిధము నిక్క మటంచు నభంబు మ్రోయుఁ
దున్. 158

క. మింట నశరీరవాణియుఁ
దొంటివిధంబునను బలికెఁ దోయజనేత్రీ
వింటివె నీనాయకుఁడే
వెంట న్మరలంగ వచ్చు విశదాబ్జముఖీ. 159

వ. అని మఱియు ననేకవిధంబుల నూరడించిన వసంతునిపలుకు
లగుం గాక యని నత్యంతవిహ్వలచిత్తంబున. 160

క. సతతంబు నతులవేదన
మతి బొందుచు హృదయకమలమధ్యమునందుం
బతిఁ దలఁచి చింతసేయుచు
రతి దా వర్తించె నొండు రతిలేనిగతిన్. 161

ఉ. కాముని బిల్చి పెద్దయును గౌరవ మొప్పఁగ బుజ్జగించి సు
త్రాముఁడు శంభుపై బనుపదర్పకుఁడుం జను దెంచి యేయుచో
సోమకళావతంసుఁడును సుక్కక మూఁడవకంటిచూపునం
గాముని నీఱుసేయుట జగంబుల మ్రోయుటయున్న ఖండమై.

హిమవంతుఁడు తనయింటికి గూతుం గొంపోవుట

శా. అంతం గొండలరాజు నెమ్మనములో నావార్త యాలించి వే
సంతాపంబునఁ జిన్నవోయి చని తా సర్వేశ్వరుం గాన క
త్యంతాందోళవిచార యైనతనయ న్దా వేగఁ గొంపోయె న
క్కాంతారత్నము తండ్రి దోకొని చనంగా నేఁగె శీతాద్రికిన్.

క. ప్రమదంబునఁ దలిదండ్రులు
కమలాక్షికిఁ జెలుల నిచ్చి గౌరవసేయం

హిమవంతుపట్టణంబునఁ
గమలానన గౌరి కొంతకాలము గడపెన్. 164

వ. అంత నొక్కనాఁడు పరమేశ్వరుండు కైలాసంబున సుఖం
బుండి గౌరీదేవిం దలంచి ప్రేమచేసి యుండు టెఱింగి
నిజాంతర్గతంబున. 165

శంకరుఁడు వెలఁదియై శీతాచలంబునకు వచ్చుట

ఆ. గౌరిమీఁదఁ బ్రేమ కడు నంకురింపంగ
సమ్మదంబుతోడ సంభ్రమించి
అద్రిరాజు వీటి కరుగుదునో యని
తలఁచె దృఢముగాఁ గమలహరుండు. 166

వ. ఇట్లు తలంచి. 167

క. ఏవెంట నరుగవచ్చును
యేవెంట లతాంగిఁ జూతు నిందువదనతో
నేవెంట మాటలాడుదు
నేవెంట మృగాక్షిఁ గదియ నెంతయు నొప్పున్. 168

వ. అని విచారించి. 169

సీ. కాకోదరాధీశకంకణంబులు దాఁచి
శంఖకంకణములు చాలఁ దొడిగి
సామజదనుజేంద్రచర్మాంబరము దాఁచి
* రమణీయపులినాంబరమ్ము గట్టి
గంగానిశానాథకలితజూటము దాఁచి
కుఱువెండ్రుకలు గలకొప్పు వెట్టి

* కమనీయకనకాంబరమును గట్టి.

పావకరాజితఫాలభాగము దాఁచి
తిలకంబుతో ఫాలములరుఁ జేసి
ఆ. భూతి దాఁచి పసపు పూసి త్రిశూలహా
స్తంబు దాఁచి చేత సజ్జ యమర
వెలఁది మేనఁగల్గు వీరుఁడు వెలఁదియై
యొఱుక యొఱుక యనుచు నేఁగుదెంచె. 170

వ. మఱియును. 171

సీ. కడునొప్పుదిశలెల్ల గనకంబు గావించు
తాటంకరోచులు దనరుచుండ
చనుదోయిపైఁ గ్రాలుశంఖహారావళి
పయ్యెదలోపల బయలుదూఁగ
సందిట నిఱికినసజ్జయు రమ్యమై
రత్నపేటికభంగి రమణ మెఱయ
యన్నువ యగుమధ్య మల్లలనాడంగ
నడుగిడ యానంబు తడబడంగ
ఆ. చిలుకపలుకు లొప్ప నేసముత్యము లొప్ప
నలివరాఖ్య దనకు నచ్చుపడఁగ
మంచుకొండపురికి మలహరుఁ డేతెంచె
నింతులార యొఱుక యొఱుక యనుచు. 172

వ. ఇట్లు మాయావేషధారి యై హిమవంతుఁబట్టణంబున కరుగు
దెంచి యందు. 173

క. మహిలో జనములు వొగడఁగ
బహువిధముల నెఱుకచెప్పి ప్రౌఢతనముం

దుహీనగిరి కరిగి చేరవ
విహితంబుగ నెఱుక యనుచు వెలఁది చెలంగెన్. 174

ఉ. చంచలనేత్రి గౌరి యొకసౌధముపై చెలిఁగూడి తా వినో
దించుచు నయ్యెలుంగు విని తేటపడంగ సఖీలలామతోఁ
బంచశరారిఁ గూడఁ గనుభాగ్యము నాకు లభించునట్లు గా
వించునొ మాత యీయెఱుక సల్లభ నేనడుగంగఁబోలునే.

వ. అని విచారించి. 176

ఉ. సమ్మదముం గుతూహలము సంభ్రమముం జనియింప నవ్వినో
దమ్ములు గౌరి మూని యొకతన్వికరాబ్జము పట్టి తద్గవా
క్షమ్ములవెంటఁ జూచి రథసంబునఁ జేరువ రాజవీథులం
గ్రుమ్మరుప్రౌఢ నాయెఱుకఁగోరికఁ గన్గొనియోలతాంగిదాన్.

వ. అట్లు గాంచి. 178

ఉ. ఈముఖపంకజంబురుచు లీనయనోత్పలపత్రనిర్మలం
బీమెయిఛాయ లీనగవు లీమురిపెంబులు నీవిలాసముం
గామినులార యెందు మఱి కల్గఁగ నేర్చునె తొల్లి బాపురే
సామజయాన యీయెఱుకసానికిఁదాఁ జెలు వింత యొప్పునే.

క. పిలువుఁడు ప్రౌఢ నిచటికిఁ
గలసందేహముల నడుగఁగావలయు వెసఁ
గలుగుట లేకుండుట నీ
వెలఁదిగదా మనతలంపు వివరముసేయున్. 180

వ. అని మఱియు నిట్లనిరి. 181

క. వాలాయము పిలిపింపుఁడు
నీలాలకలార రంతు నేర్పుతోడఁ

శైలేంద్రుఁ డెఱుఁగకుండఁగ
నీలలలామణిని గొనుచు నిచటికి వేగన్. 182

చ. అనవుఁడు నెందతేవి గమలాక్షులు వేగము వోయి వీథికిన్
జని గిరిజాత యోగయుతసాని నిను బిలువంగఁ బంచె నే
పనివిను మన్న సందియము వల్కుచు నేఁగిన గౌరిపంపునన్
గొనకొని కన్యకామణులు గొందఱు డగ్గఱి నేఁగి యి
ట్లనున్. 183

మత్తకోకిల.—
ఏలపోయెదు నిల్వవో ధరణీధ్రకన్యక పిల్వఁగాఁ
జాలునే యిటు ద్రోచిపోవఁగ బోకు మొక్కటి చెప్పెదన్
జాలు నంతయు నీవు కోరినసంపదల్ గరుణించు నీ
కాలు నొవ్వఁగఁ బ్రోలిలోఁ దిరుగంగ నేటికిఁ జెప్పుమా.

వ. అనవుడు నక్కపటగామిని యి ట్లనియె. 185

ఉ. రాజగృహాంతరంబులను రాజతనూజ కెఱుంగఁ జెప్పఁగా
రాజును రాజసుందరియు రాజనిభాననలార నన్ను నే
రోజఁ దలంతురో యనుచు నూరక పోయెదఁ గాక గౌరి
సంభోజద కేక్షణల్ గదియుపుణ్యము చాలదె చేయ
నేటికిన్. 186

వ. అని మఱల నరుగుదెంచుసమయంబున. 187

చ. వెఱవక వద్దు నీకు నరవిందనిభానన యేను బిల్వఁగా
వెఱవక రమ్ము నాతలఁపు వేగమె చెప్పినమెచ్చు వెట్టెదన్
మఱియు నభీష్టసంపదలు మానుగ నిచ్చెద నిశ్చలంబుగా
నెఱుకలసాని రమ్మనుచు నెంతయుఁ బ్రేమభవాని పిల్వగన్.

వ. అరుగుదెంచి తదీయహర్మ్యస్థానంబునకుం జని పార్వతీదేవిం
గనుంగొని నిలచియున్న యనంతరంబ. 189

నగజకు నెఱుకఁ దెలుపుట

క. కడకంటఁ గరుణ వొడమఁగఁ
బడఁతుక సఖు లెందఱేనిఁ బరివేష్టింపన్
మృడుసతియును నెఱుకతతో
నడిగినకృత్యంబు చెప్ప నగుగతి గలదే. 190

వ. అని పలికి హిరణ్యమణిమరకతవజ్రవైడూర్యఖచితంబు నగు
విలసితాసనంబునం గూర్చుండి దేవేంద్రకమలసంభవనారా
యణప్రముఖులైన దేవతలు నెఱుంగరు భవదీయచిత్తంబున
నేది యేనియుం దలంపు చెప్పెద నదియునుం గాక విను
మని యి ట్లనియె. 191

సీ. చింతించి యాబ్రహ్మ సృష్టిఁ బుట్టించుచో
నెలనాఁగ ననుఁ గాంచి యెఱుక లడిగె
నగములు సాధింప నగభేది రావించి
యెలనాఁగ ననుఁ గాంచి యెఱుక లడిగె
దనుజాల నిర్జింప దనుజారి పోవుచో
నెలనాఁగ ననుఁ గాంచి యెఱుక లడిగె
మఱి హాలాహలవహ్ని దెరలి వేల్పులమూక
యెలనాఁగ ననుఁ గూర్చి యెఱుక లడిగె

ఆ. పరమమునులు యతులు పరమయోగీంద్రులు
సభలమున్న నన్ను సంతసమున
నెఱుక లడిగి కాదె యెల్ల శుభంబులు
గలిగియుండు చెల్ల కమలనేత్ర. 192

వ. అని మఱియు నమంచితాలాపంబులు పలుకఁ బరమయోగీంద్రప్రౌఢం గనుఁగొని యొకతలంపు దలంచెదఁ జెప్పుమని కనకమయపాత్రంబున ముక్తాఫలంబు లమరించి వానిం జూచి భావంబున ని ట్లని తలంచె. 193

సీ. నగరాజుపురమున నా కెన్ని దినములు
నిశ్చయంబుగ నేను నిలువవలయు
నటమీఁదఁ దడసిన నడవులలోపల
శివునికై తప మెంత సేయవలయు
తపము గావించినఁ దాపపాపాధీశ్వరుం
డమరంగ నెంతకాలమున మెచ్చు
మెచ్చిన పిమ్మట మీనధ్వజారాతి
కే లిచ్చి నన్ను నేక్రియ వరించుఁ

ఆ. దప్పకుండఁ జెప్పు ధర్మదేవత యని
యబల చెలులతోడ నను మతించి
తలఁపు తథ్య మేని తలకొని చెప్పుమా
యనుచు నిజము గోరి యద్రిపుత్త్రి. 194

వ. ఇట్లు నియమింపఁ దలంచిన. 195

ఆ. నాకు వాకు వచ్చె నలినాక్షి రమ్మిటఁ
గరము దెమ్ము నాదుకరము పట్టి
యనుచుఁ బ్రేమతోడ నడల పాణిగ్రహ
ణమ్ముఁ జేసెఁ గపటనాటకుండు. 196

క. ఒకమాటు గరము లంటుచు
నొకమాటు లతాంగిచిత్త మూరించుచు వే

ఱొకమాటు కుచము లంటుచు
ప్రకటించుచు నెఱుకఁ జెప్పెఁ బార్వతిసతికిన్. 197

సీ. హరుఁ గూర్చి తలఁచితి వంబుజలోచన
 తలఁపు లన్యులమీఁది తలఁపుగాదు
శైలాధిపతియింట సతి వసించెద నన్నఁ
 దలఁపు వేడ్కలమీఁది తలఁపుగాదు
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరియెదనన్న
 తలఁపు వేఱొకచోటిఁ తలఁపుగాదు
పరమేశు నర్చించి భార్య నయ్యెద నన్న
 తలఁపు లెవ్వరిమీఁది తలఁపుగాదు

ఆ. కాదు నిశ్చయంబు గంగాధరునిమీఁది
భక్తి గలదు నీకు భరితముగుచు
నాతి నీతలంపు నామాటయును వేఱ
మగుటయొల్లఁ దలఁపు మంబుజాక్షి. 198

వ. అదియునుం గాక. 199

క. నాకేమి మెచ్చు పెట్టెదు
నీకుఁ సిద్ధించు మేలు నిర్ణయమై నా
వాకునకుఁ దోఁచుచున్నది
వీఁకను నెఱిఁగింతు నీకు వినుమిందుముఖీ. 200

వ. అనిన విని పార్వతీదేవి యి ట్లనియె. 201

క. మణికేయూరము లిచ్చెద
మణితాటంకంబు లిత్తు మంజులవాణీ
మణులుం గనకము లిచ్చెద
మణికోటీరములు నీకు మఱియు న్నిత్తున్. 202

వ. అనవుడు నక్కపటవెలఁది యి ట్లనియె. 203

క. మణికేయూరము లొల్లను
మణితాటంకంబు లొల్ల మంజులవాణీ
మణులుం గనకము లొల్లను
మణికోటీరంబులొల్ల మన్నన లొల్లన్. 204

క. ననుఁ గూడి తిరుగ నొసఁగుము
ధనములు నాకేమి సేయు ధనములు చేలుఁగా
నినుఁ గూడి యుంటఁ బోలునె
యనవుడు నగుగాఁకఁ జెప్పె ముని సతి యనియెన్. 205

వ. అనవుఁడు నాప్రోడ యి ట్లనియె. 206

సీ. కువలయలోచన కొన్ని దినంబులు
కొండలరాజింట నుండఁగలవు
ఉండి వనంబున నువిదతో నేఁగియు
శివునికై తప మర్థిఁ జేయఁ గలవు
తపమర్థి జేసినఁ దరళాక్షి నినుఁ గూర్చి
మీనాంకవైరియు మెచ్చఁ గలఁడు
మెచ్చి సంభావించి మీతండ్రి యింటను
వేడుక నినుఁ బెండ్లియాడఁగలఁడు

ఆ. అమరఁ బెండ్లియాడి యర్ధాంగలక్ష్మివై
సకలభువనరాజ్యసంపదలను
గలిగి మోము లాఱుగలసుతుఁ గాంచి మో
దమున నుండఁగలవు ధవళనేత్ర. 207

వ. అని మఱియును. 208

ఆ. నిన్నుఁ బొందఁ దలఁచి నెలఁత యువ్విళ్లూరు
చున్నవాఁడు శంభుఁ డుగ్రమూర్తి
శంకరుండు భవుఁడు శాశ్వతుం డఖిలాండ
చక్రవర్తి యైనచంద్రధరుఁడు. 209

వ. ఇందేల యున్నదానవు వనవాసప్రయాణంబు చేసి పరమే
శ్వరు నేలుకొమ్ము నీకుం గానరాఁడు పరమేశ్వరుండు వీఁడే
నినుఁ జూచి పోవుచున్నాఁడు నిశ్చయం బని చెప్పి వీడ్కొని
తనపూర్వప్రకారంబుఁ దాల్చి కైలాసంబునకుం జనియె నంత
నచ్చెలియు నొక్కనాఁడు తనమనంబున ఖండేందుభూషణుం
దలఁచి కామమోహావేశంబున నిట్లని తలపోయం దొడంగె.

ఉ. లోలత నాకు వల్లభుఁడు లోఁబడి తప్పి సమాధినిష్ఠమై
సోలెడికాయమ్ముం గరఁగఁ జూచుచు నుండుసుఖంబు గానశ్రీ
శైలనివాసుకొద్దఁ బరిచర్యలు సేయఁగ లేదు చెల్లరే [దున్.
మేలొనఁ గూడి కూడి యిటు మిన్నక పోయె నిఁకేమి చేయు

సీ. వినరమ్మ నామాట విశ్వేశ్వరునిఁ బాసి
నిలువంగ నేరనో నెలఁతలార
నాగేంద్రధరుమీఁద నాకోరికలు పర్వి
పాయంగ నేరనో భామలార
వలరాజు వెసఁ దోఁచి యలరులకోలంబు
లేసి నొప్పించెనో యింతులార
నగములరాజుతో నాప్రకారం బెల్లఁ
దెలియంగఁ జెప్పరే తెరవలార

ఆ. రమణులార నిలువరాదింకఁ దాపంబు
సరసిజాక్షులార సైఁపరాదు

ఒక్కదినముగడుచు టొక్కవత్సరముండాఁ
గడచుటరయ్యె నాకుఁ గాంతలార. 212

ఉ. బాలశశాంకభూషణునిఁ బాసి చరించుట దుస్తరంబు నీ
లాలకలార చంద్రముఖులార తపోవనభూమిలోపలన్
జాల తపంబు చేసి హరుశంకరుసన్నిధిఁ గాంతు నింక మీ
కేల విచారముల్ హిమనగేంద్రునితో వినుపింతునింతయున్.

వ. అని నిశ్చయంబు చేసి. 214

మ. చెలులుం దానును గూడి వచ్చి కడఁకన్ శీతాచలాధీశ్వరున్
లలనారత్నము గాంచి మ్రొక్కి వినయాలాపంబులన్ శీతలా
చలుఁడున్ మన్ననచేసెఁ జేసెడితఱిన్ జంద్రాస్య హస్తాంబుజం
బులు ఫాలంబునఁ జేర్చి పల్కె వినయంబున్ భక్తియున్
రంజిలన్. 215

క. ఘనహారపుష్పచందన
కనకాంబరభూషణాదిఘనవైభవముల్
మనయింట నేమిగొఱఁతయుఁ
గనుఁగొనఁగా రాదు మిగులఁ గలవు గిరీంద్రా. 216

వ. అట్లయినను. 217

మ. శివదేవుం దలపోయఁ జొచ్చి నభవున్ జింతించు దేవేశ్వరున్
ధవళాంగుం ఫణిరాజకంకణధరున్ దర్శించుఁ గాంతించు
వైభవముం జేయదు నామనంబు దప మొప్పం జేసి నీపం
పునన్, భువనాధీశ్వరు గాంచి వత్తు ననుచున్ భూమీధరేం
ద్రోత్తమా. 218

ఆ. ఏమి చెప్ప నేర్తు నేనేమి సేయుదు
నావశంబుగాక నామనంబు

లోకనాథుఁ దవిలి లోఁబడిపాయదు
భ్రాంతిఁ దపము సేయఁ బనుపు మయ్య. 219

శా. అయ్యా సిద్ధము దాఁటరాదు మదిలో నాలింపుమీ యానతిన్
నెయ్యంబొప్పఁగ మీరు నన్ బనుపఁగా నే నిష్టమైయుంట
యొప్పరయ్యన్ వే ననుఁ బంపు మన్న విని యత్యానంద
చిత్తంబుతో, ధీయుక్తిం గిరిరాజు మన్ని తనయన్ దీవించి
కీర్తించుచున్. 220

మ. సతి నీవాక్యము వేదవాక్యము సుమీ చంద్రాస్య యాతండె
పో, గతియించున్ దననాథు నేడుగడయుంగాఁ జూచి
సేవింపఁగా, ధృతి మై నుత్తమకన్యయం ద్రుమృగనేత్రిం
గన్న యాతండ్రియున్, మతిలో సజ్జనమాన్యుఁ డంచు
జగముల్ మన్నించుఁ గాంతామణీ. 221

మ. త్రిదశారాధిత వై జగజ్జనని వై దేవేంద్రసంపూజ్య వై
మదనారాతికిఁ బ్రాణవల్లభవునై మాయాప్రపంచాత్మ వై
మది మోదించిన నీవు కూఁతురవు నై మన్నించి తీవెంపు చా
లదె పుణ్యాత్ముఁడ నైతి నీకరుణఁ గళ్యాణీ కృపాంభోనిధీ.

క. వనితా నావిన్నప మిది
వినుము మది న్నీకుఁ బోవ వేడుక పుట్టెన్
దనరఁగ నీవేడుక మై
నయమున వర్తించు మనుచు నగపతి పల్కెన్. 223

వ. ఇట్లు పలుకువల్లభుఁ జూచి యగ్గిరీంద్రవల్లభ యగు మేనకా
దేవి గౌరీదేవి కిట్లనియె. 224

క. ఏమియుఁ గొఱఁత దపోవన
భూములలోఁ దపము సేయఁ బోయెద ననుచు

న్వేమరు భాషించెదవో
భామా నిన్నడవి కెట్లు పంపుదుఁ జెపుమా. 225

క. వాలాయించి వనంబుల
నేలమ్మ తపంబు సేయ నిభకుంభకుచా
హాలాహాలభక్షుఁడు మన
లీలావనభూములందు లేఁడే చెపుమా. 226

క. లలనా వనభూములలో
మలహరు వెదుకంగ నేల మంజులవాణీ
వలచినచోటనె శంభుఁడు
గలుగుట సందేహ మమ్మ కంజాతముఖీ. 227

క. నీముద్దులు నీమాటలు
నీమధురాలాపములును నీమురిపంబుల్
రామా చూచిన పిమ్మట
నామది యెట్లుండ నేర్చు నలినదళాక్షీ. 228

సీ. గంగావతంసునిఁ గరము మజ్జన మార్ప
గంగాజలంబులు గలవు మనకు
ఘననాగకంకణుఁ గరములంకారింప
ఘనకంకణంబులు గలవు మనకు.
గంధేభదనుజారిఁ గలకంఠ నలఁదింప
గంధంబు లెన్నియోఁ గలవు మనకు
అలరుసాయకవైరి నలరించి పూజింప
నలరు లెన్నెన్నియో కలవు మనకు
ఆ. మఱియు నేమిరైన మలహరుఁ బూజింపఁ
గమలనేత్ర మనకుఁ గలిగియుండఁ

గానవముల కేఁగఁ గలకంఠి యేలమ్మ
వనము లేడ మృగ్ధవనిత లేడ. 229

వ. అనవుడు కుమారీతిలకంబు తల్లి కి ట్లనియె. 230

శా. తల్లీ శంభుఁడు లేనిచోటు గలదే తర్కింప సందేహమే
ముల్లోకంబులు శంభుఁ డంచుఁ జదువుల్ ప్రాయంగ నెవ్వా
రికిన్, చెల్లింపం దగదమ్మ యిండ్లఁ దపముల్ చిత్తంబు రెండై
ఫలం, బెల్లం జేరక పోవఁ గాక జననీ యున్న న్నిమార్గం
బులన్. 231

క. తా మరిగినచిత్తములోఁ
దామరుగుఁ జూమీ లతాంగి తద్దయుఁ బ్రీతిన్
తా మరుగనిచిత్తములో
తామరుగఁడు పాయుఁ గాని తామరసాక్షీ. 232

క. తనువలచినఁ దనువలచును
దనువలువక పాసియున్నఁ దనువలువఁ డిలన్
దనదు పటాటోపంబులు
తనమాయలు పనికి రావు తథ్యము తల్లీ. 233

క. చని కందమూలఫలములు
తిని వనటలఁ జాల డస్సి ధీరాత్మకులై
వనములఁ దపములు సలిపెడు
వనవాసులు వెట్టు లమ్మ వారిజనేత్రా. 234

క. ఆరయ నీలోకంబుల
మీఱెలుఁగనిపనులు గలవె మీకును దగవుల్
వారక చెప్పెదు దానని
యేరూపంబైన నుద్ధరింపుఁడు నన్నున్. 235

వ. అనుచున్న గౌరీదేవి పలుకులు విని గిరీంద్రశేఖరుండు మేనకాదేవియుం దానును సంతసిల్లి దేవి యింక మాటుమాటలు పలుక వెఱతుము భవదీయమనోరథంబులెల్ల నమోఘుంబులై ఫలించుఁగాక యని కీర్తించి దీవించి వనవాసప్రయాణంబునకుఁ దల్లిదండ్రు లనుమతించిన. 236

పార్వతి తపము సేయ వనమునకు నేగుట

సీ. హరినీలములఁబోని యలకలజడలల్లి
మహితరుద్రాక్షదామములు చుట్టి
బాలచందురుఁబోని ఫాలస్థలంబున
భస్మత్రిపుండ్రంబు పరఁగఁ దీర్చి
తరుణవల్లియుఁబోని తనువల్లి నిండారఁ
బద నిచ్చి పలుచనిభస్మ మలఁది
కాముచక్రముఁ బోలు కటిచక్రతలములఁ
దనరు కాషాయవస్త్రంబుఁ గట్టి
ఆ. బిసముఁబోలి కేల నెసగఁ గమండలు
దండపుండరీకతనుకళాస
ములు ధరించి భువనమోహన శ్రీయగు
గౌరి తపసివేషధారి యయ్యె. 237

వ. ఇట్లు వివిధవిలసితవిచిత్రతపోవేషధారిణియై తనసఖీజనంబులుం దానును తలిదండ్రులమనంబులు సంతసిల్ల వీడ్కొని వనవాసప్రయాణంబై పోయి కతిపయదూరంబున నకాలపల్లవఫలభరితశాఖాలోకవిరాజితమందార మాతులుంగ చందనపున్నాగతిలకకేసరకదళీజంబీరకదంబనింబ తమాల రసాలహింతాళప్రముఖనానాభూజాత సంఘాతవిలసితం

బును నిర్మలసరోవరజనితఫుల్లసల్లలితకమలప్రసూనబంధుర గంధవాహాధూత బలపరాగ ధూళీపటలదశదిశాలంకృతం బును ననంతలతాసితసంఫుల్లపరిమళమోదమారుత సమ్మిళిత దూరదేశంబును మరాళశారికాకీరమధుకరకోకిలాది నానా విహంగమృదుమధుర వచనప్రమోదితంబును నై సకలతపో వనరాజ్యలక్ష్మీశోభితవైభవం బనంబొల్చు నొక్కవనంబుఁ గాంచి సంతసించి దరియం జొచ్చి సంభ్రమంబున. 238

ఉ. ఈ వనధారుణీరుహము లెంతయు వింతఁ దనర్చి యుండు నే
యీవనపుష్పవల్లికల కింత సుగంధవిభూతి యొప్పునే
యీవనజాంతరాన్వితము నేమని చెప్పఁగ వచ్చు బాపురే
యీవనశోభితంబు దివి నింద్రువనంబున కైనఁ గల్గునే. 239

క. అంగజుఁ డివ్వనమునఁ గల
భృంగంబులఁ గూడుకొనిన బిరుదై కడిమిం
భంగించుఁ గాక మదమరి
గంగాధరుకంటిమంటఁ గ్రాఁగునె తలఁపన్. 240

ఆ. ఈ వనంబులోని యేపారుపుష్పంబు
లేయ మఱచెఁ గాక యేసె నేని
కాముచేత నాఁడు కామారి చిక్కఁడే
సకలమైనవారు సంతసిల్ల. 241

వ. అని మఱియు ననేకప్రకారంబుల నవ్వనలక్ష్మిఁ గీర్తించి చెలుల నందఱి నాలోకించి వారి వారిం దగులాగున వర్తింప నియోగించి స్థలశోధనంబు లాచరించి సర్వాంగవిభూతి స్నాతరై చెలువు మిగుల తపంబుసేయం దొడంగె నిరుపమ నిర్మలత్వంబున. 242

ఆ. బాలచంద్రమౌళి పాదాంబుజంబులు
విమలహృదయకమలవీథి నిల్పి
నీరజాతనేత్ర నిష్కళంకాత్మ యై
చెలువు మిగిలి తపము సేయఁ దొడఁగె. 243

క. నాలుగుదిక్కుల మంటలు
గ్రాలఁగ వినువీథినున్న గ్రహపతి కెదురై
ఆలమయి నిలిచి వేసవి
కాలము తప మాచరించెఁ గన్నియ ప్రీతిన్. 244

క. పిడుగులు మెఱుపులు నురుములు
నడరఁగ మేఘములు జలము లనిశము గురియ
న్నడుఁదొడఁగి వానకాలము
తడియుచుఁ బెనుబయలఁ జేసె దారుణతపమున్. 245

క. నీట మెడమునుఁగుబంటిని
జాటరితల మంచుగురియఁ జలికాలము మి
న్నేటిదరిఁ దలఁచు వెచ్చని
చోటను సుఖమున్న భంగి సుందరి గడఁకన్. 246

క. ఇది పగలని యిది రే యని
యిది చలి యిది యెండ వాన యిదియని సతి దా
మదిఁ దలపోయక యాక్రియఁ
బదపడి కాలంబు సలిపె పరమతపంబున్. 247

వ. అంతఁ దదీయదివ్యతపోమహాత్త్వంబు లన్నియు నవలంబించి
ఆవరణఘోరం బై. 248

శా. లంఘించెం గమలోద్భవుండు మదిఁ దా లక్షించి తద్దేవతా
సంఘం బెల్లఁ గలంగ మేలుకొనియెం జక్రాయుధుం డంత వే

గంభీరంకారము లిచ్చి దిగ్గజములుం గైలాసశైలంబు దు
ర్లంఘ్యం బై నగణాలితోఁ గదలి దొర్లం బాతె నల్లాడుచున్.

ఆ. ఆకైలాసముమీఁదను
శ్రీకరముగ నున్న యట్టి శ్రీకంఠుఁడు డా
సాకతముఁ దెలిసి తనలోఁ
బ్రాకటముగ నుబ్బి చెలఁగెఁ బరిణామముతోన్. 250

సీ. తపము సేయక కాని తన్ను వరింపనే
శృంగారి తపము సేయంగ నేల
తనుఁ గవయఁగఁ గోరి తపము సేయుచునున్న
ననుఁ గూర్చి యీనిష్ఠ తనకు నేల
తన్నుఁ బాయనిప్రేమఁ దలపోసి యలరంగఁ
దపమున డయ్యంగఁ దనకు నేల
యేనొక్కవింతయే యేనొక్క బ్రాఁతియే
యిందీవరాక్షికి నింత యేల

ఆ. అని శశాంకజూటుఁ డానందచిత్తుఁడై
కరుణతోయరాశి కరము మెఱయ
చిన్ననగవు లేఁతచెక్కులఁ దొలఁకాడ
నీశ్వరుండు పార్వతీశ్వరుండు. 251

—— శంకరుండు బ్రహ్మచారియై వనమునకు వచ్చుట ——

ఉ. గ్రక్కునభూతియు న్నొసలి కన్నును బెబ్బులితోలుచీరయుం
జుక్కలరేనిజూటమును జొక్కపుగంగయు మేనఁ బాము
లుం, జిక్కనిసూలలాతములచేతులు రెండును బ్రుత్తెకుండ
దాఁ, జక్కఁగ దాఁచి వచ్చె నెఱజాణుఁడు శంభుఁడు సంభ్ర
మంబునన్. 252

సీ. తనర ముమ్మాఱు చుట్టినదర్భమౌంజితోఁ
గ్రొమ్మెఱుంగువలంతి గోఁచితోడ
మొలనున్న ధవళంపుముద్దుపేలికతోడ
నిమ్మైన కృష్ణాజినమ్ముతోడ
వలపలఁ బెట్టిన వెలిజన్నిదముతోడ
రమ్యభస్మత్రిపుండ్రములతోడ
నక్షమాలికతోడ నాచిన్ని కూకటి
జుట్టుతో మేధావిబొట్టుతోడ
ఆ. నెడమ కేలఁ దనదు పొడవుదండము వ్రేల
నుంగరమును దర్భయును వెలుంగ
గొడుగుపట్టి వటువుకుఱ్ఱఁడై చనియెను
శూలి మంచుకొండచూలికడకు. 253

ఆ. అట్లు పోవునప్పు డమ్మహాతేజంబు
వేడ్కతోడ నెట్టివిధము నైన
పాయ దమృతకోటి భానుబింబంబుల
ప్రభలగ్రేణిసేయు భరిత మగుచు. 254

వ. అంత నయ్యవసరంబున. 255

చ. సదమలమైన వాఁడు కడుచక్కనిరూపము వాఁడు కాంతిచేఁ
బొదలినమోము వాఁడు మెయి భూతినలందినవాఁడుదివ్యమై
యొదవిన బ్రహ్మచారిగతినొప్పిన వాఁడిటు వచ్చుచున్న వాఁ
డదె యొక గుజ్జుతాపసుఁ డహా వనితామణులార కంటిరే.

వ. అని యివ్విధంబున. 257

మత్తకోకిల.—

కాంత లవ్వలనం గనుంగొని కట్టుకూఁతురినచ్చెలుల్
వింతలీలల నవ్వనంబున నే చరించుట మాని యు
న్నంత నూతనయౌవనాంచిత యద్రికన్నియ చేరఁగా
నంతనంబునఁ బోయి రయ్యెడ జగ్గున న్వటువేషితోన్. 258

ఉ. అల్లనఁ జేర వచ్చి నతు లర్చన చేసెద మన్న నన్నియుం
జెల్లును చాలుచాలు నని చేతుల సన్నలు చేసి నిక్కమే
నల్లలితంపుఁదాపసునిచాడ్పున నిల్చి శివుండు లోల సం
ఫుల్లసరోజనేత్రి యగుపాల్తుక నంబికఁ జూచి యిట్లనున్.

ఉ. నీతలిదండ్రు లెవ్వరొకొ నీరజలోచన యెవ్వ రీవు నీ
వీ తప మేల చేసెద వదెవ్వఁడొకో నిను నేలువాఁడు దా
నో తరుణీలలామ భువనోన్నతమోహనమూర్తి రాజ సం
కేతము మాని యీయడవి కేఁగి తపం బిటు సేయ నేటికిన్.

వ. అనిన నమ్మాయావటునకు నబలచెలు లి ట్లనిరి. 261

మత్తకోకిల.—

తల్లి మేనక పుణ్యకామిని తండ్రి కొండలరాజు యీ
మొల్లగంధికి గౌరినామము మూఁడుకన్నులదేవరకు
వల్లభుం డని కోరి సేయును వారిజాక్షి తపంబు మే
మెల్ల దాసుల మై చరించెద మింతికిన్ మునివల్లభా. 262

వ. అనవుడు నక్కపటతాపసుం డి ట్లనియె. 263

ఉ. ఈనగుమోము లేములక లీ తెలిగన్నులు నీసుధాధరం
బీనును మేనికాంతియును నీచనుకట్టును నీకరాంబుజం
బీనడు మీనితంబమును నీతొడ లీపదపల్లవంబు లే
మానినియందుఁ గానము సమగ్రమనోహరరూపసుందరన్. 264

ఉ. *ఈపువ్వుఁబోఁడి నీడుగువ నీతరలాయతచారులోచనన్
దాపసి జేసి శోష్మనుచు ధైర్యము నిల్పి వనాంతరంబునన్
చాపలనేత్రలార సతిజవ్వన మూరడి బుచ్చి కెల్ల రే
తాపసవృత్తి నుంచు నల దైవము నేమన నేర్తు నక్కటా. 265

వ. అదియునుం గాక. 266

సీ. పొలుచు మైఁ దీగెతోఁ బోల్పు టింతియకాక
యీవన్నెగలరేఖ యెందుఁ గలదు
యింతిపాలిండ్లతో నీడుసేయుటగాక
యీచక్కనైనబాగెందుఁ గలదు
పూఁబోఁడిమోముతోఁ బురుడుసేయుటగాక
యీ నిర్మలపుఁగాంతి యెందుఁ గలదు
సతికనుదోయితో సాటిసేయుట కాక
యీమోహరుచిజాల మెందుఁ గలదు

ఆ. కలిగెనేని తెగనికాముబాణములందుఁ
గందులేని యిందు నందుఁ బసిఁడిఁ
గరిశిరంబు లంచచిరముండు మెఱుపుల
యందుఁ గాక తక్క నెందుఁ గలదె 267

ఉ. చూచితి నాగకన్నియలఁ జూచితి దానవదైత్యకన్యలన్
జూచితి దేవకన్నియలఁ జూచితి ఖేచరసిద్ధకన్యలన్
జూచితి మర్త్యకన్నియలఁ జూచితి సాధ్యమునీంద్రకన్యలన్
జూచితిఁగాని యేయెడలఁ జూడ గిరీంద్రజఁ బోలుకన్యకన్.

వ. అని పలికి గౌరీదేవి నుపలక్షించి యల్లనల్లన యి ట్లనిరి. 269

* రూపవివేకభోగములు రాధికి చెక్కిన మోహనాంగి కు
ద్దీపితసత్య భాషిణి సుధీకరసౌఖ్యముఁ బొంద నీకనో,

ఉ. కొండలరాజుగారవపుఁగూఁతురవై నవయౌవనాంగివై
నిండినలక్ష్మితోఁ జెలులు నిచ్చలు గొల్వఁగఁ గేళిమై సుఖం
బుండుట మాని సౌఖ్యముల నొల్లనిజంగముఁవానిఁగోరి యీ
కొండకు వత్తురే వనఁటఁ గుందుదురే యిచటం దలోదరీ.

చ. అదియునుగాక యీజగము లన్నియుఁ జూచితిఁ గాని యొ
య్యెదన్, బదపడి సాధులన్ వెదక బాలలు వోయినచోటు
లేదు లే,దిదివిను వద్దు శంభుఁ డన నెంతటివాఁడు యతండు
వల్కలం,బొదలు కెలకులందుఁ బలుభూతములందు వసించు
బాలికా. 271

ఉ. ఎక్కడ భర్గుఁడుంట యిట నెక్కడ నీతప ముంట కన్యకా
చుక్కలరాజమౌళిఁ దొలి చూచినదానవొ కాక యూరకే
యొక్కడ నాతనిన్ వలచి యేఁగినభామలఁ గానఁ జెల్లరే
నిక్కము చెప్పితిన్ మగువ నేరుపుఁదప్పితి వీవు జాణవే.

సీ. తరళాక్షి యాతండు ధనవంతుఁ డందమా
కోరివేడినగానిఁ కూడు లేదు
చిన్నారి వయసున చిన్నివాఁ డందమా
యున్నటివాఁడొకో యొఱుఁగరాదు
ఆకారసంపద నతిమేటి యందమా
యాకార మెట్టిదో యరయరాదు
కులగోత్రములు రెండుఁ దెలియుద మందమా
తలిదండ్రు లెవ్వరు ధరణిలేరు

ఆ. తిరిప రొంటిగాఁడు దేవుండు చూడఁడే
మాయమందు కపటమంత్రములను

మగువ నిన్ను నెట్లు మరగించుకొన్నాఁడో
కాని తగినవాఁడు కాఁడు కాఁడు. 273

వ. అని మఱియు నిట్లనియె. 274

క. అంటినఁ గందెడుయొడ లీ
వెంటకా గుడియింప వలదు విను మాతని నీ
వంచెద నసి తలఁచెద వతఁ
డంటఁడు నిను సర్వభంగులందుఁ గుమారీ, 275

మత్తకోకిల.—
శిలకాంగి యెఱుంగ వాతఁడు నొక్కజాలరికన్యకన్
లోలుఁడై జడ లిచ్చినాఁడఁట లోక మెల్ల యెఱుంగ నీ
వేల చింతన సేయ వక్కట యాతఁ డొక్కఁడె కాని నీ
లాలకా కన లేరె దేశమునందులోన మగల్మఱిన్. 276

సీ. చీనాంబరంబులు చెలువొప్పఁ గట్టఁడు
మదసింధురేంద్రచర్మంబుఁ గాని
రత్నకంకణములు రమణమైఁ దొడగఁడు
ఫణిలోకరాజకంకణము గాని
చందనగంధంబు జాణఁడై పూయఁడు
మదపంచబాణభస్మంబుఁ గాని
పువ్వులు దండలు భోగియై తురుముఁడు
వెలయింత లేని రేవెలుఁగు గాని

ఆ. యూరనుండ నొల్లఁ డొలుకులలోఁ గాని
యెనసి హయమునెక్కఁ డెద్దుగాని
చెలువ యేమిచెప్ప సిగ్గయ్యెడిని వెఱ్ఱి
యనఁగ నెపుడు శివుని వినవె చెపుదు 277

మత్తకోకిల.—
కంతుఁ జంపినవాఁడు వెండియు కంతు కెయ్యెడ లోఁబడం
డింత సిద్ధము గాదు మొల్లఁడు యేల యీ యడియాస నీ
వంత కంతకు నిష్ఠ మై నవయంగ నేల మహాటవిఁ
సంతసంబునఁ గొంచుఁ బోయెదఁ జక్క రమ్ము కుమారికా.

చ. ఇరవుగ సర్వలోకముల నేలెడువాఁడ మహేంద్రనిర్జరే
శ్వరతతిలోనఁ బేరు గలవాఁడ జగంబులఁ బెద్దవాఁడ ఖే
చరగతి నొప్పువాఁడ సహచారిణిదుఃఖము లేనివాఁడ శ్రీ
వరునకు బ్రహ్మకు న్మొదలివాఁడఁ జుమీ యళినీలకుంతలా.

ఆ. ముదిమిలేనివాఁడ మోహనాకారుఁడఁ
దరుణి నిన్ను నేలఁ దగినవాఁడ
నన్నుఁ దగిలి నీవు నావెంటఁ జనుదెమ్ము
వనటఁ గుందనేల వనజనేత్ర. 280

క. అనుడు వినఁదగనిమాటలు
గొనకొని వీఁ డాడెనేని కూకటి వేగం
బునఁ బట్టి వనము వెడలఁగ
ననుపుం డని చెలుల కంత యానతి యిచ్చెన్. 281

క. అని పలికిన చెలు లందఱు
తనుఁ బట్టెద రని తలంచి తత్తరపడఁగాఁ
గనుఁగొని దండముఁ ద్రిప్పుచు
వనితలతో బ్రహ్మచారి వటుఁ డిట్లనియెన్. 282

శా. నన్నుం బట్టెడువారె మీ రవశ మె యన్యాయంబుగా నిప్పు
డుం, నన్నుం జిన్నగఁ జూడవద్దు వినుఁ డానారాయణ
బ్రహ్మలుం, నన్నుం బట్టఁగలేరు చిక్కఁబడునే నాకోటి

మీచేత మీ, నన్నుం బైనతలంపు వోవిడువుఁడో చంద్రాస్య
లిం కిట్యాడన్. 283

ఉ. ఇచ్చెఁ గులంబు గోత్రమును నించుక లేనిలతాంగికిన్ శిరం
బిచ్చి వరించినాఁడ నిపు డిట్టిద నీయువతీలలామ నా
కిచ్చినఁ జాలుఁ గాని సతి కిప్పుడ మీరలు చూడ దేహ మే
నిచ్చెదఁ గాంతలార వరియింపఁగఁ గన్యకు బుద్ధిసెప్పరే. 284

ఉ. మాటలు వేయు నేమిటికి మానినులార వినుండు చెప్పెదన్
పాటలగంధి నాకుఁ దగు భామిని కేఁ దగుదున్ వరింప ని
చ్చోటనె పెండ్లియాడెదను సుందరి యేరతి నాస సేయునో
వాటము గాఁగ నారతుల వారక తేల్చెద నంచుఁ బల్కఁగన్.

వ. విని యమ్మహాదేవి యి ట్లనియె. 286

ఉ. వీఁడఁట బ్రహ్మచారి యఁట వీనుల బెట్టఁగరాని మాటలే
యాడుచు నున్నవాఁడు మదసాంధుఁడు వీఁడు నమశ్శివాయ
యొం, డాడఁగ వద్దు వీనిఁ గపటాత్ముని నిచ్చట నుండ నీక పం
ట్లూడఁగ వేసి ద్రొబ్బుఁ డని యాగ్రతఁ బల్కినఁ గాంత
లందఱున్. 287

సీ. దండంబు విసరినఁ దప్పించుకొని పోయి
పొలఁతులు కొందఱు పొదివి పట్టి
బాహాదండంబునఁ బట్టినగోడుగును
బలిమిమై నల్లంతఁ బాఱవైచి
కరము బిగ్గనఁ బట్టి కట్టిన యొల్లియ
నొడిసి వ్రాలినఁ గోఁచి విడిచిపుచ్చి
మూకటిఁ బలుమాఱుఁ గుదియించి కుదియించి
చేడియల్ నవ్వుచు శిరము వంపఁ

ఆ. చిన్నవాఁడుపోలె చెనఁగులాడుచునుండి
బాలుఁడైనకపటబ్రహ్మచారి
మాయమయ్యె *నపుడు మగువకు ముందట
మహితమైన చిత్రమహిమతోడ. 288

శంకరుఁడు ప్రత్యక్షం బగుట

క. వనములు కొలఁకులు గిరులును
వినువీథియు ధరయు నొక్క వెలుఁగై వెలుఁగన్
మునుమిడి పుష్పములవానలు
గొనకొని కురియంగ సురలు కోర్కులఁ దేలన్. 289

సీ. పై నొప్పఁబెట్టిన భద్రదంతావళి
తోలుతో మొలపులితోలుతోడ
కమనీయమైనట్టి కంబుకంఠముతోడఁ
బొలుపారు నెఱపూత భూతితోడ
ఘనతరం బగునాగకంకణంబులతోడఁ
దనరారు శూలాయుధంబుతోడఁ
బటుజటావలిలోని బాలచంద్రునితోడ
దయతోడ నభయహస్తంబుతోడ
ఆ. లీల నందినెక్కి లేనవ్వు దొలుకాడఁ
బడఁతి కభవు మీఁదఁ బల్లవించి
భక్తబాంధవుండు భవుఁడు ప్రత్యక్షమై
శైలరాజపుత్రి మ్రోల నిలచె. 290

క. నిలచినఁ గనుఁగొని భయమునఁ
జెలులందఱు నన్నిదిశలఁ జేరిరి వేగం

* దాఁచె మగువకు ముందటఁ.

దలపోయ వడుగు శివుఁడై
వెలుఁగుటకును జాలబెగడి విస్మయమతు లై. 291

వ. అసమయంబున. 292

మత్తకోకిల.—
దేవి దేవరఁ జూచె దేవర దేవిఁ జూచెను నంతలో
భావజన్ముఁడు దోఁచి యేసెను భావబంధము లొందఁగా
దేవమైఁ దొలి ఫాలలోచను నేయఁ జంకిన పుష్పబా
ణావళుల్ జత గూర్చి భర్గుని నవ్వు చేసెఁ జెలంగుచున్.

క. తనువలచు శివుఁడు ముందటఁ
దనకుం బ్రత్యక్షమైనఁ దద్దయు వేడ్కన్
దనుమధ్య చూచుచుండెను
తనువునఁ బులకాంకురములు దళుకొత్తంగన్. 294

చ. చుఱుకులు దట్టముల్ మెఱపుచుక్కలు తీరగుచెక్కు లుగ్ర
ముల్, మెఱుఁగులు కాముబాణములు మించులతీవెలు చంచ
లావళుల్, కఱకులు మోహబంధములు కాముశరంబుల
పుట్టినిళ్లు కిన్నెరలు వెడంద లందములు నీరజలోచన
చూపుచందముల్. 295

ఉ. కామినిచూచుచూపులకుఁ గాక కలంగి శివుండు పాంథుఁడై
కామునిఁ దొల్లి గెల్చినమగంటిమి యొల్లఁ దలంక లోలతన్
గామినిఁ జూచుచుండె మఱి కామినియున్ మదనాస్త్రపాత్రయై
కామవిరోధిచూపులకుఁ గాక తలంకె మనగికళంక యై. 296

వ. మఱియును. 297

మత్తకోకిల.—

చూచుఁ జింతన సేఁకు నోరగఁ జూచుఁ వన్నెస సేయఁగా
జూచుచుం దమకించు సిగ్గునఁ జొక్కుఁ బ్రార్థనసేయఁగాఁ
జూచు నంతనడయ్యెఁద న్నతిచుఁ ముందఁబున వెండియుఁ
జూచుఁ జేష్టలు లేక యంబిక సోమశేఖరు నీశ్వరున్. 298

వ. ఇవ్విధంబున. 299

ఉ. ఒండొరు సుందరాంబువులనోలిమునింగియుఁ దేలితెప్పలై
యొండొరుఁబాయలే కునికి నున్నదులై నిజబోధ వీథి నొం
డొండన దెప్పలై గుణగణోన్నతి కూటమిఁ జేర్చి శంభుఁడా
కొండలరాజుకూఁతునకుఁ గూరిమి నిట్లనియెఁ బ్రసన్నుఁడై.

శా. ఓ వామేక్షణ యోకురంగనయనా యోకాంత నీయిష్టమై
నీవా నన్నును నేలుకొంటివి సతీ నీవాఁడ నేనైతి ని
చ్చో వ ద్దింకను నంది నెక్కి గడఁకన్ శోభిల్లగాఁ బ్రీతితో
రావే పోదము వెండికొండకు మనోరాగంబుతోఁ గన్యకా.

చ. అనవుఁడు సంతసిల్లి తరలాయతలోచనబోంట్లు నేర్పుతో
వినయము లొప్ప మ్రొక్కుఁగను విశ్వవిభుఁడు కృపాకటా
క్షుఁడై, కనుఁగొని యుంటఁ జూచి కరకంజము లంజలి చేసి
దైవమా,తనరినవిన్నపంబు లవధారు ప్రసన్నత సాదరింపవే.

ఉ. వేదపురాణశాస్త్రములు వినుతి నిన్నును జేయ లేవు బ్ర
హ్మాదులుఁ గానలేరు సనకాదులుఁ గానఁగలేరు నిర్జరేం
ద్రాదులుఁ గానలేరు ధనదాదులుఁ గానఁగలేరు లక్ష్మీసా
థాదులకైన నీదుమహిమాతిశయంబుఁ దలంప శక్యమే.

చ. ఇతరులు నీమహామహిమ యింతనిచెప్పఁగ నెంతవారు మా
నితతర మైననీమహిమ నీవె యెఱుంగుదు వట్టి నీవు మా

సతికి దయాపరుండవుసు సన్నిధి వైతి వి దేమి పుణ్యమో
సతతము శైలవల్లభుఁడు సల్పిననిష్ఠ ఫలించె శంకరా. 304

క. జయజయ కరుణాంభోనిధి
జయజయ దేవాదిదేవ జయచంద్రధరా
జయజయ భక్తమనోహర
జయజయ శ్రీనీలకంఠ జయపురవైరీ. 305

క. పన్నగకంకణ నీకయి
చెన్నుగ ధరణీధ్రవిభుఁడు చేసిన తపముల్
సన్నుతిఁ *దలఁపఁగ వలదే
మన్నింతురు గాక యేలి మన్ననతనిన్. 306

మత్తకోకిల —

పంకజాననఁ బుట్టినింటికిఁ బంపి యిూక్రపఁ జూచి మా
వంక మేలు దలంచుచున్ హిమవంతునింటికి మీర లే
ణాంక శేఖర కొందఱన్ విమలాత్ములన్ గమలాక్షులై
యుంకు వీదగువారిఁ బంపుట యొప్పునయ్య మహేశ్వరా.

వ. అనిన విని యప్పరమేశ్వరుఁడు చెలులవిన్నపం బవధరించి
శైలకన్యకాతిలకంబు నవలోకించి యిట్లనియె. 308

క. మీతండ్రి యున్నచోటికిఁ
బ్రీతిగ నిన్నడుగఁ దగినపెద్దల వేగం
బాతతగతిఁ బుత్తెంతుఁ జూ
మీ తలపోయవల దింక మీననిభాక్షీ. 309

ఆ. నిన్నుఁ బాసి నిలువనేర్తునే నేర్చిన
తలఁపు లెట్లు నిలుచుఁ దరలనయన

---

*ఫలింప.

తలఁపు నిలచెనేని తనుమధ్య యొంటిమై
ప్రాణ మెట్లు నిల్పుఁ బంకజాక్షి. 310

వ అని మఱియు తగినలాగున నమ్మహాదేవిని మన్నించి రజత
ధరణీధరంబునకు నీశ్వరుండు వేంచేసె ననంతరంబ యక్కాం
తాతిలకంబగు గౌరీదేవియుఁ దన్ను మహేశ్వరుండు మన్నిం
చినమన్ననలకు నత్యంత ప్రమోదంబు నొంది తనసఖీజనం
బులుం దానును దపోవనవాసంబు చాలించి తుహినాచల
శిఖరంబుఁ బ్రయాణంబు చేసె నని చెప్పి. 311

## ఆశ్వాసాంతము

ఉ. రాజితరాజరాజదినరాజభుజంగమరాజభారతీ
రాజనిలింపరాజముని రాజపయోనిధిరాజరాజగో
రాజవిహంగరాజయమరాజసరోజనివాసవాసినీ
రాజసురాధిరాజగిరిరాజనిరంతరవంద్య శంకరా. 312

క. మదసామజాజినాంబర
యుదయార్కసహస్రకోటిసూజ్జ్వలతేజా
మదనోన్మదహరలోచన
సదమలయోగీంద్రహృదయ శరనిధిచంద్రా. 313

మాలినీ —

ధవళవృషభవాహా తారశైలేంద్రగేహా
భవహరణగరిష్ఠాపద్మజాండప్రతిష్ఠా
దివిజరిపువిదారా దేవదైత్యాస్థిహారా
దివిజవినుతమూర్తీ దేవతాచక్రవర్తీ. 314

గద్య. ఇతి శ్రీ మన్మహామహేశ్వరయిఱువటూరి సోమనారాధ్య దివ్య శ్రీపాద పద్మారాధక కేసనామాత్యపుత్త్ర పోతయనామధేయ ప్రణీతం బైన శ్రీవీరభద్రవిజయం బనుమహాపురాణకథయందుఁ దారకాసురసంగ్రామంబును దేవతాపరాజయంబును దేవేంద్ర బ్రహ్మసంవాదంబును అమరులయమరావతీప్రవేశంబును మరుండు సురనగరంబునకుఁ బ్రయాణంబు సేయుటయు మన్మథపురందరసంవాదంబును మదనరతీసంవాదంబును చిత్తజుండు పరమేశ్వరునిపై దండెత్తిపోవుటయుఁ గాముదహనంబును రతీవిలాపంబును గపటద్విజవృత్తాంతంబును గౌరీదేవి తపంబు సేయుచుండ శివుండు బ్రహ్మచారివేషంబున వచ్చుటయుఁ బార్వతీదేవి తపఃప్రయాసంబునకు నీశ్వరుండు మెచ్చి ప్రత్యక్షం బగుటయు నన్నది ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# వీ ర భ ద్ర వి జ య ము

## తృ తీ యా శ్వా స ము



క. గౌరీఘనస్తన
భాగాంకితగంధసారభాసురవక్షో
భాగ నిశానాథజటా
భాగా లోకాధినాథ పార్వతినాథా. 1

వ. పరమజ్ఞానభావుం డగువాయుదేవుం డమ్మహామునుల కి
ట్లనియె నవ్విధంబునఁ దనకుఁ బరమేశ్వరుండు ప్రత్యక్షం
బై యాదరించిన నోషధిప్రస్థానపురంబున కరుగుదెంచి సుందరీ
జనంబులుం దానును వినయవినత లై నిలిచినఁ బార్వతీదేవిని
గనుంగొని ధరాధరేంద్రుండు నిజసుందరీసహితుం డై సవిన
యంబునఁ గౌగిలించుకొని దీవించి యమ్మహాదేవిచిహ్నంబు
లవలోకించి యి ట్లనియె. 2

హిమవంతుఁడు పార్వతిఁ జూచి పలుకుట

మ. లలనా నీముఖపద్మ మెంతయు మహాలంకార మై కాంతి ని
ర్మల మై యున్నది నేడు నీనయనము ల్సంఫుల్లనీలోత్పలం

బలసత్కాంతికి నీడు దోఁచినవి నీబోట్లింవలుగా నొంపు మై
గలుగం బొంగినవార లేమి చెప్పుమా కాంతామణీ ధీమణీ.

మ. ఉవిదా నీతప మీశ్వరుం డెఱిఁగిన ట్లొప్పారెనే మించెనే
భవదూరుండును సన్నిధైఁ నిలచెనే పాటించి మన్నించెనే
శివుఁటం గన్నియ సన్నిధి న్నిలచెనే తెల్లంబుగా నొండొరుల్
తపులన్నిల్చితిరే యభీష్టములు సంధానంబులై యుండునే. 4

వ. అని పలుమాఱుఁ గుమారిని గీర్తించుచు దేవీ నీకు పర
మేశ్వరుండు ప్రత్యక్షమైన తెఱంగు తేటపడ వినం
గుతూహలం బై యున్నది వినిపింపు మని యడిగినఁ దుహి
నాచలేంద్రునకుఁ బార్వతీదేవి చెలు లగుజయవిజయ లి
ట్లనిరి. 5

—పార్వతిచెలులు హిమవంతునకు జరిగినవృత్తాంతంబు చెప్పుట—

చ. వినుము గిరీంద్ర నీతనయ వేగ తపోవనభూమిలోనికిం
జని విమలాత్మ యై తగిలి సంతతముం హృదయంబులోన శం
భునిపదపూజనల్ సలిపి భూరివిచిత్రతపంబు చేసె నీ
వనజదళాక్షి మంచుకును వానకు నెండకు నోర్చి ధీనతన్. 6

వ. ఇవ్విధంబున నశ్రాంతంబును నత్యంతఘోరంబునునగు తపంబు
సేయుచుండ నొక్కనాఁడు గిరీంద్రా నీ కేమి చెప్ప నప్పర
మేశ్వరుండు లీలావినోదంబున బాలుం డై వటువేషంబు
దాల్చికొని యేము చరించుచున్న వనంబునకుఁ జనుదెంచి
మమ్ము డగ్గరి యీబాల యెవ్వరిబాల యని యడిగిన
నేమును సముచితభాషణంబుల మునీంద్రా యీకన్య హిమ
వన్నగేంద్రునికన్నియ యని పలికిన నతండును మాతో
మఱియు ని ట్లనియె. 7

క. ముదితలు విహారండలు స
మ్మదమున సేవింప రాజమందిరములలోఁ
గదలక వర్తింపఁగ నతి
యుండి యేలా సేయఁ దొడఁగె నీతప మనిశమున్. 8

క. అనిపలుక నంత నెఱుఁగక
మునినాయకుఁ డొక్కఁడనుచు ముక్కంటిశివు
న్వనజాక్షి కోరి చేసెడి
ఘనతప మని పలుకుటయును గాంతామణియున్. 9

వ. నగేంద్రా యావటుకకుమారుఁ డైనశివుండు దాని కిట్లనియె.

సీ. చెల్లరే యీజాడ శివుఁడు నీపాటియే
దేశంబు దిరిగెడు తిరిపెకాఁడె
ఆహారవాంఛమై నడుగ నింటింటికి
నొరిది భిక్షముఁ దెచ్చు జోగిగాఁడె
ఎక్క గుఱ్ఱములేక యెద్దు నెక్కుచునుండు
తోలుత నెంతయు దరిద్రుండుగాఁడె
కట్టఁ జీరెలు లేక ఘనగజచర్మంబు
గట్టిన పెద్దజంగంబు గాఁడె

ఆ. ఒంటిగాఁడు గాఁడె యొలుకులలో భూత
తతియుఁ దాను నుఁడు తపసిగాఁడె
యేల కోరెదతని నెత్తి కొంపోయెద
నన్నుఁ దగిలి రమ్ము నలిననేత్ర. 11

వ. అని మఱియు నతండు తననిజగుణంబులు చెప్పుటయును
పార్వతీదేవికి సందేహంబులై తోఁచిన నక్కపటతాపసుం
జూచి వీని వనంబువెడలఁ ద్రోయుం డని పంచిన నేమునుం

గడచి పెనంగెడుసమయంబున నంతర్హితుం డై ప్రసన్న
త్వంబు నొంది యీశ్వరుండు నిజదివ్యాకారశోభితుం డై
నిలిచితరుణియుం దానును కైలాసంబునకుం బోవ గమకించిన
భవదీయభక్తివశంబున మావిన్నపంబవధరించినవాఁడై గౌరీ
దేవి నుపలాలించి నిజమందిరంబునకుం దానేచనిరి మేమును
జనుదెంచితిమి కతిపయదివసంబులలోపల మనయింటికి నీ
కుమారీతిలకంబు నడుగ దగువారలం బుత్తేరంగలవాఁడని
యేర్పడఁ జెప్పిన. 12

క. త్రిభువనపతికిని శివునకు
నభినవకీర్తులను మామ నయ్యెద ననుచున్
విభవంబున సంతతమును
రభసంబున శైలవిభుఁడు రంజిలుచుండెన్. 13

క. తనుమధ్యనిమిత్తంబున
ఘనకీర్తులు గలిగె ననుచు గౌరీకాంతన్
తనుఁ జేర దిగిచి గారవ
మున నలకలు దువ్వి శిరము మూర్కొని ప్రీతిన్. 14

తరల.—

వనజలోచనతోడ నాహిమవంతు డిట్లనె బాలికా
యనిమిషుల్ నుతియింపఁ గంటి ననంతరాజ్యముఁ గంటి శం
భునికి మామ హిమాచలుం డనుపుణ్యకీర్తులు గంటి నా
తనయ వై నను గారవించినదానఁ జేసి తలోదరీ. 15

క. అని పలుమాఱును బొగడుచు
వినయంబున సతియుఁ దాను విమలేందుముఖిన్

జననియని సేవ సేయుచు
ననురాగముఁ బొందె శీతలాచలపతియున్. 16

## శంకరుఁడు సప్తమహర్షులను బిలుచుట

మత్తకోకిల —

వాసుకీకరకంకణుం డగు వామదేవుఁడు గౌరిఁ గై
లాసశైలమునీఁద నుండి తలంచి యాచలికొండకుఁ
భాసురంబుగఁ బోయి యుంకువ బాలకిచ్చి నిజంబుగాఁ
జేసి రాఁగలవార లెవ్వరు శిష్టనైపుణమానసుల్. 17

క. బలము గలవారు నిపుణత
గలవారును బుద్ధినీతి గలవారును ని
ర్మలత గలవారు సంపద
గలవారు వివాహతతికిఁ గావలయు ధరన్. 18

వ. అంత నక్కడ మహేశ్వరుండు మునీంద్రులారా దేవ
కార్యంబుఁ దీర్ప నెల్లరు నిచ్చోటికి విచ్చేయుదురుగాక. 19

క. అని సప్తర్షులఁ దలఁచినఁ
జనుదెంచిరి తలపులోనఁ జయ్యన వారుం
జనుదెంచి నిలిచి నిజకర
వనజంబులు మోగిచి మ్రొక్కి పలనొప్పారన్. 20

వ. ఇట్లు స్తుతియింపఁ దొడంగిరి. 21

క. శంకర పాపభయంకర
కంకాళకపాలహస్త గంగాధిపతీ
ఓంకార మంత్రమందిర
కంకణభుజగాధినాథ కారుణ్యనిధీ. 22

సీ. శరణార్థి కలధౌతశైలేంద్రమందిర
శరణార్థి దినసాథచంద్రనయన
శరణార్థి పరమేశ సర్వజ్ఞ శేఖర
శరణార్థి గణనాథచక్రవర్తి
శరణార్థి దేవేంద్ర సంతతార్చితపాద
శరణార్థి నిర్మలచారువదన
శరణార్థి యోగీంద్రసంతానభూజాత
శరణార్థి గజదైత్యచర్మధార
ఆ. వరద దేవదేవ వాసుదేవప్రియ
సకలలోకనాథ శైలనాథ
కనకశైలచాప ఖడ్గమాలస్తంభ
దేవ సత్ప్రతాప దివ్యరూప. 23
క. పంచశరాంతకలోచన
పంచానన పంచరూప భాసురకీర్తీ
పంచేంద్రియాదినిర్జిత
పంచాక్షర దివ్యరూప ప్రమథాధిపతీ. 24
శా. ఏవేదంబులకైన గూఢతరమై యేపారునీరూపముం
దేవా కంటిమి యెంతపుణ్యులల మెక్కో దేవేశ మీరాత్మలో
భావింపం బనియేమి మీతలంపు మాభాగ్యంబు సిద్ధించెనో
శైవల్యాధిప యానతిమ్ము కరుణాగర్జంబు సర్వేశ్వరా. 25

సప్తమహర్షులను శిలాచలంబునకుఁ బంపుట

వ. అని విన్నవించిన మునిజనంబులం గనుంగొని మహేశ్వరుం
డతులితకరుణాపూరితమానసుం డై యిట్లనియె. 26
సీ. శిలాచలేంద్రుని కూఁతుఁ బార్వతికన్య
నతిమోదమున మాకు నడిగి రండు

ఉడురాజవదనకు నుంకు వేఁడిగిన
నెంతైన మైకొని యిచ్చి రందు
మదిరాక్షి సాతండు మనకిచ్చునట్లుగాఁ
బెంపారనుగ్రముఁ బెట్టిరందు
పాలకూళ్లు గుడిచి బాలను మనసొమ్ము
చేసిరం దనువొందఁ జేసిరందు

ఆ. ఇదిరొ మాకు మెచ్చు నెల్లభంగులనైన
దీనిఁ జేయవలయుఁ దెలుఁగు మెఱసి
కదలిపోవ నిదిరొ కడుమంచిలగ్నంబు
భూధరేంద్రపురికిఁ బోయి రండు. 27

వ. అని పలికి యన్యపురుషావలోకనంబు సేయక వసిష్ఠపాదావలోకనంబు సేయుచున్న పతివ్రతాశిరోమణి యగునరుంధతిం జూచి శివుం డిట్లనియె. 28

మ. వనితా కూఁతులఁ బెండ్లి సేయు నెడలన్ వాచాలకుల్
తల్లులే, యని లోకంబులు పల్కుఁ గాన సతి నీవద్రీశునిల్లా
లితో, నొనరం గన్నియకున్ వరుండు దగు మీరూహింపఁగా
వేల యిమ్మని కార్యంబు ఘటింపఁగాఁ బలుకుమీ యం
భోజపత్రేక్షణా. 29

వ. అని యానతిచ్చిన మహామునులు నరుంధతీసమేతులై పరమేశ్వరునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి వీడ్కొని పరమానందంబున నత్యంతశుభసూచకంబులు బొడగాంచుచుం దుహినశిఖరంబునకుఁ బ్రయాణంబు చేసి పోవుచున్న నతిదూరంబున. 30

హేమాద్రివర్ణనము

సీ. మింటిచుక్కలతోడ మేలమాడుచునున్న
ఘనమేఘసంఘంబు గలుగుదాని
భూరితపోవనభూమీరుహంబులు
కమలాకరంబులు గలుగుదాని
గంధర్వఖేచరగణవిమానంబులు
గప్పిన రత్నశృంగములదాని
శుకపికశారికానికరధ్వనులచేత
నతిరమణీయమై యలరుదాని
ఆ. సిద్ధదంపతులు వశీకృతకాములై
సానుతలములందు సరసమాడఁ
జెలువుమిగులుదాని శీతాచలేంద్రంబుఁ
గరముచేడ్కతోడఁ గనిరి మునులు. 31

వ. మఱియును. 32

చ. సలలితకామధేనువులఁ జందనకల్పమహీరుహంబులన్
లలితతరంగిణీతటములం గరుడామరసిద్ధకన్యలన్
విలసితసూర్యకాంతముల విస్ఫురితేందుశిలాతలంబులన్
జెలువగుభూధరేంద్రమును శీతనగేంద్రముఁ గాంచి సంయ
ముల్. 33

వ. తమలో నిట్లని తలంచిరి. 34

సీ. వేదంబు లాతని వెదకి కానఁగలేని
గంగాధరుండు తాఁ గరుణమెఱసి
మనల సాధ్యుల జగన్మాన్యులఁ బూజ్యుల
నాత్మలో రప్పింప నర్థితోడ

నగవల్లభునియింటి కరిగి యాతఁడు కన్న
కూఁతురు పార్వతీకోమలాంగి
తనకుఁగా నడిగి రండని ప్రీతిఁ బుత్తెంచు
చున్నాఁడు యీభూధరోత్తముండు
ఆ. ఎంత పుణ్యుఁడగునొ యి ట్లొప్పునే యీతఁ
డెంత ధన్యుఁ డగునొ యెంతభక్తి
చేసినాఁడొ తొల్లి శివునకు బాపురే
యనుచుఁ గీర్తి చేసి రాదిమునులు. 35

వ. అని మఱిమఱి కీర్తించు నమ్మహామునులు ప్రాలేయాచలంబు డాయంబోయి మహీధ్రవల్లభుమందిరంబు వీక్షించి ఖేచరత మాని భూచరులై యతని పెద్దమొగసాల నిలచి యున్న సమయంబున. 36

చ. అనఘులు దీర్ఘదేహు లుదయార్కనిభుల్ విమలాత్మకుల్ మృగాజినధరు లగ్నితేజులు విశిష్టతగాశ్రుతు లార్యులంబుజాసనసము లాదిసంయములు సప్తఋషు ల్చనుదెంచి యున్నవా, రని హిమశైలభర్త ఫణిహారులచే విని నిత్యభక్తితోన్. 37

హిమవంతుఁడు మునులం బూజించుట

వ. అత్యంతసంభ్రమంబునఁ దనయనుంగుమొగసాలకుఁ బఱతెంచి వారలం గని వినయంబునఁ బ్రణామంబులు చేసి యమ్మహాత్ములఁ దనయంతగపురంబునకుం గొని పోయి ప్రియపూర్వకంబుగా నర్ఘ్యపాద్యాది విధులం బూజించి కనకరత్నపీఠంబుల నుండ నియోగించి నిజకరంబులు మొగిడ్చి మంద మధురాలాపంబుల నిట్లనియె. 38

శా. నన్నుం బెద్దరికంబు చేసి కరుణన్ నాయింటికిన్ మీర లి
ట్లెన్నం డేనియు రానివారలు ప్రియం బేపార వేంచేసి నే
డున్నా రిచ్చట నెంతపుణ్యుఁడ నొకో యోమహామౌనులారా
మిముఁ గన్నారం గనుఁగొంటి మంటి విలసత్కల్యాణలో
లుండనై. 39

వ. మునీంద్రులారా మీరు వేంచేయుటకుఁ గారణం బేమి యానతిత్తురుగాక యనవుఁడు నద్దివ్యసంయములు ఇట్లనిరి. 40

క. ఉడురాజధరుఁడు శంభుఁడు
మృడుఁడు మహేశ్వరుఁడు శివుఁడు మీయింటికిఁ దెం
పడరఁగ నీసుతఁ బార్వతి
నడుగఁగ బుత్తెంచె మమ్ము నచలాధిపతీ. 41

వ. అనిన విని సర్వాంగపులకాంకితుం డై భక్తిసంభ్రమపరమానందచిత్తుండై కైలాసపర్వతంబు దెసం గనుంగొని కరంబులు మొగిడ్చి తనమనంబునఁ బరమేశ్వరునకుఁ బ్రణామంబు చేసి యి ట్లనియె. 42

ఆ. శివుఁడు మునులచేత శీతాచలముకూఁతు
నడుగఁ బంపె ననఁగ నవనిలోన
నన్నుఁ బెద్దచేసి మన్ననసేయంగఁ
దలఁచెఁ గాక యేను దనకు నెంత. 43

వ. అదియునుం గాక. 44

క. ఎవ్వరిసొమ్ము తలోదరి
యెవ్వరిదాసుండ నేను నెల్లప్పుడు మా
కెవ్వఁడు దైవము శంభుఁడు
సర్వేశుఁడు దాని కాదె సకలవిధములన్. 45

వ. మమ్ము నేప్రకారంబుల నైనఁ గారుణ్యభావంబున రక్షించు గాక యని పలికినఁ దుహినశైలేంద్రునకు సప్తమునీంద్రు లిట్లనిరి.

మ. అరయంగన్ శివభక్తి యింత వలదే యానా జగన్మాత నీ
చరితం బిట్టిది గానఁ గాక యిచటన్ జన్మించునే తొల్లి త
త్పురజిత్తుండును మమ్ము నొండెడలకున్ బుత్తెంచునే ధారుణీ
ధరమాత్రంబుల కింత కీర్తి గలదే ధాత్రీధరేంద్రోత్తమా.

ఆ. నిన్నుఁ బోలవశమె నీయంతపుణ్యుండు
అఖిలజగములందు నరయఁ గలఁడె
యీశ్వరేశుపంపు నింతఁ బాటింతువె
యిట్టిభక్తి గలదె హిమనగేంద్ర. 48

క. శంకరదేవుఁడు మాతో
సుంకువడిగినంత పెట్టు మువిదకు నన్నాఁ
డింకిట నెయ్యది గొనియెదు
కొంకక మాతోడఁ జెప్పు కుధరాధిపతీ. 49

వ. అనవుఁ డిట్లనియె మిమ్ముఁ బార్వతీదేవికి సుంకువ యిచ్చి రండని యానతిచ్చె నేని మునీంద్రులారా వీఁడు నావాఁడని యెల్లభంగులందును నిరంతరకరుణాయత్తచిత్తుం డై నన్ను మన్నించుటయె నాకు నాకూఁతురకును పదివే లుంకువలు పెట్టుటయగు మీరాయానసుండీ మీరాకుం దగినపని చేయుదు బాలిక నాలోకింపవలయు నని కుమారీతిలకంబు నలంకరించిన. 50

క. వనితామణి రూపమునకుఁ
గనుపాటుగఁ జేర్చి కప్పు గప్పినభంగిన్

ఘనకుసుమగంధ నవమణి
కనకాంబరములను చాలఁ గైసేసి రాఁగన్. 51

క. మానిను లిరుదెసఁ గొల్వఁగ
జానుగ నల్లల్ల శైలజను దోకొనుచున్
మేనక చనుదెంచుటయును
మానులతో శైలవిభుఁడు మఱి యిట్లనియెన్. 52

క. అదె మా బాలిక వచ్చెను
సదమలతరహృదయులార సర్వేశునకున్
ముదితను నీడుగఁ జూడుఁడు
పదపడి శుభలక్షణములు పరికింపుఁడొగిన్. 53

వ. అనిన విని మునీంద్రులు కుమారి నాలోకించి జగదభినవ కల్యాణరూపంబునకు నాశ్చర్యామోఘహృదయులై యు ట్లనిరి. 54

క. ఆదియు నంత్యము దవ్వగు
వేదాతీతుండు శివుఁడు విభుఁడుగఁ బడసెన్
బైదలి శుభలక్షణములు
వేదంబులకైనఁ దరమె వివరింపంగన్. 55

వ. గిరీంద్రా యమ్మహాదేవి శివదేవునకుఁ బరిణయంబు గాఁ దగు నిద్దతికి నీడయియున్నది కార్యంబును గొలికికి వచ్చినది 'శుభస్య శీఘ్ర' మ్మని పెద్దలు పలుకుదురు గావున దీనికిఁ దడయనేల సంఘటింపుమని మునీంద్రులు* వాంఛితశోభల భావాంకురంబులు వెలుంగ మంగళంబులగు నాకాశగంగా తరంగిణీ జలంబులును సల్లలితంబులగు నశ్వత్థపల్లవంబులును

* నవాంఛితశోభల శర్మాంకురంబులు.

తాంబూలకనకకలశ కుసుమగంధాక్షతంబులును మణిమయం
దక్షిణమంగళద్రవ్యంబులు దెప్పించి సువర్ణపీఠంబున శుభ
ముహూర్తంబున నక్కాంతాతిలకంబు నుండ నియోగించి
విధ్యుక్తప్రకారంబున నర్చించి అధికపుణ్యాహంబు చేసి
పుణ్యాహజలంబులు శిరంబునం బ్రోక్షించుకొని కళ్యాణ
వాద్యంబులు చెలంగ ముదితకు ముద్రారోహణంబు చేసి
గిరీంద్రునకు నుంకువ మొదుపిచ్చి సంయమీంద్రులు పర
మానందంబున. 56

ఆ. పాలకూళ్లు గుడిచి శైలాధిపునియింట
రమణతోడ నాఁటిరాత్రి యుండి
గౌరితండ్రి తమకుఁ గట్టంగ నిచ్చిన
సత్ప్రియంబుతోడ సమ్మతించి. 57

వ. మఱునాఁ డమ్మహామునీంద్రులు మనంబార వీడ్కొని రజత
ధరణీధరశిఖరంబునకుఁ బ్రయాణంబుచేసి సర్వేశ్వరుం
గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి దేవా దేవర
యానతిచ్చినపనులెల్లను శుభకరంబులై సిద్ధించె నని తత్ప్రి
కారంబు తెలియ విన్నవించి వారై యుట్లనిరి. 58

మునులు దాము జరిగించినకార్యమును శంకరునకుఁ దెలుపుట

సీ. దేవేశ మీ రానతిచ్చినపనిఁ బూని
యరవొప్పఁ బయనమై యేము బోయి
తనయింటికరిగినతఱి మము వేఁడఁగని
యెంతయుదవ్వు మా కెదురు వచ్చి
యతిభక్తితో మ్రొక్కి యర్ఘ్యపాద్యాదుల
నమరఁ బూజించి పీఠములు వెట్టి

హేమంబులరసి తాఁ జేతులు మొగిడించి
యేతేరఁ గారణం బేమి యనిన
ఆ. నీలకంధరుండు నీకూఁతు పార్వతి
భామఁ దనకు నడుగఁ బంపె ననుడు
భక్తితోడ మ్రొక్కి పలుదెఱంగుల నిట్లు
గారవించి పలికెఁ గామవైరి. 59

క. హరి మీయన్న నలకుఁ దగు
వరుఁడా యిటువంటిభక్తి వలదే మనకున్
గిరిరాజునేయు భక్తికి
సరి యున్నెఁగఁ గలదె భక్తి చంద్రాభరణా. 60

క. పలుమరు మున్లోకంబులఁ
జెలులం జూచితిమి గాని చింతింపఁగ నా
లలనకుఁ గలలక్షణములు
గలయఁగ నేచెలులయందుఁ గానము దేవా. 61

క. ఆకన్నులు నాచన్నులు
నాకురు లామద్దమోము నానెరు లార
య్యాకారము నామధ్యము
నేకాంతలయందు నెఱుఁగ మిభచర్మధరా. 62

క. నీలాహివేనికంటెను
నీలాభ్రలకంటె నింద్రనీలముకంటెన్
నీలరుచిఁ బోలునంబిక
నీలాలక లేమి చెప్ప నీలగ్రీవా. 63

క. బాలేందుఁడు చంద్రానన
ఫాలముతోఁ సాటి యనఁగఁ బలుకుదురు కవుల్

బాలిక ఫాలరుచులపై
బాలేందుం డెంతవాఁడు బాలేందుధరా. 64

క. సుదతీలలామభామలకు
వదలక సరిసేయ నొకటి వచ్చునె నీచేఁ
గదనమునఁ *దెగడ యేనియు
మదనున కది విల్లుగాదె మదనారాతీ. 65

ఉ. సోమునిఁ దోడుతెచ్చుకొని స్రుక్కక చిల్కలుఁ దేంట్లు
గొల్వఁగాఁ, గాముఁడు విల్లునమ్ములు నఖండతఁ బట్టినయట్లు
దోఁచు నా,భామముఖాబ్జరేఖయును బల్కును గొప్పును
భ్రూలతాంగముల్, గాముఁడు నీవు చంపుటయుఁ గల్లని
పించె శశాంకశేఖరా. 66

క. సుందరిమృగలోచనముల
యందము లందందుఁ గల్గు టది నూనము దా
నిందీవరములయందును
గందర్పునిశరములందుఁ గంజములందున్. 67

సీ. జలజాక్షినెమ్మోముఁ జందురుఁ బోల్తమా
చందురునందునఁ గందు గలదు
కన్నియవదనంబుఁ గమలంబుఁ బోల్తమా
కమలంబు పుట్టుచోఁ గసటు గలదు
మోహనాంగిముఖంబు ముకురంబుఁ బోల్తమా
ముకురంబునందున మృదువు లేదు

---

* దెగడయడియున్ మదనుని నసవిల్లె కాని; దెగనితేనియ మదనుని విల్లెముకాని.

మానినివదనంబు మణిసంక్రీడ బోల్పమా
మణులెల్ల రా లనుమాట గలదు
ఆ. ఇంక నేమిబోల్పమింతియాననముతో
సృష్టి నేమిసాటి సేయవచ్చు
మగువ మెఱుగుము కాంతి మలహార నీయాన
త్రిభువనంబులందు నభినవంబు. 68
క. చిలుకలకోయిలపలుకుల
వెలయంగా టొంకు గలదు వీణెయుఁ దానై
పలుకఁగ నేరదు కన్నియ
పలుకులతోసాటి యేమిపలుకుదుము శివా. 69
ఆ. చెలువకరము కెంపు చిరతరారుణకోమ
లంబు లైనపల్లవంబులందు
నందమైనయట్టి చెందామరలయందుఁ
గలుగనోపుఁ గాని గలుగ దెందు. 70
సీ. తరుణిచన్నులు భద్రదంతికుంభములన్న
దంతికుంభములకుఁ గాంతి లేదు
కోమరాలికుచములు కోకద్వయములన్నఁ
గోకంబు లోకచోటుఁ గూడకుండు
కన్నియచనుదోయి కనకకుంభములన్నఁ
గనకకుంభము లవి గరఁగఁబడును
*పొలఁతుకపాలిండ్లు పూబంతు లందమా
పూబంతులంటినఁ బ్రోదిదూఁగు.

* కంజాక్షిపాలిండ్లు ఘనమైన గిరులన్న గిరులకు ననువైనయొరపు లేదు.

ఆ. గానఁ బోల్పఁ దగదు కాంతపయోధర
యుగళమునకు నింక జగములోన
నేమి పోల్పవచ్చు నీశాన చెప్పవే
పణఁతిఁ బొగడవశమె బ్రహ్మకైన. 71

క. తెఱవకుఁ జన్నులప్రేఁగున
మఱి యల్లలనాడుచున్న మధ్యము ప్రేఁగై
విఱుగునది విఱుగకుండుట
వెఱఁగయ్యెను మాకుఁ జూడ విశ్వాధిపతీ. 72

క. చెలువకుఁ గేకిసములకును
కలహంసాధీశునకును గజరాజునకున్
వెలఁది నడుచుక్రియ లట్లను
నలి నడవం దరముగాదు నాగేంద్రధరా. 73

క. లలనామణి యగుపార్వతి
విలసితకల్యాణరూపవిభవము చెప్పన్
మలహార నీయాన సుమీ
జలజాసను కైనఁ జనదు చంద్రాభరణా. 74

ఆ. అతివ యిట్టి దట్టి దని చెప్పరా దెందు
దేవదేవుఁ డైన దేవ నిన్ను
నధిపుఁ గాఁగఁ బడసె నంతయు చాలదే
వెలఁదిలక్షణములు వేయు నేల. 75

వ. దేవా మానేర్చుప్రకారంబున నీయనుగ్రహంబున మీకుఁ బరిణయంబుగా నిశ్చయించి పార్వతీదేవికి ముద్రారోపణంబు చేసి వచ్చితిమి యింకఁ దడయ నేల వివాహలగ్నంబు నిర్ణయించి హిమనగేంద్రుఁ డున్నచోటికి లేఖలు పంపు

దురు గాక మహాత్మా గరళకంధరా విూకల్యాణమహిమాభి
రామంబు చూడ వచ్చెదము సోమశేఖరా శరణం బని
విన్నవించిన మునినాథుల ననుకంప పొంపుమిగుల సానంద
రసంబుల నోలలార్చి యమ్మహేశ్వరుండు. 76

పార్వతీపరిణయమునకు బ్రహ్మాదిదేవతలు వచ్చుట

ఆ. దేవిఁ బెండ్లియాడ దినమేది లెస్సదో
యెఱుఁగవలయు నంచు నీశ్వరుండు
భారతీశుఁ దలఁచె బాలేందుజూటుని
తలఁపుతోనెఁ గూడ ధాత వచ్చె. 77

వ. ఇట్లు చనుదెంచి బ్రహ్మ తనకుం బ్రణామంబు చేసి నిలచినఁ
గనుంగొని సముచితప్రకారంబుల గారవించి యతని నప్పర
మేశ్వరుండు విధ్యుక్తప్రకారంబుల వివాహలగ్నంబు
నిర్ణయించి తనపెండ్లికి రమ్మని చతుర్దశభువనంబులందుఁ
జాటింపం బంచిన. 78

ఉ. దేవరపెండ్లి నేఁ డనుచుఁ దేజము పొంపున భోగరాయఁడై
దేవతలందఱుం గొలువ దేవమునుల్ నుతి సేయఁగా శచీ
దేవియుఁ దాను గూడి చనుదెంచె మహేంద్రుఁడు పెంపు
తోడ నైరావణదంతి నెక్కి మునిరంజనుకొండకు వెండి
కొండకున్. 79

ఉ. నాలుగుశృంగముల్ మెఱయ నాలుక లేడు వెలుంగఁ
గోర్కులన్, దేలుచు మూఁడుపాదములు తేటపడన్ నిజ
వైభవోన్నతిన్, వ్రాలుచు నేగుదెంచె నజవాహనమెక్కి
ధనంజయుండు నిల్లాలును దానుఁ గూడి త్రిపురాంతకు
కొండకు వెండికొండకున్. 80

ఉ. దండధరుల్ మహోగ్రులు లుదగ్రులు కింకరు లోలిఁ గొల్వ స
ద్దండలులాయవాహుఁడయి దర్పముతో మణిభూషణాంగుఁ
డై, దండధరుండు వచ్చె ఘనదండము కేల వెలుంగఁ
గామినీ, మండితుఁ డై మనోజమదమగ్నుకొండకు వెండి
కొండకున్. 81

ఉ. మానవు నెక్కి రాక్షసులు మన్నన సేయఁగ నభ్రవీథిపై
మానవకేతనం బడర మానినియున్ దనతోఁడ రాఁగ స
న్మానితవస్త్రభూషణరమానధరుండయి వచ్చెఁ బ్రీతితో
దానవనాయకుండు జితదైత్యునికొండకు వెండికొండకున్.

ఉ. మోదత సప్తసంద్రములు ముంగలఁ గొల్వఁ గెలంకులందు
గం,గాదిమహానదుల్ సముదయంబుగ రా ఝషకాంత
వాహుఁ డై, శ్రీ దనరార నేఁగె రుచిఁ జెన్నగు కానుక
లెల్లఁ గొంచుఁ దాఁ, బైదలిఁ గూడి వార్ధిపతి భర్గునికొండకు
వెండికొండకున్. 83

చ. మునినికరంబులుం గొలువ మోదము నొందుచు మానసంబు
లన్,జనములు పల్లవింపఁ గడుఁ జల్లనికమ్మనిగాడ్పు వీచుచున్
వనజదళాక్షితో హరిణవల్లభు నెక్కి జగజ్జనానురం
జనమున నేఁగె నమ్మదనసంహరుకొండకు వెండికొండకున్. 84

ఉ. సంగడికాని పెండ్లి యని సంతస మందుచు మేలురాజ్యల
క్ష్మిం గడుఁ దేజరిల్లుచును జెల్వయుఁ దాను దుకూలరత్నమా
తంగతురంగకాంచనకదంబముఁ గొంచుఁ దురంగవాహుఁడై
సంగతి నేఁగె విత్తపతి శంకరుకొండకు వెండికొండకున్. 85

చ. నొసల విభూతిఁ బూసి కడునున్నని యేనుఁగుతోలుఁ గప్పి రా
జసమున పాములం దొడిగి చారుత్రిశూలపినాకహస్తుఁ డై

మిసఁగిన వేడ్కతోఁ దనదు నింతియుఁ దానును వచ్చెశౌరి
దా, బసవని నెక్కి జూటహిమభానునికొండకు వెండికొండ
కున్. 86

మ. ఘనశృంగారముతో మహామహిమతోఁ గళ్యాణియుం
దాను సజ్జనితోల్లాసులు పుణ్యభాగవతులుఁ సంసార
దూరాత్మకుల్, సనకాదుల్ కడుఁ గొల్వ మింట నరిగెఁ
సంప్రీతితో మాధవుం, డనఘుం డాధ్యుఁడు వెండికొండకు
ఖగేంద్రారూఢుఁ డై రూఢితోన్. 87

క. వలనొప్ప మునులు గొలువఁగఁ
గలహంసాధీశు నెక్కి గ్రక్కున వాణీ
లలనయుఁ దానును వచ్చెను
జలజాతభవుండు రజతశైలము కడకున్. 88

క. తారాగ్రహములు గొలువఁగఁ
దారాహితకమలహితులు తద్దయు వేడ్కఁ
దీరొప్ప నేగుదెంచిరి
తారాచలశిఖరమునకు ధన్యాత్మకులై. 89

క. నరకిన్నరగరుడోరగ
సురదనుజేంద్రాది సిద్ధసురముని విద్యా
ధరగంధర్వాధీశులు
వరుసం గైలాసమునకు వచ్చిరి ప్రీతిన్. 90

వ. ఇట్లు గౌరీకళ్యాణవిలోకనకాంక్షులై సకలమైనవారును
కలధౌతధరణిశిఖరంబుఁ బ్రవేశించి పరమేశ్వరుం గాంచి
వినతులై వినుతించుచున్న సమయంబున వారలఁ గరుణ
తోడం గనుంగొని యమ్మహేశ్వరుం డిట్లనియె. 91

దేవతలు క్షేమము నీశ్వరుం డడుగుట

మ. లలితానందమె పాకశాసన మనోల్లాసంబె సప్తార్చి మం
గళమే భానుజ లెస్సలే దనుజ సౌఖ్యంబే జలాధీశ సం
జలమే మారుతి మోదమే ధనద విశ్రాంతంబె యీశాన శ్రీ
పాలువే మాధవ యంచు నేమ మరసెన్ భూతేశుఁ డింద్రా
దులన్. 92

వ. ఇ ట్లడిగిన నంత సమ్మహాదేవునకు దేవత లి ట్లనిరి. 93

క. శరణార్థిభ క్తవత్సల
శరణార్థిపురాణరోగిజనమందారా
శరణార్థిదురితసంహార
శరణార్థిమహేశ రుద్ర జలజాక్షనుతా. 94

క. దేవా మీకృప గలుగఁగ
భావింపఁగ మాకు నెపుడు భద్రము సుమ్మీ
దేవేశ మిమ్ముఁ గంటిమి
కావున ధన్యులము గామె గంగాధిపతీ. 95

వ. అని మఱియు బహుప్రకారంబుల వినుతింప నద్దేవసమూ
హంబులముందఱ నిల్చి విరించి యి ట్లనియె. 96

మ. గమనింపం గదు లెస్స నేఁడు శుభలగ్నం బెల్లి బృందార
కుల్, కమలాక్షాదులు వచ్చినారు తడయంగా నేల శం
చేయుఁ డీహిమశైలేంద్రునిపీటనుండి వినయం బేపార
నిచ్చోటికిన్, రమణీ లేఖలు వచ్చెఁ బెండ్లికి మిమున్
రక్షించు సర్వేశ్వరా. 97

వ. అని విన్నవించిన విరించివచనంబులకుఁ బంచాననుండు
రంజిల్లి లౌకికాచారంబు విచారించి తనమనంబున. 98

గీ. గౌరి కాన పోయి కలయంగ నిటమీఁద
భువనమెల్ల శైలపుత్రి యనఁగ
సవతితల్లి యనుచు జాలి పొందెదు సని
ప్రీతి నేకదంతుఁ బిల్వఁ బంచె. 99

గజాననుని పార్వతీపరిణయమునకుఁ దీసికొని పోవుట

శా. రావో కుఱ్ఱఁడ యంచుఁ గౌఁగిటికిఁ జేరం బిల్చి యూరార్చి య,
ద్దేవుం దేనుఁగుతుండముం బుణికి మూర్ధఘ్రాణముం
జేసిన,ద్భావుం డంకతలంబుపై నునిచి సంభావించి ప్రేమాబ్ధిఁ
దా,దై వారం దనముద్దుపట్టికిని గందర్పాంతకుం డిట్లనెన్. 100

శా. రమ్మా శీతనగేంద్ర పట్టణమునన్ లీలార్థమై యున్నవా
యమ్మం దేవళె నుండనీ దగవు నీ వాయత్తమై తోడితే
రమ్మా నీవును నీగణంబులును సంరంభమ్ముతో ముందఱం
బొమ్మా మేమును గూడ వచ్చెదము సమ్మోదంబుతోఁ
బుత్రకా. 101

వ. అని గణనాథచక్రవర్తిని గైసేసి. 102

నందివాహనుండై శంకరుండు పరిణయంబునకుం జనుట

సీ. గగనవాహినికప్పుముకుటంబు ధరియించి
లేఁతవెన్నెలఁ బువ్వుభాతిఁ దుఱిమి
ప్రాఁతపాములనెల్ల పరిహారముగు చేసి
మఱిక్రొత్తపాములమణులు దొడిగి
దందశూకాధీశుఁ దలచుట్టుగాఁ జుట్టి
పాలుపార నెద భూతిపూఁతఁ బూసి
పొడలనున్న నిక్రొత్తపుట్టంబు ధరియించి
యేనుగుచర్మంబు మేనఁ గప్పి

ఆ. నీలకంధరమున నెమ్మితోఁ జట సంఘుఁ
బూససరులు వైచి పొలుపు మిగులఁ
జెలువు చేసి యిట్లు శివుఁడు చతుర్దశ
భువనరాజ్యలక్ష్మి పొలుపు మిగుల. 103

వ. మఱియును శృంగారవారాశి యై మారారాతి మహామో
దంబున. 104

సీ. ఘణిఘణిల్లున వైచు ఘనమైన యంకెలఁ
గులశైలగుహలు ఘూర్ణిల్లి చెలంగ
మహితవాలోద్ధూత మారుతవశమున
దిక్కులు చొరుగులై తిరుగుచుండ
కొండలు కోరాడు కొమ్ముల నమ్మేటి
ధారాధరంబులు దగులుపడఁగ
పదఘట్టనమున భూభారదక్షుం డగు
శేషాహి యల్లన శిరము వంపఁ

ఆ. గోమరుశృంగములును ఖురములుఁ గింకిణీ
ఘంటలును జెలంగఁ గడఁకతోడ
నందమైనయట్టి నందికేశ్వరు నెక్కి
పుష్పవృష్టి గురియ భూతవిభుఁడు. 105

క. హరుఁ గొల్చి సకలజనములు
కర మొప్పఁగ నడువఁ గదలి గణనాథుం డా
సరిఁబొజ్జ పెంచి నిక్కుచు
మురియుచు మూషకము నెక్కి ముందట నడిచెన్. 106

వ. ఇట్లు గతశృంగారవైభవాడంబరంబున నప్పరమేశ్వరుండు
గోరాజగమనుం డై గౌరీకళ్యాణం బవధరించుతలంపు

మనంబున సందడింప సొంపు మిగిలి తుహినగిరికుధరంబునకుఁ బ్రయాణంబు సేయ గమకించి సముంచితాలంకారుం డై తన పూర్వభాగంబునఁ దుంబురునారదాదివీణానాదంబులవారును దివ్యదుందుభినిస్సాణశంఖకాహళఘంటికా వాద్యంబులవారును దండిచండీశ్వరాది మంగళపాఠకజనంబులుఁ గొలిచి నడువ వారలం గడిసి శాసనతపనవారుగొలంకులందు నాసన్నవర్తు లై తమతమవాహనంబులతో నారాయణ భారతీశులును వారలం గడిసి దేవేంద్రాగ్నిదినేంద్రతనయ దితిసుతవరుణవాయుకుబేరప్రముఖు లైనదిక్పాలకులును వారలదక్షిణోత్తరభాగంబుల సూర్యచంద్రాదినవగ్రహంబులును మఱియును దనయుపరిభాగంబున సుబలసుమంత మాండవ్య మరీచిముందపాలమార్కండేయ దధీచ్యుపమన్యు వామదేవ దూర్వాస వసిష్ఠ గౌతమాగస్త్య కౌశిక కణ్వాది మునిజనంబులును మూర్తిమంతంబు లైనవేదశాస్త్ర తపోధర్మసత్యంబులును వారలపిఱుంద వాలఖిల్యాదిమహాపురాణసిద్ధులును సనకసనందనసనత్కుమారాది యోగీంద్రులును దివిజముని గరుడకిన్నరగంధర్వసిద్ధవిద్యాధర కన్యకాజనంబులును భృంగిరిటివీరభద్రాదిగణంబులును గతిపయ దూరంబునఁ బ్రమథగణంబులును దైత్యదానవాధీశ్వరులును బరివేష్టింప నమ్మహామూకలలోనఁ జొచ్చి యొడనెడ సందడి సేయుచు సూర్యవర్ణసోమవర్ణాది మహాప్రమథనాయకులు మహాలెక్కలై కొలువ నందంద కుసుమవర్షంబులు విడువక జడివట్టి కురియ నానాలోకరంజనామోదసుగంధ మారుతస్పర్శనంబున జనంబుల మనంబులు పల్లవింప నష్ట

మోశ్వరుండు జగన్మోహనమహిమాభిరాముండై వివా
హంబునకు వచ్చుచున్న సమయంబున, 107

క. మలహరుఁడును బెండ్లికి రాఁ
గలవాఁడని మున్నె యెఱిఁగి గౌరవమున బం
ధులకును లేఖలు బంపఁగఁ
దలఁచె గిరీంద్రుండు వేగఁ దగఁ జారులచేన్. 108

సీ. మలహరుఁ డీశుండు మనపాప నడుగంగఁ
బుత్తెంచుటయు మేము నత్తెఱంగు
మహిఁ బెద్ద లగువారి మన్నన బంధుల
రప్పించి తగ విచారంబు చేసి
వాఁ డేవ్వఁడు తగువరుఁ డని భావించి
నెలఁతకు నీడు గా నిర్ణయించి
యుంకువఁ గొంటిమి యొనరంగ నిటమీఁదఁ
బెండ్లిలగ్నంబు సంప్రీతితోడఁ

తే. వేర్మి నీశోభనము చక్కఁ బెట్టవలయుఁ
గరుణ వేంచేసి మీ రెల్లఁ గలఫలంబు
లీలఁ దనర్పంగఁ జేయక లేఖఁ గన్న
యప్పుడ రండని ప్రీతితో నద్రివిభుఁడు. 109

మత్తకోకిల.—

వెండికొండకుఁ బైఁడికొండకు వింధ్యయన్ బలుకొండకున్
చండభానుఁడు దోఁచుకొండకు సాగరాంతపుఁగొండకున్
మండనం బన నొప్పుకొండకు మందరం బనుకొండకున్
కొండరాయఁడు పంపె లేఖలు కోటికాలరిపంక్తిచేన్. 110

వ. ఇట్లు తనసర్వబంధుజనులకు గౌరీవివాహమహోత్సవం బెఱిం
గించి పంచిన వారును నిజబంధుసహితు లై తత్క్షణంబునఁ
జనుదెంచిన. 111

హిమవంతుపురంబు నలంకరించుట

ఉ. భూరివిలాసుఁ డై త్రిదశపుంగవసంగతసంగుఁ డై జటా
భారసుధామరీచి మనపార్వతి పెండ్లికి వచ్చుచున్నవాఁ
డారయ నీక్షణం బనుచు నందము గాఁ దనయున్న ప్రోలు
శృంగారము సేయఁ బంచె శుభకౌతుకచిత్రవిభూతి నొప్పఁ
గన్. 112

వ. ఇట్లు పురంబు శృంగారంబు చేయం బంచిన. 113

క. మణులను గనకంబుల ద
ర్పణముల నవపల్లవముల బహువస్త్రములన్
బ్రణుతగతిని నెత్తిరి తో
రణములు పురవీథులందు రచ్చలయందున్. 114

సీ. మృగనాభిజలములు *ముంగిళ్లఁ జల్లిరి
ముగ్గులు దీర్చిరి ముత్తియములఁ
దనర నంగళ్లఁ జిత్తరువులు వ్రాసిరి
హేమకుంభము లెత్తి రిండ్ల నెల్లఁ
బహుమార్గముల నంది పడగలు గట్టిరి
కీలించి కట్టిరి మేలుకట్లు
కమనీయగతుల వాద్యములు మ్రోయించిరి
రోలమి శృంగారించి రెల్లచోట్లఁ

---

*అవాకింగసాల అలికిరి.

ఆ. బరఁగ సకలలోకపతికి సముచితప
నాయితములు చేసి సఖిలజనులు
సర్వజనులు మిగుల సంపద నొందిరి
భూధరేంద్రుఁ డేలుపురమునందు. 115

వ. మఱియు ననేకప్రకారంబుల నాదిపురుషుఁ డగువిశ్వ
కర్మచే నిర్మితంబైన యోషధిప్రస్థపురంబు శృంగారంబు
చేయించి తనపర్వతంబునం గలబిలంబులు కొలంకులు సాను
దేశంబులు నలంకరించె నగ్గిరీంద్రుం డంత. 116

సీ. తారకాసురుచేతి దారుణకృత్యముల్
మానుగ నిటమీఁద మానుననియుఁ
దారలదీధితి తలకొని మాయించు
నెంత యింతటఁ గరుణించు ననియుఁ
హరుపెండ్లిచూడ రండని మేరుగిరి చాటు
వారికిఁ జెప్పఁ బోవలయు ననియు
గౌరీవివాహలగ్నం బెల్లి ప్రొద్దునఁ
దిరిగి తూర్పునఁ బొడతెంచు ననియు

ఆ. సంభ్రమించి పెండ్లిపాటించి యవ్వేలి
దిక్కు మొగము చేసి తివ్రగతుల
సకలచారిణీవ్రజంబులు హర్షాబ్ధిఁ
గ్రుంకె నపరవార్ధిఁ గ్రుంకె నినుఁడు. 117

క. కమలారి పనుపు గూఢ
క్రమమున జని వేగుచూచు కాలరులక్రియన్
గమలముకులరాజి గ్రుంకిన
క్రమమున నొక్కొక్క చుక్క గానంబడియెన్. 118

ఉ. చీఁకటి గప్పె నాకసము జీఁకటి గప్పె దిగిభకుంభముల్
చీఁకటి గప్పె భూతలముఁ జీఁకటి గప్పెఁ జరాచరాదులన్
జీఁకటి గప్పె దంపతులచిత్తసరోజవనాంతరంబులన్
జీఁకటి గప్పె లోకములు చీఁకులు సేయుచు నంతకంతకున్.
వ. ఇట్లు నిబిడాంధకారబంధురపటలంబున నందంబులై భూతజాలంబు సుప్తంబునుం బొంది యున్నసమయంబున. 120

సీ. రత్నాకరము ద్రచ్చ రాజుపుట్టెడువేళఁ
దొడఁగిన యమృతబిందువు లనంగ
కమలవైరిని రాహు గబళింప నంతంతఁ
దొరఁగు వెన్నెలరేని తునుక లనఁగ
నాకాశలక్ష్మి దా హరుని పెండ్లికి నిరు
కేలఁ బట్టిన సేసఁబ్రా లనంగ
నిశలేశునకు బ్రహ్మ నీలాంబరమున పై
ల్కట్టుకట్టిన మౌక్తికంబు లనఁగ
ఆ. వీథు లేర్పడంగ వెలుఁగు మెఱుంగుల
చిదుపలమరుభంగిఁ జెలువు మిగిలి
గగనవీథినుండి ఘనతర నిబిడాంధ
కారమువియఁ దారకంబు లొప్పె. 121

చంద్రోదయవర్ణనము

సీ. మఱఁగినవిరహుల మానంబు లెడలించి
యురవైన చీఁకటియిండ్లు కనిపి
*మఱఁ గోకముల నెల్ల మఱువులుగాఁదోలి
నీలోత్పలంబుల మేలుకొలిపి

* మఱిచోరకుల నెల్ల మఱువులు చోఁ దోలి.

వెలయఁ జకోరశావలికి విందులు వెట్టి
నీరజాతంబుల నిద్ర వుచ్చి
వనధుల నుబ్బించి వలరాజు నెగయించి
మందమారుతము కానందమొసఁగి

ఆ. తనదు తెలుపుచేతఁ దలకొని నిఖిలంబు
తెలుపుఁ గాఁగఁ దూర్పుదిక్కునందుఁ
జల్లదనము చూపి జగము లన్నింటికి
మామ యనఁగఁ జందమామ వొడిచె. 122

వ. మఱియుఁ దదీయసాంద్రచంద్రికావితానపటపరిభ్రమణసంభ్రమణంబు నభినవవితానవిరాజితంబై చకోరసముదయసామ్రాజ్యవైభవంబై కుసుమశరభుజబలాతిశయాభిరామహేతుభూతంబై విరహిణీజననికరహృదయవిహ్వలీకృతాకారంబై జగన్మోహనంబై యొప్పుచుండె నంతఁ గ్రమక్రమంబున. 123

సూర్యోదయవర్ణనము

సీ. నలినదళంబుల కలకొని వెలయించి
కువలయదళముల క్రొవ్వణంచి
కుసుమబాణుని పెంపు కొంత నివారించి
విరహులఁ బట్టినవెట్టఁ దెలిపి
యంధకారము నెల్ల హతమును గావించి
చుక్కలతేజంబు జక్కఁబెట్టి
మదచకోరంబులమదములు విడిపించి
నిఖిలజగంబుల నిద్ర మాన్పి

ఆ. వేఁడిదీప్తి దిశల వెదచల్లి మునులును
నమరసంఘములును నర్ఘ్యజలము
లొసఁగఁ బూర్వశైల దెస నభిరమ్యమై
తామ్రకిరణుఁడైన తరణి వొడిచె. 124

వ. ఇట్లు ప్రభాతసమయం బై రేయి వెప్పె సంతకమున్న తదీయ ప్రభాతకాలనిశ్చయాలోకన మనోరథుండై తుపారధరణీధరేంద్రుండు వందిమాగధ మంగళపాఠకాదిజనంబులు కళ్యాణ వాద్యంబులతో నత్యంతశోభనతూర్యంబు లవార్యంబులై చెలంగ సాలించి ప్రాతస్స్నానప్రాణాయామ సంధ్యాది సముచితకృత్యంబులు నిర్వర్తించి గృహదేవతాప్రార్థనంబు చేసి ధనకనకధేనుధాన్యాదిమహాదానంబుల ననేకభూసుర నికరంబులకు నుపచరించి తదీయమంగళాశీర్వాద ప్రమోద మానమానసుం డై తదనంతరంబున. 125

మ. తమ పెద్దింటియరుంగుమీఁదఁ గడఁకన్ ధాన్యంబుపైఁ బెండ్లిల
గ్నము పాధింపఁ బసిండి పేర్పున నభోగంగానదీతోయముల్
రమణం బోసి యలంకరించి ఘుడియారం బొప్పఁ గట్టించి య
య్యమరాచార్యునిచే మహామహిమతో నర్కప్రతాపంబు
నన్. 126

వ. ఇట్లు ఘుడియారంబు పెట్టించి పరమేశ్వరుండు వేంచేయు చున్నాఁడు. ఎదుర్కొని పోవలయుఁ దడవుసేయరాదని సంభ్రమానందంబున. 127

సీ. గంధమాదనమేరుకైలాస శైలాది
కులశైలభర్తలు గొలిచి నడువ

పుణ్యకాహాళులును బుణ్యదుందుభులును
బుణ్యశంఖంబులు బొలిచి మ్రోయ
మంగళపాఠక మాగధవందిజ
నంబులు శుభకీర్తనములు సేయ
కదిసి పేరంటాండ్రు కళాస్థానములఁ బాడ
పరిజనంబులు తన్నుఁ బలసి కొలువ
తే. లలితసామ్రాజ్యవైభవలక్ష్మి మెఱసి
పరఁగ నంతంత మ్రొక్కుచు భక్తితోడ
శైలముల కెల్ల రాజగు శైలవిభుఁడు
ఎలమి నేతెంచెఁ బరమేశు నెదురుకొనఁగ. 128

వ. ఇవ్విధంబున నెదురుకొనం జనుదెంచి పంచాననుం డాదిగా నెల్లవారలమీఁద సేసలు చల్లుచుఁ గరపల్లవంబులు మోడ్చి వినయంబునఁ బ్రణామంబులు చేసి భక్తవత్సల పరమేశ్వర సర్వదేవతామయ శంకరస్వామీ మహేశ్వర మహాదేవ దేవతాసార్వభౌమ శరణ్యంబని పలికినం గనుగొని యల్లల్ల నవ్వుచు శ్రీవల్లభుం జూచి చూచితే యని పలుకుచు నమ్మహేశ్వరుండు తన్ను డాయ రమ్మని చేసన్న చేసినం గదిసి తుహినాచలేంద్రుండు. 129

మ. జగదీశాయ నమో నమో నవసుధాసంకాశితాంగాయ శ్రీ
నగనాథాయ నమో నమో శుభకరానందాయ వేదార్థపా
రగవంద్యాయ నమో నమో సురనదీరంగత్తరంగావళీ
మకుటాగ్రాయ నమో నమో మునిమనోమందారసర్వేశ్వరా.

ఉత్సాహ.—
విదితతంత్ర మంత్రవాద వేదధర్మమర్మముల్
వెదకుఁ గాని నిన్నుఁగాన లేవు యిట్టి నీకు స
మ్మదముతోడఁ గన్నె నిచ్చి మామ నైతిఁ బుణ్యసం
పదలు గంటిఁ గీర్తిఁ గంటిఁ బంచవదన శంకరా. 131

వ. అని వినుతించుచున్న గిరీశ్వరుం జూచి విరించి మొదలగు
దేవతాబృందంబు లిట్లనిరి. 132

తే. పరఁగ విహిత మైనపనులను జేయంగఁ
బోవవలయునేని పోవు మిపుడు
దేవదేవుఁ డేగుదెంచుచు నున్నాఁడు
తడవుసేయఁ దగదు ధారుణీధ్ర. 133

వ. అనిన విని విహితకృత్యంబులు సర్వాయత్తంబు లై యున్నవి
మహాత్ములార మీతోడ నే చంద్రశేఖరుఁ గొలిచి వచ్చెద
నని పలికిన నయ్యవసరంబున. 134

క. గౌరీనాథుని పెండ్లికి
నీరేడుజగంబు లెల్ల నేతెంచుటయుఁ
భారమునకు నైరింపక
తారాచలవల్లభుండు తద్దయుఁ గడఁకన్. 135

తే. దేవదేవు పెండ్లి తెఱఁగొప్ప నంతయుఁ
జూడఁ దలఁచి నిక్కి చూచె ననఁగ
దక్షిణంబుదిక్కు ధారుణి యంతయుఁ
గడలనొద్దగొడవు గాఁగ నెగసె. 136

వ. అంత నంతయుం బరికించి సకలలోకరక్షకుఁ డగునారాయణ
దేవుం డమ్మహాదేవున కిట్లనియె. 137

శా. స్వామీ శంకర కంకణోరగపతీ సంపూజ్యబృందారకా
కామధ్వంసక సర్వలోకములు మీకళ్యాణముం జూడ స
త్ప్రేమన్ వచ్చుటఁ జేసి యుండఁగ మహాప్రేంగ్రైభరంబోర్వకీ
భూమీచక్రము గ్రుంగె నీవు సమతం బొందించి రక్షింపవే.

{ శివుఁడు భూసమత్వంబునకై యగస్త్యుని దక్షిణదిక్కునకుఁ బంపుట }

వ. అనవుడు సర్వేశ్వరుండు. 139

తరల.—

వరమునీశ్వర పద్మజాసనవర్ణనీయ మహాత్మునిన్
శరధు లెల్లను లీలఁ ద్రావిన చండకోపునిఁ గోటిభా
స్కరసమానవిభున్ ధరాసమసత్త్వఁ గుంభజుఁ బంపె సు
స్థిరతమై సమరమ్యదక్షిణదిక్కు ధారుణి చెచ్చెరన్. 140

వ. అంత. 141

మ. వెలయన్ శంభుఁడు శైలరాజపురికిన్ వేంచేసె సమ్మోకతో
నలి నవ్వేళఁ బురాంగనాజనము లానందంబుతో నందఱున్
జెలులుం దామును నుత్సవం బొదవఁగా శృంగారముం జేసి
తత్కలధౌతాచలనాథుఁ జూడ మదిలోఁ గాంక్షించి
యోర్తోర్తుతోన్. 142

—— అంగనాజనంబు లీశ్వరునిఁ జూడవచ్చుట ——

ఉ. కాలునిఁ గెల్చి లీలమెయిఁ గాముఁ బరాజితుఁ జేసి కొండరా
చూలికిఁ జిక్కి జూటమున చుక్కలరేని ధరించి జాణఁ డై
వేలుపుఁ బోటిమిండఁడఁ డొగి వేడుక వచ్చుచు నున్నవాఁడు నీ
లాలకలార రండు మనమారఁగఁ జూతము కోర్కి దీరఁగన్.

చ. పురహరుఁ జూడ రండు శివుఁ బూర్ణమనోరథుఁ జూడ
రండు నిర్జరనుతుఁ జూడ రండు నెఱజాణనిఁ జూడఁగ
రండు యిందుశేఖరు మదిఁ జూడ రండు విషకంధరుఁ
జూడఁగ రండు దేవశేఖరు శివుఁ జూడ రం డనుచుఁ గాంత
లనంతమనోరథంబులన్. 144

చ. కనకలతాసమూహములో తాఱుమెఱుంగులో కౌముదీ
ములో, మనసిజబాణజాలములో మన్మథ*రాజిత లక్ష్ములో
యనం, బనవగు మోహజాలములో చక్కనిచుక్కలో చంద్ర
రేఖలో, యనఁగఁ దలోదరుల్ త్రిభువనాభినవప్రభ లుల్ల
సిల్లఁగన్. 145

ఉ. బాలలు పూర్ణయౌవనలుఁ బ్రౌఢలు లోలలుఁ బుణ్యపణ్య
స్త్రీలాలక లంబుజాతవిమలానన లోలి నలంకరించుచో
వేలుపురేని దా వెలయ వీనులఁ బూజలు సేయుచాడ్పునన్
గ్రాలిన హేమపత్త్రములు గర్ణములం దిడి వచ్చె నొర్తు దాన్.

మ. తిరమై తుమ్మెదమొత్తముల్ కమలపంక్తిం గప్పు భావంబు
నన్, హరినీలాంచితమేఖలావళులు దా మందంద శిథిలం
బుగన్, హరుఁ జూడన్ బఱతెంచు వేగమునఁ బాదాంభోజ
యుగ్మంబులన్, బరఁగన్ బాఱుచు మ్రోల నేఁగిరి సతుల్
ఫాలాక్షు వీక్షింపఁగన్. 147

క. మృడుఁ జూచు లోచనంబులఁ
దొడరి మదాంధములనెల్లఁ దొలఁగఁగ నిడి తా

* ... ... రాజితరాజ్యలక్ష్ములో
మనసిజ మోహజాలములో చుక్కలో చక్కనిచంద్రరేఖలో.

వెడలించిన క్రియ నొక్కతె
కడకంటం బారఁ దీర్చెఁ గాటుకరేఖల్. 143

క. అత్తఱి నొక్కతె పదముల
లత్తుక మాత్రించి క్రొత్తలత్తుకతోన
చ్చొత్తిన కమలంబులగతి
జొత్తిల్లఁగ జంద్రమౌళిఁ జూడఁగ వచ్చెన్. 149

చ. అడుగుల నశ్వవేగ మిభయానకు నంచుఁ దెలంగుపోలికన్
గడుకొని పాదపద్మముల ఘల్లని యందెలు మ్రోయఁ జెచ్చె
రన్, తొడవులు వేడుకం దొడిగి తొయ్యలియొక్కతె పువ్వు
మాల క్రొమ్ముడిపయిఁ గానరాఁ జెదిరి ముందట వచ్చె
మహేశుఁ జూడఁగన్. 150

మ. పరమేశుం బరికించు సంభ్రమగతుల్ భావంబులో నొంత
యున్, స్థిరమై యొప్పినలోలతం గదియఁ దా శృంగారమున్
జేయఁగాఁ, గర మర్థిన్ మఱిపొంది యొంతయును శృంగా
రంబుగా వచ్చె సత్వరయై మోదముఁ బొంది యొక్కసతి
కైవల్యాధిపుం జూడఁగన్. 151

క. ఉడురాజధరల కెల్లను
దొడవయ్యెడు నాకుఁ దొడవుఁ దొడుగఁగ నేలా
తొడవులు దొడిగినఁ గొఱఁతని
యుడురాజోత్తమునిఁ జూడ నొక్కతె వచ్చెన్. 152

క. మారారికిఁ దిలకంబగు
తారాపతి గేలిసేయఁ దలఁచినభంగిన్
నీరజలోచన తిలకము
చారుగతిని గప్పూర మిడి సయ్యన వచ్చెన్. 153

సీ. పన్నీట మృగమదపంకంబు మేదించి
నిపుణత మైదీఁగె నిండ నలఁది
చతురలై కొప్పుల జడచొల్లెములు వెట్టి
లీలమైఁ బువ్వుమాలికలు చేర్చి
బహువస్త్రములు గట్టి పాలిండ్లకవలకు
నల్లల్లమాటుపయ్యెదలు దిగిచి
వివిధభూషణములు వెలవొప్ప ధరియించి
ఘనసారములఁ దిలకములు వెట్టి
ఆ. యఖిలభువనమోహనాకారములు గ్రాలఁ
బూర్ణచంద్రుఁబోలు మోము లమర
విశ్వనాథుఁ జూడ వేడుక దళుకొత్త
నంతనమునఁ బురముకాంతలెల్ల. 154

వ. ఇట్లు విలసితాలంకారంబున. 155

ఉ. చంచలనేత్రి దాను దనచన్నులఁ గన్నులు ముద్దుమో
ములుగా, బంచశరాపహారికిని భాతిగ నల్లనఁ జూపి చూడ్కి
నాటించెర నేర్పు లెల్లఁ బ్రకటించెద లోలత నన్ను డా
య రప్పించెద మన్మథుం గెలుచుబీర మణంచెద చూడు
బాలికా. 156

ఉ. ఒక్కటి చెప్పెదర్ వినుడు యొయ్యన రమ్ము లతాంగి నేఁడు
నా, చక్కదనంబు చూచి మదసామజచర్మధరుండు సోలి
దా, చిక్కునో చిక్కఁడో నిజము చెప్పుము నాకుఁ గురంగ
లోచనా, చిక్కినఁ జిక్కకున్న మఱి చెల్వలతో వినుపింప
కుండుమీ. 157

శా. లోలాక్షీ తగు నీదువిభ్రమము నాలోకించి కామార్థియై
వాలాయంబుగఁ జిక్కెఁ జంద్రధరుఁ డోవామేక్షణా
నేఁడు శ్రీశైలాద్రివిభుండు పొందు ఘనగంగావాహినీ
మౌళి నా, శూలిం గన్నియమాడ్కి లోఁబఱచు నంచున్
దారు గీర్తించుచున్. 158

వ. ఇట్లు బహుప్రకారంబులఁ దమలోఁ దొండొరులు నుపశ
మించుచు మన్మథాలాపంబులు పలుకుచున్న మన్మథోత్సాహ
మానసులై సంభ్రమంబున. 159

సీ. కుంభికుంభముఁ బోలు కుచకుంభభరమున
వెడవెడ నడుములు వీఁగియాడ
బాలేందుఁడునుబోలు ఫాలస్థలంబున
నీలకుంతలములు దూలుచుండఁ
జారుచక్రముఁ బోలు జఘనచక్రంబుల
నమరఁగట్టిన మేఖలములు వీడఁ
బంకజంబులఁబోలు పాదయుగ్మంబుల
వడివడి నడుఁగులు తడఁబడంగ

ఆ. గోపతీశుఁ జూచుకోర్కులు ముడివడఁ
జేడె లోకతోకర్తుఁ గూడఁ బోతి
యల్లవాఁడె వచ్చె నమరులతోఁ బంచ
వదనుఁ డల్లవాఁడె వాఁడె యనుచు. 160

మత్తకోకిల—

వేడుకం బురకన్యకల్ దమవీథులం బొడవైనయా
మేడమాడువు లెక్కి చూచుచు మేలిజాలకపంక్తులన్

గూడి చూచుచు శంభుఁ జూచుచు గోపవాహను నుతించుచుఁ
బాడుచుం దమలోన నిట్లని పల్కి రప్పుడు ప్రీతితోన. 161

సీ. కమలాక్షి యాతఁడే కళ్యాణమూర్తియై
సమ్మోదమునవచ్చు జాణమగఁడు
కామిని యాతఁడే ఘనజటావలిలోన
మిన్నేరుఁ దాఁచిన మిండగీఁడు
వెలఁదిరో యాతఁడే వెన్నెలపాపని
పువ్వుగాఁ దురిమినపుట్టుభోగి
మగువరో యాతఁడే మనగౌరి నలరింప
మాయపువటువైన మాయలాఁడు
ఆ. ఉత్తమాంగి యితఁడె విత్తేశుచెలికాఁడు
విమలనేత్రి యితఁడె వేల్పుతేఁడు
యిందువదన యితఁడె యిందిరకైలాస
కంధరుండు నీలకంధరుండు. 162

వ. అని మఱియు. 163

సీ. గోరాజగమనునిఁ గొనియాడువారును
శంభుపై సేసలు చల్లువారు
పరమేశు నాత్మలో భావించువారును
గిరిరాజునల్లు నగ్గించువారు
లోకైకనాథు నాలోకించువారును
శివదేవుకై కూర్మి సేయువారు
తరుణేందుధరుఁ గొందఁ దమకించువారును
మృడునకుఁ గేలెత్తి మ్రొక్కువారు

ఆ. భూధరేంద్రుఁ జాల భూషించువారును
పొరిఁడి సమరకోటిఁ జూచువారు
కొమరుమిగుల నీకుఁ గొనియాడువారును
మెలఁగిరప్పురంబు మెలఁత లెల్ల 164

— శివుండు పార్వతీసహితుఁడై మంగళస్నానాదుల చేయుట —

వ. ఇట్లు పరమేశ్వరుండు పురంబుఁ బ్రవేశించి యందుఁ దుహినాచలేంద్రుండు తనకు నియమించిన విడిదికి నెయ్యంబుతోడ నిట్లు వచ్చిన. 165

సీ. అతివలు కస్తూరి నలికించి ముత్యాల
ముగ్గులు దీరిచి ముదముతోడ
రత్నపీఠమునకు రాజాస్య మేనక
తోఁ బార్వతీదేవిఁ దోడి తెచ్చి
పసుపుటక్షింతలు పరఁగంగ దీవించి
పెట్టి వాద్యంబులు బొరసి మ్రోయ
తల్లి దలంటంగఁ దగు మజ్జనము లార్చి
యొప్పారఁ దడియొత్తు లోలిఁ దాల్చి
ఆ. బహుళ రత్నచయము బడిసి పొందుగ వైచి
పట్టుపుట్టములను గట్ట నిచ్చి
వేరఁటాండ్రు చూడ పెండ్లికుమారిఁ గై
సేయఁ దలఁచి గడగి చెలువు మిగుల. 166

ఆ. దేవిరూపమునకు దృష్టిదాఁకెడు నంచు
మాటుసేయుభంగి మణిసువర్ణ
పుష్పవస్త్రగంధముల నలంకారించి
రెలమితోడ గౌరి నిందుముఖులు. 167

వ. ఇట్లు శృంగారించి శైలవల్లభుపెండ్లింటిలోనికిం దోడి తెప్పించి రంత నప్పరమేశ్వరుం డంతం దనయున్న మందిరం బున శ్రౌతపుణ్యాహవాచనంబులు బ్రహ్మచేతం జేయించి వివాహకౌతూహలంబున. 168

ఉ. పొందుగ౦ బుష్పమేఘములు పుష్పలవానలు జల్లుజల్లుగా దుందుభికాహళధ్వనులు తూర్యరవంబులతో గణాధిపుల్ సందడిచేయ దేవతలు సంభ్రమతం జయపెట్ట బ్రహ్మగో[గన్. విందపురందరుల్ గదిసి వేడ్క గెలంకులయందుం గొల్వఁ

చ. చెలువ పులోమనందనయు శ్రీయు నరుంధతియుం సరస్వతీ లలనయుం బెక్కువస్తువులు లాలితవృత్తిం బసిండిపళ్లెరం బుల నమరించి దేవమునిపుణ్యవధూజనకోటితోడం గ్రం తలుగొని పాడుచుం నడువ ధన్యులు దిక్పతు లెల్లగొల్వం గన్. 170

క. వేదంబులు గీర్తింపంగ
నాదటసన్నునులు గొల్వ హర్షముతోడం
ఆదిగిరీంద్రునియింటికి
వేదాంతవిదుండు శివుండు వేంచేసె నొగిన్. 171

ఆ. వామదేవువైభవంబుతోడనె వైభ
వంబు మెఱసి యుప్పరంబు వెలసె
చందురుండు వొడమ నందంద ఘూర్ణిల్లు
పాలవెల్లిభంగిం బ్రజ్వరిల్లి. 172

వ. అమ్మహాదేవుండు తుహినాచలమందిరంబుం బ్రవేశించి నంది కేశ్వరుండు డిగ్గనవసరంబున నంతట సుందరీజనంబులు పసిండిపళ్లెరంబులతోడ మణిమరకతవజ్రవైడూర్య పుష్య

ాగ గోమేధిక నీలముక్తాఫలంబు లమరించి నివాళించి రంత. 173

క. ఎదురుగ సేసలు చల్లుచుఁ
బదపడి సింహాసనంబుపైఁ బరమేశుః
ముదమార నునిచి దేవర
పదకమలము లద్రిరాజా భక్తిం గడిగెన్. 174

క. మెఱయంగా మధుపర్కము
కఱకంఠుని కిచ్చి వెనుక కమనీయముగా
మఱఁ గట్టి నిచ్చి కన్యకు
మఱువుగఁ దెరవారఁ బంచె మహితాత్ముఁడై. 175

వ. ఇట్లు తెరవారంబంచిన. 176

క. కరుణాపాంగుఁడు శంభుఁడు
సురపతి కై దండఁ గొనుచు సురుచిరగతులఁ
దెరమ్రోల వచ్చి నిలిచెను
దెరమీఁదను గోటిచంద్రదీప్తులు వాఱన్. 177

క. ఇరువురు దమ రొండొరువుల
వరవదనాబ్జములు చూడ వాంఛితమతులై
తెర యొప్పుడు వాయునొ యని
పరికువ్వెళ్ళూరి రప్పుడు పతియుం బతియున్. 178

హిమవంతుఁడు కన్యాదానము చేయుట

క. తెర వాసినసమయంబునఁ
బరమేశ్వరుఁ జూడవమ్మ బాలిక యనుచుః
గిరిరాజు మంతనంబునఁ
దరళాక్షికి హైమవతికిఁ దా వినిపించెన్. 179

వ. అంత, 180

శా. కన్యాదానము చేసెఁ బర్వతుఁడు గంగామౌళికిన్ లగ్నమా
సన్నం బైన సురేంద్రమంత్రి కణఁకన్ సర్వంబు సంసిద్ధమై
చెన్నారం సుముహూర్తమున్నఁ దెరవాసెన్ మ్రోసె వాద్యం
బు ల,న్యోన్యస్యాలోకన మయ్యె దంపతుల కన్యోన్యానురాగం
బునన్. 181

క. దేవరపదపద్మంబులు
దేవియు మణిపూజ చేసె దృగ్దీప్తులచేఁ
దేవీవిలాస వననిధి
బావుగ నోలాడఁ జొచ్చె భవుచూడ్కుల దాన్. 182

శా. లీలన్ బార్వతి సేసలన్ శివునిమౌళిన్ బోసెఁదాఁ గోరికల్
కేలిం దోయిటఁ బట్టి శంకరునిపైఁ గీలించెనో నాఁగ న
వ్వేళన్ సత్కృప దోయిలించి సతిపై విశ్వేశ్వరుం డిచ్చె
నాఁ, బోలన్ శంభుఁడు ప్రాలుపోసెఁ దలపైఁ బూర్ణేందు
బింబాస్యకున్. 183

సీ. దేవాదిదేవుండు తెఱఁగొప్ప నంతలో
సతివామహస్తంబు చక్కఁ బట్టి
పెద్దింటిలోనుండి వెంపారఁగాఁ బెండ్లి
యరుఁగుమీఁదికి వచ్చి యర్థితోడ
బహురత్నపీఠంబుపై నొప్ప వెంచేసి
కమలజన్ముఁడు యాజకంబు సేయ
వేదోక్తవిధిని బ్రవేశహోమము చేసి
వెలుపటికన్య దాపలికిఁ దెచ్చి

ఆ. రెుునర*లాజకాదిహోమంబుఁ గావించి
మఱియుఁ దగినకృత్యముల నొనర్చి
సకలలోకభర్త శంభుండు ముదముతో
నచలవృత్తి నున్న యవసరమున. 184

—• బ్రహ్మాదులు నమస్కరించి మన్మథునివృత్తాంతముఁ దెల్పుట •—

క. దేవతలు మునులు బ్రహ్మయు
దేవేంద్రుఁడుగూడి మ్రొక్కి ధృతినవనతులై
భావజసంహరణ మహా
దేవా యవధారు దేవదేవ మహేశా! 185

సీ. ఈశాన మేమెల్ల యీమంగళము చూడ
భావించి రప్పించి పంచబాణుఁ
బుత్తేరఁగా వచ్చె భూశేశ మీమీద
నతఁడు భక్తుండు మీయడుగులాన
కాముచేసినతప్పు గౌరీశ మమ్మును
మన్నించి సైరించి మానితముగఁ
గంతునాకారంబు కలకంఠ కృపచేసి
యిమ్మని మ్రొక్కిన నీశ్వరుండు

ఆ. భక్తవత్సలుండు పార్వతికన్నియ
మోముచూడఁ బుట్టె కాముఁడంత
నాగధరుని పెండ్లి నాలుగుదినములు
ప్రీతితోడ నుండెఁ బెంపు మిగిలి. 186

వ. అయ్యవసరంబున. 187

---

* నాజయాది.

ఉ. అమ్మరుసాఁడు రేపు తుహినాచలనాథుఁడు కూతుఁ బార్వ
తిఁ గ్రమ్మని చేరఁ బిల్చి నిను రాజకళాధరు కిచ్చినట్టి భా
గ్యమ్ము ఘటించె నంచుఁ బులకల్ మెయి నిండఁగ నంత
బాష్పముల్ గ్రమ్మ శిరంబు మూర్కొనుచు గారతమై కురు
లెల్ల దువ్వుచున్. 188

—● పార్వతిని రజతశైలంబునకుఁ బంపుట ●—

సీ. కనుసన్న లాలించి కడునప్రమత్తవై
దేవేశుమనసు రాఁ దిరుగుమమ్మ
పంపకయుట మున్న భర్తచిత్తములోని
పను లెల్ల నాయితపఱుపు మమ్మ
యటువారు నిటువారు నయ్యెడుగడయును
విభుఁడుగాఁ జూచి సేవింపుమమ్మ
మున్నున్న భంగుల నేరూపములయందుఁ
గరళకంధరు కెడగాకుమమ్మ

ఆ. యాశ్రయించువారి నమ్మ రక్షించువిూ
యలర సత్తమాడ్కి గలిగిరేని
యప్పుగిఁపవచ్చు నతనికి నెవ్వరు
చెలువ లేరుగానఁ జెప్ప వలసె. 189

వ. అని యమ్మహీధరుండు. 190

సీ. కన్నియ నీరాజు గంధంబు బూయఁడు
మదనాంగ భస్మంబుమాకు లేదు
శృంగారి నీభర్త చీరలు గట్టఁడు
యిభదైత్యతోలు మాయింట లేదు

పాలఁతి నీనాథుండు పుష్పాలు ముడువఁడు
యింకొక్క క్రొన్నెల యింట లేదు
లేమ నీభర్త పళ్లెరమునఁ గుడువడు
విధికపాలమ్ము మావెంట లేదు
ఆ. గాన మనువుగడప గరళకంధరునకు
ధనము గొఱఁతయైనఁ దగినయట్టి
యుచితధనము లొసఁగకున్నచోఁ గన్నియ
జగము మెచ్చుగాదు తగవు గాదు. 191
వ. అని మహాదేవి కొడం బఱచి. 192
సీ. సన్నంబులుగఁ బెక్కువన్నెలచీరెలు
భూరి నానాహేమభూషణములు
మత్తగజంబులు నుత్తమాశ్వంబులు
సాతపత్రంబులు నందలములు
పురములు చామరంబులు పుష్పకంబులు
కొలఁకులు వనములు గోగణములు
ఖానీల్లుధనమును దాసీజనంబులు
మణిపీఠములు దివ్యమందిరములు
ఆ. పసఁగ పర్వతములు బహుపుణ్యభూములు
వలయునట్టి వివిధవస్తువులును
గరుణతోడ నపుడు గౌరీకుమారికి
సరణమిచ్చె యనిపె నచలవిభుఁడు. 193
వ. తత్సమయంబున, 194
శా. శ్రీకంఠుండు సదాశివుండు నియతిశ్రీశృంగారలోలుండు గౌ
రీకాంతాసహితంబు సమ్మదము పేర్మిం బోవ వేంచేసె సు

శ్రీకైలాసగిరీంద్రపర్వతమునకుఁ శ్రీకామినీనాథ వా
ణీకాంతాధిపముఖ్యులెల్లఁ గొలువన్ నిత్యోత్సవప్రీతితోన్.

క. వరదుఁడు శంభుం డల్లుఁడు
కరమర్థిం జేసినట్టి గౌరవమునకున్
గిరిరాజు ప్రీతుఁ డయ్యెను
పరువడి దేవతలు జనిరి పరిణామముతోన్. 196

శివుఁడు గౌరితో సుఖముగా నుండుట

ఉ. వేలుపుఱేఁడు శంకరుఁడు విశ్వవిభుండు గురుండు కొండరా
చూలియుఁ దానుఁ గూడి బహుసుందరలీలల వెండికొండపై
నోలుచు నుండె లోకములు సుస్థితిఁ బొందె ననేక కాలముల్
లాలితవృత్తితోడ సకలంకగతిన్ గడచెన్ ముదంబునన్. 197

వ. అని గౌరీదేవి వివాహోత్సవక్రమంబు తెలియం జెప్పిన విని వాయుదేవునకు నమ్మహాముని లిట్లనిరి. 198

క. నీలగళుం డనునామము
పాలాక్షున కెట్లు వచ్చె భర్గుఁడు కడిమిన్
హాలాహలవిషవహ్నుల
నేలా భక్షించె మాకు నేర్పడఁ జెపుమా. 199

వ. అనిన వాయుదేవుం డి ట్లనియె. 200

పార్వతి శంకరుని నీలగళకారణం బడుగుట

సీ. కలధౌతగిరిమీఁద గౌరికిఁ దోడఁ
తపనీయమయశిలాతలమునందుఁ
దొడలపైఁ దనమూర్తి తొయ్యలి నగజాత
నెక్కించుకొని గోష్ఠి నేర్పు మెఱసి

వేంచేసియున్న చో విశ్వేశువదనార
విందంబు తెఱఁగొప్ప వెలఁది చూచి
యోభూతనాయక యోగోపతిధ్వజ
కొమరారు నీకంఠకోణమందు

ఆ. నలతినలుపుకప్పు నిలువఁ గారణమేమి
నాకుఁ జెప్పుమనిన నవ్వి శివుఁడు
వనితకోర్కెఁ దీర్పఁ గలయుఁ బొమ్మని చెప్పెఁ
గొలువువారు వినఁగ మెలఁతతోడ. 201

వ. నాఁడేను పరమేశ్వరుకొలువున నున్న వాఁడఁ దన్నిమిత్తం బునఁ గొంత యెఱుంగుదు వినుండు విన్నవించెద నని మఱియు నమ్మహాదేవి మహాదేవున కిట్లనియె. 202

శా. కైలాసాచలవాస నీవు ధవళాకారుండ వై యుండఁ గాఁ
గాలాంభోధరదీప్తి మెచ్చక భుజంగభృంగసంకాశ మై
నీలచ్ఛాయ యిదేమి భంగిఁ బొడమెన్ నీకంఠకోణంబునన్
వాలాయంబుగ నాకుఁ జెప్పుము కృపన్ వాగీశసంపూజితా.

వ అనినఁ జంద్రశేఖరుం డిట్లనియె. 204

మ. పాలఁతీ తొల్లి సురాసురేంద్రులు సుధాంభోరాశిలో మం
దరాచలముం గవ్వము చేసి వాసుకిని బెల్పొం ద్రాడుఁగాఁ
దర్చెఁదా దనుజులు వర ఘోరవిషంబు పుట్టె నది హాహా యంచుఁ
గంఠస్థలిన్, నిలుపన్ లోకము నీలకంధరుఁ డనెన్ నీలాలకా
బాలికా. 205

వ. అని మఱియు నీప్రకారంబు సవిస్తారంబుగా నెఱింగించెద
వినుమని కాలకంధరుం డిట్లనియె. 206

క. శైలారియుఁ బావకుఁడును
గాలుఁడు దనుజేశ్వరుండుఁ గంథులరాజుఁ
గాలియుఁ గిన్నరవిభుఁడును
శూలియును ననేకకోటిసురసంఘంబుల్. 207

వ. తొల్లి మహాయుగంబున నప్రతిహతపరాక్రమగర్వదుర్వారులును అనేకసకలభువనరాజ్యధురంధరులును నిరంతరలక్ష్మీనివాసులు నై రొక్కనాఁడు మేరుధరణీధరశిఖరంబునఁ గొలువున్నసమయంబున లోకోపకారార్థంబుగా నమృతంబు వడయవలయు నని విచారించి పాలవెల్లిఁ దరువం దలంచి యమృతశరధిశయనుం డగుభుజంగశాయిపాలికిం జని వినతులై మహాత్మా మే మందఱము నొక్కప్రయత్నంబు సేయం గమకించినారము నీవు భూభారదక్షుండ వవధరింపు మని విన్నవించిరి. 208

క. అమృతంబుఁ బడయు వేడుక
నమృతాబ్ధి మథింపఁ దలఁచి యరుదెంచితి మో
యమృతాబ్ధిశయన *నీవును
మముఁ బనిగొనవలయు నయ్య మన్ననతోడన్. 209

వ. అని యివ్విధంబున దేవతలు పలుకఁ గమలామనోనాథుండు వారిపై దయాపూరితచిత్తుండై యి ట్లనియె. 210

సీ. సురలార మీకు భాసురలీల నమృతంబు
దొరకునుపాయంబు సరవి వినుఁడు
కరమర్థి దనుజులఁ గపటంపుసంధిగాఁ
జేసి వారును మీరు చెలువుతోడ

---

* పా. యమృతంబేరీతి దొరకునని పలికిన్

మందరాచలము సంభ్రమముతోఁ గొని వచ్చి
కవ్వంబుగాఁ జేసి కడిమి మీఱఁ
దాలిమితో శేషుఁ దరిత్రాడుగాఁ జుట్టి
సరసత్వమునఁ జాల జలధిఁ దరువఁ

ఆ. గలిగినట్టితాల్మి గలిగినమీకెల్ల
నమృత మబ్బు వేగ నర్థి దాని
వలన ముదిమి చావు కలుగదు సేవింపఁ
గాన వేగఁ జేయఁ గడఁగుఁ డింక. 211

వ. అని బుద్ధికరపిన వారలు నిజనివాసంబులకుఁ జనుదెంచి యారాత్రి సుఖంబుండి మఱునాఁడు సురేంద్రుండు సకల దివ్యులు దన్నుఁ బరివేష్టించియుండఁ జింతామణిదివ్య సింహాసనంబున నుండి తత్సమయంబున వాచస్పతిం గనుం గొని యి ట్లనియె. 212

క. హరి యానతిచ్చె నమృతము
దొరకు నుపాయంబుఁ గడిమితోఁ జని రాత్రిం
చరవరులఁ బొందుపఱుపుచు
నిరవుగఁ గొనిరండు మీర లిప్పుడు వారిన్. 213

వ. అని పలికిన నగుంగాకయని సురగురుండు దైత్యులపాలికిం జని హరివచనంబుల వినిపించి వారలం దోడ్కొని వచ్చిన దేవనాథుండు పూర్వదేవతాసహితుండై మధుసూదనుండు తోడరా మందరనగేంద్రంబుకడకుం జని యమ్మహాశైలంబుఁ బెకలించి మూపులం దాల్చి సంభ్రమాయత్తచిత్తులై పవన వేగంబునఁ జనుచుండఁ బాదఘట్టనంబులం గులపర్వతంబులు కందుకంబులంబోలి తూలి యాడుచున్నసమయంబున. 214

శా. జంభారాతి దిగీశులున్ దనుజులున్ శైలంబుమూలంబులన్
శుంభిల్లీలల మోవలేమిఁ గని దానూఁదేర్ భుజాగ్రంబునన్
అంభోజాక్షుఁడు పట్టి వైచెఁ జలనంబై కుంభనాదంబుతో
నంభోరాశిజలంబు మిన్నడువ నయ్యంభోధి నుజ్జృంభుఁడై.

వ. ఉపేంద్రా యీప్రకారంబున మహార్ణవంబు డగ్గరి తరవ వచ్చు దీనికిం జేరును గుదురును గవ్వంబును నేమి గావలయు నానతిచ్చి రక్షింపు మని పలికిన నయ్యిందిరావల్లభుం డిట్లనియె. 216

చ. గొనకొని మీకు నంబుధికిఁ గుంభినికిం గుదురై వసించెదన్
ఘనతరమందరాచలముఁ గవ్వము చేసెద నెత్తి తెచ్చెదన్
వననిధిలోన నిల్పెదను వాసుకిఁ జేరుగఁ జేసి తెచ్చెదన్
వినుఁ డమృతంబు గాంచెదను వేలుపులార భవత్సహాయినై.

వ. అని పలికి మఱియు నమ్మహాత్ముండు దేవేంద్రదండధర వరుణ కుబేరప్రముఖు లగు దిక్పాలకులును దనుజభుజంగకిన్నరకింపురుష గరుడగంధర్వనాయకసమూహంబులును నపరిమిత భుజబలపరాక్రమవంతులును ననేకదేవజనంబులును నుద్దండ సాహసులును శరధిమథనసాహసులై తన్నుఁ బరివేష్టించి కొలిచి నడువం జను దెంచి యల్లకల్లోలమాలికారావ నిరంతరబధిరీభూత దిగంతరాళంబును మకరకమఠకర్కటక కుండూకతిమితిమింగిలాది జలచరావాసంబును క్రౌంచ కాదంబకారండవకర్కశ సారసచక్రవాకాదివిహంగనివాసంబును అకాలకుసుమఫలభరితనానాతరులతావిరాజిత వేలాయుతంబును సనకసనందనాది మునీంద్రసంచారణంబును ననంతగంభీరంబును నఖిలరత్నసముదయ జనదేశంబును

జలజనయనశయనస్థానంబును నమృతజలమయంబును నై
పై కుంఠపురసమీపంబున నొప్పుచున్న క్షీరార్ణవంబుఁ జొడ
గని డాయనేఁగి సంభ్రమంబున. 218

## క్షీరసాగరమథనము

శా. అంభోజప్రభవాండముల్ దిరిగి పాఱఁ గ్రుంగి ఘూర్ణిల్లఁ
బ్రారంభం బొప్పఁగ మందరాద్రి నెతెవారక్షీక మై నత్తి
య్యంభోజాక్షుఁడు పట్టి పై చె చలితం బై కుంభనాదం
బుతో, నంభోరాశియు భ్రామించు న్నడల నయ్యంభోధి
నుజ్జృంభుఁ డై. 219

వ. ఇవ్విధంబున ననంతసుందరం బగుమహార్ణవమథ్యంబున
మందరగిరి కవ్వం బై తిరుగ నియమించి ధరణీధరము నడుగు
వలయంబునకుఁ గమఠపతిఁ గుదురుగా నియమించి వాసుకి
మహానాగంబును దరువం జేరుఁ గావించి పంచబాణజన
కుండు సురాసురుల నవలోకించి యి ట్లనియె. 220

చ. పలువురు గూడి మీర లతిబాహుబలాఢ్యుల మంచు నెప్పు
డుఁ, దలయుచుఁ బోరుచుందురు మందరశైలముఁ ద్రిప్పి
మీభుజా, బలములు నేఁడు చూపుఁ డని పంచిన వాసుకిఁ జేరి
దానవుల్, తలయును దోఁక నిర్జరులు దద్దయు నుగ్రతఁ బట్టి
రత్తఱిన్. 221

వ. ఇవ్విధంబున. 222

మ. ఉరగేంద్రుండు విషంబుఁ గ్రక్కుచు రయమై యొండొండ ఘూ
ర్ణిల్లుచుఁ, ధరణీచక్రము దిర్దిరం దిరుగ భూతవ్రాతముల్
భీతిలఁ, బొరి నంభోనిధి గుబ్బుగుబ్బు రనుచుఁ బొర్కల్లఁ

దేవాసురుల్, కరశాఖోద్ధృతిఁ దేర్చి ద్రచ్చిరి సుధాకల్లోలినీ
వల్లభున్. 223

వ. మఱియు నిలింపదనుజసమూహయంబులు తమతమబాహా బలంబులు మెచ్చక మత్సరంబునఁ బెన్నుద్దులై నింగిముట్ట నార్చుచు హుంకారంబున బింకంబులం బలుకుచు ననంత పరాక్రములై తనర్చు నిష్కర్షంబునఁ దరువ మందరాచలంబు దిర్దిరం దిరుగుడుపడి యమ్మహార్ణవంబు జలంబు లన్నియు దిగంతంబులఁ జెదరి భూతలంబులం బగులఁ జేయం జాలిన ఘుమఘుమారావంబులతో వెలినురుఁగు లెగయ మహోద్ధృతంబున నాలోలకల్లోలంబై నిఖిలజలచరసందోహంబుతో వలయాకారంబుఁ గొని తిరుగుపడిన నయ్యవసరంబున నఖిల భువనక్షోభంబై నఁ జరాచరజంతుజాలంబులు దొరలుచుండె నవ్విధంబున. 224

క్షీరాబ్ధిని హాలాహలము బుట్టుట

ఉ. కెట్టిమగల్ సుధాంబునిధిఁ జేరి మథింపగ నందుఁ జంద్రుఁ
డుం, బుట్టకమున్న లక్ష్మియును బుట్టకమున్న సుధాజలం
బునుం, బుట్టకముందటన్ నిఖిలభూతభయంకరమై సురా
సురుల్, పట్టిన చేతులు న్విడిచి పాఱఁగఁ బుట్టె విషాగ్నికీల
ముల్. 225

వ. మఱియును విలయసమయంబున జలధరానేకనిర్ఘాతగంభీర ఘోషణంబులుంబోలె గుభులుగుభుల్లనునాదంబుల బ్రహ్మాండంబులన్నియు నదరి బగడి తిరిగి పరస్పరనినాదంబు చెలంగి చరాచరజంతుజాలంబులు ప్రళయకాలంబు గదిసెనో యని నిలచినవిధంబున డెందంబులు భయంబునం దల్లడిల్లి మూర్ఛిల్లి

రయంబోంటి పయింబడి కూలంబుఁబోవ సకలసాగరవలయితం
బగు వసుంధరావలయంబు గ్రుంగి భుజంగపతిపయిం బడ
భుజంగపతియును గమఠపతిపయింబడఁ బ్రళయకాలా
గ్నియుం బోలె సకలభూతక్షయంకరం బై నిటలనయ
నాగ్నియుంబోలె మహోష్ణతిసందోహం బై బడబాగ్ని
యుంబోలె నిష్ఠురంబై ప్రళయకాలభద్ర బడబానలంబులు
సంబంధులై కూడి వరించుచందంబున నందంబై యందంద
బృందారకబృందంబులు హాహాకారంబులతో మందరవల
యితం బగు నాగంబు విడిచి కులశైలకుహాంతరాళంబులఁ
బడి పరుగులిడ వెను తగిలి గిరులును తరులును నదులును
సాగరంబులు పురంబులు కాల్చుచుఁ గోలాహలంబు సేయు
సమయంబున, 226

ఆ. కమలలోచనుండు కమలాధినాథుండు
వనధి డాసియున్న వాఁడు గాన
కాలకూటవహ్ని గదిసి సోఁకిన రక్త
వర్ణుఁ డంత నీలవర్ణుఁ డయ్యె. 227

క. అంత సురాసురనాథులు
సంతాపము నొంది బ్రహ్మసన్నిధికి భయ
భ్రాంతు లయి పోయి వాణీ
కాంతునిఁ జూడఁ గాంచి దీనగతి నవమతు లై. 228

### దేవతలు బ్రహ్మను వేఁడుట

వ. ఇట్లు విన్నవించిరి. 229

శా. దుగ్ధాంభోనిధి కాయి దోడుగ భుజాదుర్వారదర్పోన్నతిఁ
దుగ్ధాంభోధి మథించుచో విషశిఖల్ తోరంబులై పుట్టి ని

ర్దగ్ధుగా జేసి రమేశ్వరుగా వెరుకొన్న దైత్యాసురశ్రేణి సం
దిగ్ధం బయ్యె జగంబు లింక నణఁచుగా దెల్లంబు వాణీపతీ.

వ. అనిన బ్రహ్మదేవుం డి ట్లనియెను. 231

మ. ఇది నాచేత నణంగ నేరదు వినుం డీరేడులోకంబులన్
త్రిదశుం డెవ్వఁడు వాఁడు దీని నణఁచున్ దేవాసురవ్రాతమూ
త్రిదశారాధ్యుని భక్తవత్సలు మహాదేవున్ శివుం గాంచియా
పిదపన్ రండని బ్రహ్మయొయ్యనగన్ బృందారక వ్రాతమున్.

వ. కైలాసకంధరంబునకు నరిగి వార లందఱు నమ్మహేశ్వరుం
గాంచి సాష్టాంగదండప్రణామంబులు గావించి వినయంబునఁ
గరకమలంబులు నిటలతటంబులం గదియించి యి ట్లని
విన్నవించిరి. 233

**శంకరుని దేవతలు స్తుతించుట**

క. అవధారు చంద్రశేఖర
యవధారు గజేంద్రదానవాంతకమూర్తీ
యవధారు భువననాయక
యవధా రొకవిన్నపంబు నాలింపఁగదే. 234

చ. ఎఱుఁగక మేము మందరమహీధ్రముఁ గవ్వము చేసి వాసుకిన్
నెరయఁగఁ జేరు చేసి మఱి నీరధి నీరజనాభుఁ గూడి యం
దఱమును ద్రచ్చుచో నొకయుదగ్రవిషాగ్ని జనించె
లోకముల్, దరికొని కాల్పఁగాఁ దొడఁగె దాని నడంచి
మహేశ కావవే. 235

ఉ. కాయజసంహారాయ శశిఖండధరాయ నమశ్శివాయ కా
లాయ హరాయ భీషణబలాయ కపాలధరాయ దేవదే

హాయ యమాంతకాయ దృఢవజ్రపినాకత్రిశూలదండహ
స్తాయ మునీంద్రయోగివరదాయ సురాధిపతే! నమోస్తుతే.

ఉ. ఆయతమంగళాయ భుజగాధిపరమ్యకరాయ రోహిణీ
నాయకభానువహ్నినయనాయ మహేశ్వర బ్రహ్మవిష్ణురూ
పాయ పురాంతకాయ పరిపంథిసురారిహరాయ సాంఖ్యయో
గాయ త్రిలోచనాయసుభగాయ శివాయనమోనమోస్తుతే.

ఉ. కారణకారణాయ భుజగర్వమదాంధకసంహరాయ సం
సారమహార్ణవజ్వలితచండ మహోదహనాయ దేవతా
స్ఫారకిరీటకూటమణిబంధురపాదపయోరుహాయ యోం
కారమయాయ భక్తజనకల్పకుజాయ నమో నమోస్తుతే.

మ. ఋతుసంవత్సరమాసపక్షజనితారూఢాయ నానాధ్వర
వ్రతరూపాయ రవీందుయజ్వజలభూవైశ్వానరవ్యోమమా
రుతరూపాయ శిఖండకధ్వజయశోరూపాయయోగీశ్వర [ణే.
స్తుతరూపాయ నమో నమో శివ నమోసోమార్ధచూడామ

క. వ్యక్తము లై నీగుణములు
భక్తులకుం గానవచ్చు భవమతులకు న
వ్యక్తం బై చరియించును
భక్తజనాధార యభవ భయసంహారా. 240

క. భావించి జగము లన్నియుఁ
గావింపఁగ వాని నన్ని ఖండింపఁగ బ్ర
హ్మా విష్ణుమహేశ్వరు లన
నీవై తివి కాదె దేవ నిఖిలాధిపతీ. 241

క. చింతింపరాదు నీక్రియఁ
జింతింపఁగ రాదు నీవు చేసినపనులం

చింతింపరాదు భక్తుల
చింత్యాచింత్యములు రుద్ర శ్రీగౌరీశా. 242

క. నిత్యము నీగంభీరత
నిత్యము కరుణాబ్ధి యైననీచిత్తంబుల్
నిత్యము నీకృత్యంబులు
నిత్యము నిను గొలువనిమ్ము నిర్మలమూర్తీ. 243

క. వదలక సమయములాడుచు
చదువులునాలుగును గూడి సంతతనియతిన్
వెదకియుఁ బొడఁగన నేరవు
పదపడి నినుఁ బొగడవశమె ప్రమథాధిపతీ. 244

క. నింగియు నేలయుఁ దాఁకై
పొంగినహాలాహలంబు బోరిమూర్చి రహిన్
వెంగలుల మమ్ముఁ గావుము
గంగారంగత్తరంగ కలితజటాంగా. 245

వ. అని మఱియు ననేకప్రకారంబుల నుపేంద్ర దేవేంద్ర భారతీంద్ర ప్రముఖు లైనదేవగణంబులు ననన్యశరణంబు లై వేఁడినం గనుంగొని కరుణాయత్తచిత్తుండ నై యి ట్లంటి.

ఉ. ఎప్పుడు మీరు నేఁ గలుగ నేల తలంక దిగంతరాళముల్
గప్పిన యాహాలాహలము గర్వ మడంచి ధరిత్రి మించి యే
నొప్పు వహింతు నేఁడు దివిజోత్తములార భయంబు
మానుఁ డీ, చొప్పున నెన్నఁ డైన మిముఁ జెందినయాపద
బాపి కాచెదన్. 247

—— ఈశ్వరుఁడు హాలాహలమును మ్రింగుట ——

వ. అని పలికి సకలదేవతాసమేతుండనై యేఁగుదెంచి తదవస రంబున. 248

సీ. ప్రళయకాలమునాఁటి భానుమండలముల
వెలుఁగులపాడిఁబోలె వెల్లివెల్లి
విలయాగ్నియును బోలి విస్ఫురత్కణముల
గగనంబు నేలయుఁ గప్పి కప్పి
కాలాగ్నిరుద్రునిఫాలాగ్నియును బోలెఁ
గడునసమోగ్రార్చులఁ గ్రాలి క్రాలి
బడబాగ్నియునుబోలె జడధులు దరికొని
కడుభయంకరవృత్తిఁ గ్రాచి గ్రాచి

ఆ. వెన్నుఁడాదిగాఁగ వేల్పుల నెల్లను
నల్లఁ జేసి తరులు నదులు గిరులు
జీవులనక కాల్చుశితహాలాహలమును
వహ్నిఁ గాంచి కోపవహ్నితోడ. 249

వ. మఱియు నత్యంతవిజృంభిత సంరంభమానసుండనై కరా ళించి హాలాహలకీలంబుఁ గనుంగొని యెదురుకొని గొంగి లింపఁ గలయుచందంబున రోమములు ముడివడ నైదు ముఖం బుల నగణితంబులై భుగులు భుగుల్లనిమంటలు మిడుఁగురులు నెగయ సర్వాంగంబులు గుడుసువడ భుజాదండంబులు చాచి బ్రహ్మాండంబులు లోనుగాఁ గల మదీయదివ్యాకారంబు విడంబించి దుర్నిరీక్షం బై వెలుంగుచున్న కాలకూటంబు నీక్షించి నిలునిలు పోకుపోకు మని యదల్చుచు సముచిత

శీతలాలోకనంబుల నతిశీతలంబుఁ గావించి త్రిజగద్భయంక
రంబుగా హుంకరించిన సమయంబున. 250

ఉ. ఎల్లసురేంద్రులుఁ బొగడ నెంతయుఁ దేజము దూలి
పోయి నా, చల్లనిమూర్తి జల్లనఁగ సత్వరతం జనుదెంచి
నూత్నసంఫుల్లసరోజపత్రమును బోలి మదీయకరాంబు
జంబుపై, నల్లన వచ్చి నిల్చె విష మప్పుడు నేరెడుపండు
నాకృతిన్. 251

వ. ఇట్లు నిలచినవిషానలంబుఁ గనుంగొని. 252

క. జలరుహగర్భుఁడు మొదలుగఁ
గలదేవత లెల్ల మ్రొక్కఁ గడునద్భుతమై
వెలిఁగెడు తద్విషవహ్నుల
గళమున నే నిలుపుకొంటిఁ గంజాతముఖీ. 253

వ. ఇట్లు గరళభక్షణంబు చేసినసమయంబున సకలలోకంబుల
వారును జయజయశబ్దంబుల నతిబల త్రిజగదభినవ భుజ
బలాభిరామ అహోబల బ్రహ్మవిష్ణుమహేశ్వరరూప అహో
బలసోమసూర్యాగ్నినేత్ర అహోబలసకలబ్రహ్మాండనాటక
తంత్రావధాన అహోబలదేవాదిదేవ యని కీర్తించుచు
నూర్ధ్వబాహులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి
సంభ్రమంబును సంతసంబును నాశ్చర్యంబును భయంబును
భక్తియు సందడింప నిట్లని స్తుతియింపఁ దొడంగిరి. 254

క. శరణము వేఁడిన మమ్మును
గరుణ రక్షించి విషము గ్రహియించుటయుం
గర మాశ్చర్యము చేసెను
శరణాగతపారిజాత సర్వజ్ఞనిధీ. 255

క. భక్తుల నుపలాలింపఁగ
భక్తులనిగ్రహములెల్ల భంజింప దయన్
భక్తజనపారిజాతా
భక్తజనాధార నీకుఁ బరఁగు మహేశా. 256

క. దిక్కులు నేలయు నింగియుఁ
జుక్కలు ననలుండు హరియు సూర్యుఁడు యముఁడున్
చుక్కలరాయఁడు పవనుఁడు
నిక్కువముగ నీవె కావె నిర్మలమూర్తీ. 257

క. యుగములు సంధ్యలు రాత్రులు
జగములు ఋతువులును నెలలు సంవత్సరముల్
నగములు దరువులు దినములు
పగళ్లు పక్షములు నీవె బాలేందుధరా. 258

క. వేదాంతనిమిత్తంబులు
వేదంబులు ధర్మములును విమలాత్మకముల్
వాదంబులు తంత్రంబులు
మోదంబులు నీవె కావె మునిరాజనుతా. 259

క. కలిమియు లేమియు బుద్ధియు
బలునీతులు శూరగుణము భాగ్యంబును బం
ధులు దానంబులు దాతయుఁ
దలిదండ్రులు నీవెకాద తరుణేందుధరా. 260

వ. మహాత్మా నిన్ను వేఱువేఱ నెన్న నేల సకలభూతాంత ర్యామి వని వినంబడుచుండు వేదంబులవలన నీమహిమ కొలఁది వినుతిసేయ వశమే పరమేశ్వరా పరమభట్టారకా సచ్చిదానందస్వరూపా యని బహుప్రకారంబుల వర్ణించు

చున్న కమలసంభవప్రముఖులైనదేవగణంబులం జరింప నియోగించి నాఁటఁగోలె సమస్తజగత్పరిపాలనంబు సేయు చున్నవాఁడ నని మఱియు నమ్మహాదేవుం డిట్లనియె. 261

క. గరళము మ్రింగినకతమున
గరళగళుం డండ్రు జనులు గజపతిగమనా
గరళము మ్రింగినచందము
తరుణీ వినుపింపవలసెఁ దద్దయు నీకున్. 262

సీ. కరమొప్ప నీనీలకంఠస్తవంబులో
నబల యేకశ్లోక మైనఁ జాలుఁ
గరమొప్ప నీనీలకంఠస్తవంబులో
నబల యర్ధశ్లోక మైనఁ జాలుఁ
గరమొప్ప నీనీలకంఠస్తవంబులో
నబల పాదశ్లోక మైనఁ జాలుఁ
గరమొప్ప నీనీలకంఠస్తవంబులో
నబల కించిన్మాత్ర మైనఁ జాలుఁ
ఆ. విమలభక్తితోడ వినినఁ బఠించిన
సజ్జనుండు సకలసంపదలును
గలిగి భవము లేక కైలాసవాసుఁ డై
నన్నుఁ జేరియుండు నలిననేత్ర. 263

వ. అని మహాదేవుండు దేవికిం జెప్పె నని చెప్పి తదనంతరంబ.

మత్తకోకిల.—

నాగవాహనరంజనా మదనాగవిద్విషభంజనా
నాగదానవఖండనా మునినాథ సాగరమండనా

యోగిరాజసమానచిత్తసరోజషట్పదవేషణా
నాగభూషితభూషణా శరణాగతామరపోషణా. 265

క. శ్రీనీలరుచిరకంధర
మానితత్రిపురాంబురాశిమందర గౌరీ
పీనపయోధరయుగళ
స్థానపరీరంభమోదసంరంభ శివా. 266

మాలినీ—

కమలనయనబాణా ప్రస్ఫురత్పంచబాణా (?)
యమితగుణకలాపా యచ్యుతానందరూపా
విమలకమలనేత్రా విశ్వతంత్రైకసూత్రా
ప్రమథనుతగభీరా పార్వతీచిత్తచోరా. 267

గద్య. ఇది శ్రీ మన్మహేశ్వర యివటూరి సోమనారాధ్య దివ్య శ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్త్ర పోతయనామధేయ ప్రణీతం బైన శ్రీవీరభద్రవిజయం బనుమహాపురాణ కథ యందు మహాదేవుపంపున మునులు పోయి ముద్రారోపణంబుచేసి వచ్చుటయు హరి విరించ్యాది బృందారకసేవితుం డై యీశ్వరుండు వివాహంబునకుం జనుటయు హిమనగేంద్రనిమహోత్సవంబున భూమి క్రుంగిన శంభుపంపునఁ గుంభజుం డరిగిన నత్యంతసమతలం బై యుండుటయును గౌరీవివాహంబును భవానీశంకరసంవాదంబును దేవదానవోద్యోగంబును కాలకూటసంభవంబును దానిఁ బరమేశ్వరుండు పరహితార్థం బై యుపసంహరించి నీలకంఠుండ నైతి నని యానతిచ్చుటయు నన్నది తృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# వీ ర భ ద్ర వి జ య ము

## చ తు ర్థా శ్వా స ము



రమణీయవీర సరసీగణరంజితసోమ వాసవాం
భోరుహసంభవప్రముఖభూరినిలింపభుజాబలప్రతా
పోరుమహాంధకారపటలోగ్రవిఖండనచండభానుగం
భీరగుణాభిరామ రణభీమ వినిర్జితకామ శంకరా. 1

వ. పరమజ్ఞానభావుం డగువాయుదేవుం డమ్మహామునులతో మీ రడిగినయర్థంబు లెల్ల సవిస్తారంబుగా నెఱింగించితి. మునీంద్రులారా వీరభద్రేశ్వరుని విజయప్రకారంబు నిజంబు వర్ణింప బ్రహ్మదేవునకు నలవిగా దైనను నాకుం దోఁచినవిధంబున విన్నవించెద వినుం డని యి ట్లనియె. 2

క. మఱి వైవస్వతమన్వం
తరమున నొకకాలమందు దక్షుఁ డదక్షుం
డురుతరపాపవిచక్షుఁడు
పరఁగఁగ జన్మించె ఘోరపాపాత్మకుఁ డై. 3

క. ప్రాలేయాచలమందున
వేలుపులకు నేకతంబ విహరించుటకుఁ

మేలైనచోట భూమికి
వ్రాలిన యాకాశగంగ వచ్చినచోటన్. 4

క. శివకరమై యుండెడుచో
శివదేవుని వేఁడుచేసి శివకల్మషుఁడై
దివిజులఁ బిలువం దొడఁగెను
నవహితమతి నశ్వమేధయాగము సేయన్. 5

వ. అంత. 6

సీ. అమరేంద్ర పావకయమదానవాధీశ
వరుణాదినిఖిలదిగ్వల్లభులను
మార్తాండ మృగధరమంగళబుధగురు
మందాది గ్రహరాజమండలంబు
కౌశిక గౌతమ కణ్వ మార్కండేయ
కాత్రి వసిష్ఠాదు లైనమునులు
క్రతుకమలోద్భవ కశ్యపాంగిరస
పులహ పులస్త్యాది జలజభవులు

ఆ. అచ్యుతాదిదేవతానాయకులు యక్ష
సాధ్యసిద్ధవసు భుజంగ రుద్ర
గణము లాదిగాఁగఁ గల్గువారందఱు
దక్షుమఖము చూడఁ దగిలి చనిరి. 7

వ. ఇట్లు సకలదేవతలును జనుదెంచిన వారల నుచితోప
చారంబుల సంభావించి పూజించి దక్షుండు మఖంబుం జేయం
దొడంగ నయ్యవసరంబున. 8

చ. చెలువుగ వచ్చి వేదములు చెప్పినతావుల నున్న నిర్జరుల్
బలసి మఖంబులోపలను భాగము లియ్య భుజింపఁ గోరుచో

మలహరురాముఁ డా నెఱిఁగి మాన్యులఁ దత్సభవారిఁ జూచి
నిశ్చలతరవాక్యదోషతమచండమరీచి దధీచి యి ట్లనున్. 9

క. పూజింపఁ దగినవారల
పూజింపక నేర్పు మాలి పూజన లిచ్చెన్
పూజింపఁ దగనివారికి
నీజగమున నింత బుద్ధిహీనుఁడు గలఁడే. 10

క. ఇది దుష్కృత మని యెఱుఁగఁడు
ఇది మిక్కిలి నింద్య మగుట యెంతయు నెఱుఁగం
డిది*గడవ దనుచు నెఱుఁగఁడు
ఇది యేలనో శంభుఁ బిల్వఁ డితఁ డెబ్భంగిన్. 11

క. పొడవులు తానై పొదలిన
పొడవగు పరమేశు మఱచి పోరిఁ బాపములన్
బోడవై జీవచ్ఛవముల
పొడవుగఁ బూజించు వెఱ్ఱి భూమిం గలఁడే. 12

ఆ. యాగకర్త లేనియాగంబు చెల్లునే
కలయ నంగ మెల్లఁగలిగి యున్న
శిరములేని తనువు చెలరేఁగి యాడునే
పొలయుఁ గాక నేలఁ గలయుఁ గాక. 13

వ. అనిన విని యతండు తదీయాలాపంబులు కర్ణవశంబునఁ దన మనంబుచొరక శూలంబులై తాఁకిన నదరిపడి సదస్యుల నాలోకించి మహాత్ములారా భవదాగమనకారణంబునఁ గృతార్థుండ నైతి నని పలికి పూజించి పిలువఁ దొడంగి నాఁ

---

* కడుఁ గీడని యెఱుఁగఁడు.

డితఁడు శంకరదేవుఁడు లేసిజన్నము నెయ్యెడలఁ గలదే
వేదములారా యని మఱియును. 14

క. మొదలుండ నచటఁ బోయక
తుదిగొమ్మలు నీటఁ దడుపఁ దుద నిష్ఫలమై
పొదలుంగా కది ప్రబలునె
పదపడి శివరహితమైన ఫలమును గలదె. 15

చ. చెలువుగ సర్వదైవములఁ జేసినదైవము నాదిదైవముం
బిలువక నన్యదైవములఁ బిల్చియుఁ బూజస చేసిజన్నముల్
సలుపఁ దొడంగినాఁ డితఁడు శంకరదేవుఁడు లేనిజన్నముల్
దలఁపఁగ నెయ్యెడం గలదె తథ్యము వేదములారఁజూడరే.

వ. అని పుణ్యాచతుం డగుదధీచి పాపచతుం డగుదతున కి
ట్లనియె. 17

—దధీచి దతుని మందలించుట—

శా. ఓయీ దక్ష యిదేమి యీతెఱఁగు దానూహింప లోకంబు
లో, నేయాచారము యొట్టిధర్మచరితం బేవేదమార్గం బకో
వయాచారము యొట్టిధర్మచరితం బేవేద మున్దైనసే [మా.
ధీయుక్తిం బరమేశుఁ బిల్వఁ దగదో తెల్లంబుగాఁ జూడు

ఉ. దేవరకన్నులై వెలుఁగుధీరులఁ బావకసూర్యచంద్రులన్
దేవరలెంకలౌ మునుల దేవరభృత్యులఁ గేశవాదులన్
దేవత లాదిగాఁ బిలిచి దేవపితామహుఁ బ్రా...
దేవుని బిల్వఁగాఁ దగదె దివ్య...

ఉ. భీమయదేవు నొండొరులు బిల్వ నెఱుంగరు గాక ఋగ్యజు
స్సామయథర్వణాది శ్రుతిసంఘములొక్కఁ బఠికించినాఁడ వీ
భూమిఁ దలంపఁగాఁ దగినప్రోడవు నీవు శివుండు రామికి

నీమది౯ జూడుమూ ఫలము నిష్ఫల మొందునో నిన్నుఁ
జెందునో. 20

వ. అనవుడు దక్షుం డతులితకోపాతురుం డై యి ట్లనియె. 21

క. రుద్రుం డంచును నీవొక
రుద్రుని జెప్పెదవు గాక రుద్రాక్షధరుల్
భద్రతనేగురు సార్గురు
రుద్రులు గల రింక నొక్కరుద్రుని నెఱుఁగన్. 22

మ. అదె మాయాగమునందు దేవతలు నయ్యంభోజనాభుండు
నుం, ద్రిదశేంద్రుండును నున్న వారు గడు సంప్రీతిం దగ
న్మంగళ,ప్రద మొంద న్విధిమంత్రపూజితహవిర్భాగంబు
లేనిచ్చెద, న్వేదితం బై శ్రుతిపూర్వమై తనరఁ గావింతుఁ
ముఖం బున్నతిన్. 23

వ. అనవుడు దధీచి దక్షున కి ట్లనియె. 24

క. ఈవిష్ణుం డీబ్రహ్మయు
నీవిబుధేశ్వరులు మఱియు నీరుద్రులు నే
దేవేశువలనఁ బుట్టిరి
భావింపఁగ వీర వీవు పాపవిచారా. 25

సీ. పరఁగ నేదేవుండు ప్రళయకాలంబున
నెందఱుబ్రహ్మల యేపు మాపె
వెలయ నే దేవుండు విలయావసరమున
నెందఱువిష్ణుల యేపు మాపె
జడియకే దేవుండు సంహారవేళల
నెందఱునింద్రుల యేపు మాపె

వరయంగ నీదేవుఁ డంత్యకాలములోన
నెందఱురుద్రుల యేపు మాపె

ఆ. నట్టిదేవదేవు నభవు నవ్యయాత్ము నీశుఁ
గమలజాండనాథు గౌరినాథు
నిఖిలలోకనాథు నిందింపఁగా రాదు
పాతకంబు దక్ష పాపచిత్త. 26

క. మూఁడేసికండ్లు కలిగిన
పోడిమితో రుద్రు లంచుఁ బొగడెదువారిన్
మూఁడేసికండ్లు నిజమో
పోడిమియు తలంచి చూడ పోలికయొక్కో. 27

క. కన్నులు గానక ప్రేలెదు
క్రొన్నెలధరు వేరు చేసి కొలిచెద వీవున్
నిన్నును నీతర మెఱుఁగవు
యిన్నిజగంబులకుఁ దండ్రి యెవ్వఁడు చెప్పుమా. 28

వ. అదియునుం గాక. 29

సీ. అసుర నీరుద్రులే వారి నస్సుగాఁ జేసి
యిలఁగూలఁ ద్రిపురంబు లేయువారు
నెరయ నీరుద్రులే నిఖిలంబుఁ జెరగొన్న
యంధకాసురుఁ బట్టి యణఁచువారు
బలసి యీరుద్రులే ప్రళయకాలుని బట్టి
ఖండించి మునిరాజుఁ గాచువారు
కదసి యీరుద్రులే గరళంబు గుదియించి
కంఠకోణమునందుఁ గప్పువారు

ఆ. ఏనయుఁ జదువు లెల్ల నెఱుఁగును జెప్పఁగా
యట్టిరుద్రమహిమ యజ్ఞగంబు
నట్టిరుద్రమహిమ నెఱుఁగంగ నలవియె
ధాత కైన నతని తాత కైన. 30

క. ఈరుద్రులఁ బదివేలను
గారవమునఁ బూజసేయ క్రతుఫల మదితాఁ
జేరునె నిన్నును రోయుచు
నీరసమగుఁ గాక క్రతువు నిష్ఫలగతులన్. 31

ఉ. నీచరియించునోమునకు నీవు ప్రియంబునఁ గొల్చురుద్రులే
నీచులు వీరు చాలుదురె నీకు ఫలం బొకటైనఁ జెప్పఁగా
నీ చతురాననాదులకు నేడుగడల్ భువిఁ దానయైన తా
రాచలనాథు నీవెఱుఁగ నబ్బునె పొందునెకతుయీరయెడన్.

క. దేవుఁడు నాకంబునకును
దేవుఁడు త్రిత్రింశకోటి దేవావలికిన్
దేవుఁడు లోకంబులకును
దేవుం డీశ్వరుఁడె కాక దేవుఁడు గలఁడే. 33

ఉ. మేరువు వింటికమ్మి యట మేదిని తేరట సూర్యచంద్రులిం
పారఁగ బండికండ్లట ననంతుఁడు నారట బ్రహ్మవిష్ణువుల్
సారథియున్ శరంబులట సామచయం బట గుఱ్ఱముల్ మనో
జారికి నెవ్వ రీడు త్రిపురాసురవైరికి నన్యదైవముల్. 34

ఉ. చెచ్చెర బ్రహ్మ తొల్లియును శ్రీపతియుం దమలోనవాదమై
మచ్చరకించి పాదములు మౌళియుఁ గానఁగఁ బూని గర్వులై
యచ్చుగ మిన్ను మన్నుఁగన హంసయుఁ బందియు నై

కడంకతోఁ, గ్రచ్చరఁ ద్రవ్వి యాశ్వరుని గానఁగఁ జాలిరో
యేపు దూలరో. 35

క. ఆతని యొక్క కురిసేయఁగ
నాతని నొకకాలఁడి సేయనగునే తమలో
నీతి యెఱుంగక వారలుఁ
చేతో మోదంబుతోడఁ జిక్కులఁ బడరే. 36

క. పంతంబులాడి శంకరు
నెంతయుఁ జొడగానవలయు ననియును దమలోఁ
జింతింపఁ జిక్కువడ్డవి
యెంతయు వేదంబు లోరుల కెఱుఁగన్వశమే ? 37

క. గౌరీమనోహరునకున్
ధారుణి బ్రహ్మాదిసురలు దాసులు గారే
నారాయణుఁ డరయంగా
మారారికిఁ బ్రియుఁడు కాఁడె మతకరిదనూ ! 38

క. సకలాధిపతికి శివునకు
నకలంకున కమితమతికి నభవున కిలలో
నొకపేదవేల్పు సరియే
ప్రకటింపఁగఁ దగదు పరమపాపము దనూ. 39

క. మ త్తిల్లి క్రొవ్విసాఁడవు
చి త్తంబున నరకుగొనవు శివుఁ డటు నిను ను
వ్వెత్తుగఁ గొనవచ్చిన నీ
పొ త్తగువా రెవ్వ రెందుఁ జోయెదు చెపుమా. 40

క. వలదు శశిఖండభూషణుఁ
దెలువుగఁ బిలిపించి పూజసేయుము ప్రీతిన్

వలపదు చెప్పితి ననినను
నలరుచు నప్పులుకు వాఁడు హాస్యము చేసెన్. 41

వ. పుణ్యమానసుం డగు దధీచి కోపమానసుం డై నయనంబుల వాని వీక్షించి యజ్ఞముఖంబున నతని దగ్ధంబుగా శపింప గమకించి నాకేల వేగిరపడ నేల యిక్కార్యంబునకుం గైలాసవాసుం డున్నవాఁడు గదా యని దేవతల మొగం బై యిట్లనియె. 42

ఉ. పన్నగ మిూర లందఱును పాలసముద్రము తొల్లి ద్రచ్చు
చోఁ, గ్రన్నన నుద్భవించి విషముం గాలుచుచో నభయంబు
లిచ్చి తా,సన్నుతిఁ జిచ్చు మ్రింగఁ జెయిసాచిన దేవరకీయ
రాని యీ,జన్నములోనఁ జేతు లిటు చాతురె దేవతలార
కష్టలై. 43

ఉ. ఇచ్చట నుండఁగావలవ దిందుశిఖామణి లేనిచోట మిూ
వచ్చుటచేటు నావిమలవాక్యము దప్పదు లీలఁ గాముని
జెచ్చెరఁ గాల్చి యున్న పెనుజెట్టి శివుం డిటు వచ్చె నేని మిూ
చచ్చుట లెల్ల మోయమరసంఘములార వినుండు చెప్పితిన్.

క. అని పలికి నిర్మలాత్మకుఁ
డనుపమగుణుఁ డచట నుండ కవిరళబుద్ధిన్
మనమున రోయుచుఁ జనియెను
చనుటం గనుఁగొనుచుఁ బాసి చనరై రమరుల్. 45

ఆ. దత్తుఁ బాయ రైరి తలపోయ లేరైరి
యిత్తుచాపవైరి నెఱుఁగ రైరి
నింద్యులైరి సురలు నిఖిలలోకంబులఁ
దమకు వచ్చుచేటు దలఁప రైరి. 46

దక్షుని యజ్ఞవృత్తాంతము దధీచి శివునకుఁ జెప్పుట

సీ. నీలకంఠునకును నెచ్చెలిగాఁడొకో
యటమటీఁ డైన యీయంబుజాక్షుఁ
దహికంకణునకు మూఁడవకన్ను గాఁడొకో
పాటుమాలిన యట్టి పావకుండు
గంగాధరునకు సంగడికాఁడు గాఁడొకో
వెనుకాళ్ల మూరైన యనిమిషపతి
పురవైరికిని తలపుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁ డైన యీనీరజారి
తే. యేమి కుడువంగ వచ్చితి రిందు మీరు
తాము పాలించునట్టి లోకముల విడచి
పంచవదనుని కను జేఁగురించెనేని
తత్క్షణంబునఁ దమయాళ్ల త్రాఁళ్లు దెగవె. 47

ఉ. ఆచరితంబు లెల్లఁ దనయాత్మ నెఱింగి కలంగి దిక్కులన్
జూచి కడిందికోపశిఖ చుట్టి మనంబున సందడింపఁ దా
రాచలనాథుసన్నిధికి నల్లన వచ్చి భవాని నీశునిం
జూచి నమస్కరించి తనచేతులు మోడ్చి మహేశుకిట్లనెన్.

చ. మలహర నేఁడు దక్షుఁడు రమావరదిగ్వరవాగ్వరాదులం
బిలిచి హిమాద్రిపై మనలఁ బిల్వక యాగముఁ జేయు
చున్నవాఁ, డలవున మీరు వేగఁ జని యచ్చట సూరుల
వానితోడుత, న్నలవడఁ జెండి పీచము లడంచి ననుఁ బ్రమ
దాత్మఁ జేయవే. 49

ఉ. దారుణబాహుదండబలదండధరోన్మది కుంభికుంభకం
ఠీరవ వైరిదానవఫణివ్రజశేఖర పన్నగాంతకా

కార భుజంగహార భుజగర్వదురోద్ధతపంచబాణసం
హార త్రిలోకవీర త్రిపురాసురదర్ప విరామ శంకరా. 50

వ. అని విన్నవించిన నతని పలుకులు విని పరమేశ్వరుండు
కోపించి. 51

శివునిహుంకారంబున వీరభద్రుండు పుట్టుట

ఉ. ధారుణి దిగ్గిరం దిరుగఁ దామరసప్రభవాండభాండముల్
ఘోరున ఘూర్ణిలన్ నిఖిలభూతములున్ బెగడొంద శూలి
హుం, కారము చేసెఁ జేసిన నఖండతరప్రళయాగ్నిసన్నిభా
కారుఁడు వీరభద్రుఁ డతిగర్వసముద్రుఁడు పుట్టె రౌద్రతన్.

వ. ఇట్లు పుట్టి. 53

సీ. సలలితవేదండచర్మాంబరంబుపై
భుజగేంద్రచిహ్నంబు పొల్చువాఁడు
కాలాగ్ని హేతి సంఘంబులై వడి నొప్పు
పదినూఱుచేతులఁ బరఁగువాఁడు
ప్రళయాభ్రవిద్యుత్ప్రభాభాసురం బగు
మెఱుఁగారుకోఱల మెఱయువాఁడు
భానుబింబముతోటి పర్వతాగ్రముభంగి
నెమ్మేని మణికిరీటమ్మువాఁడు

ఆ. అలుగువాఁడు నిప్పు లొలుకుఁజూపులవాఁడు
మంటలెగయు నొసలికంటివాఁడు
బలిమిఁ బట్టి రొట్టె బ్రహ్మాండముల నైనఁ
ద్రుంపువాఁడు రిపులఁ జంపువాఁడు. 54

వ. మఱియుఁ బ్రచండమార్తాండమండలమండితోద్దండ తేజో
విరాజిత |దుర్నిరీక్షణకుండలాభరణుండును సహస్రరవి

మండలతేజోవిలాసప్రకాశిత దివ్యదేహుండును బాల సూర్యప్రభాపటలచటుల పద్మరాగ మణిమకుటవిటంక విలంబమాన కర్కోటకశిరోవేష్టన కాలకూట త్రినేత్రసంయుక్తంబై రౌద్రరసంబు వెదచల్లు హస్తసహస్రంబును కఠోర కుఠార గదాదండభిండివాల కరవాల ముసలముద్గరతోమర ఖట్వాంగప్రాసపట్టిస కోదండశరచక్రముష్టిదంబగళ గదాత్రిశూలపరశులవనిలాంగోష్ఠ్యసి ఛురికాతళవంకులీయముదండ సారసజముదాళిశ క్షిప్రముఖ దివ్యదివ్యాయుధసమూహశిఖాసమాశ్రయంబై బ్రహ్మాండంబు వ్రక్కలించునట్టి దీర్ఘబాహాదండసహస్రంబును నారాయణేంద్రాదినిఖిలదేవతాదుల మణిఘటిత మకుటారణ్యస్థలీరంగవల్లీరణరంగతాండవ క్రియానిర్ఘాత భయదండంబులగు చరణారవిందరాజితుండును భుజంగరుద్రాక్షమాలికా విభూతిత్రిపుండ్ర శార్దూల చర్మాంబర సామజచర్మాంబర రథారూఢుండును వజ్రవైడూర్యేంద్ర నీలగోమేధికపుష్యరాగ మరకత పద్మరాగాదిమౌక్తికహారకేయూర కంకణాంగుళీయక మంజీరాంకితదివ్యదేహుండును ప్రళయకాల సమయపయోధరగర్జిత నిర్ఘాతజనిత నినదసన్నిభసకలభువనభయంకర సింహనాదుండును సకలబ్రహ్మాండభాండసముదయభయదవిపరీతాట్టహాసుండును విపులవిలయకాలానల ఘూర్ణితశైల శిఖరప్రపాత నాసికాపుటకుటీనిశ్వాసుండును మదగజగండభేరుండ సింహశరభశార్దూలాదిసంగర విద్యావిశారదుండును నిఖిల లోకైకోత్పత్తిస్థితిలయప్రకారుండును నిర్జరారాతిసంభూత

నిరస్తగహనక్రియాకలాపుండును అఖిలభూతసమాశ్రయుండును నైనధూమకేతుండును త్రైలోక్యదానవవిదారుండును అనేకసహస్రకోటి మధ్యందినమార్తాండపటలప్రభోజ్జ్వలుండును శైవదూషకజనవక్త్రపదతాడవ నిర్ఘాతసంఘటితుండును అగణితగుణగణాలంకృతుండును అసహాయశూరుండును అతులితదుర్వారగర్వదర్పోద్ధతుండును నై యొప్పుచున్న వీరభద్రేశ్వరుండు. 55

పార్వతికోపంబున భద్రేశ్వరి యను కన్యపుట్టుట

క. రుద్రుసకుం జూడచూవెను
రుద్రాణియు నంతలోన రోషాత్మక యై
భద్రేశ్వరి యనుకన్యక
రౌద్రతఁ బుట్టించె ఘనకరాళానన యై. 56

వ. అంతఁ దత్సమయంబున వీరభద్రేశ్వరుండు భద్రేశ్వరిం గూడుకొని పరమేశ్వరునిపాదపంకజంబులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరసహస్రంబులు మొగిడ్చి దేవా మీరు నన్నుం బుట్టింపఁ గారణం బేమిటొకో యవధరింపుఁ డని యి ట్లనియె. 57

సీ. నీయాజ్ఞఁ గడచి యీనిఖిలంబులకు బ్రహ్మ
కొన్ని మిక్కిలి సేయుచున్నవాఁడొ
నీయాజ్ఞ గడచి యీనీరజనాభుండు
కొండుజాడలఁ బోవుచున్నవాఁడొ
నినుమీఱి పవనుండు! నేలయు నింగియు
నొక్కటిగావించుచున్నవాఁడొ

*నీపంపుదప్పి యీనింగి మూర్తాండుండు
పన్ని మిక్కిలి కాయుచున్నవాఁడొ

†గీ. అట్లుగాకయుఁ బడబాగ్ని యంతజలముఁ
గరము గ్రోలుచున్నదిరయొకో కాముఁడేచు(?)
చున్నవాఁడేమొ యీకాన చెప్పవేమి
చిక్కఁబట్టి కేలున వారి నుక్కణంతు. (?) 58

క. కట్టలుక మీరు నన్నును
బుట్టింపఁగ నేల వలసెఁ బోలంపుగ సాకుఁ
నెట్టన యానతియీవే
పుట్టువు సంత్యంబులేని భూతాధిపతీ. 59

వ. అనిన విని యల్లన నవ్వుమొగంబున నద్దేవున కి ట్లనిరి. 60

శా. వింటేయంతయు వీరశేఖర మమున్ వెల్వెట్టి దత్తుండు నీ
వెంటన్ వేల్పఁ దొడంగినాఁడు సురలన్ విష్ణుండు నింద్రుండు న
వ్వెంటన్ బోయినవారు వారి నచటన్ వేవేగ దండించి నీ
వింటన్ బుట్టుశరానలంబున రణోర్విన్ నీలు గావింపుమా.

ఉ. ఇమ్ములనీవు వేగ చని యేచి మహారణకేళి యాడు మీ
యమ్మయు నేను వచ్చి మునియాశ్రమభూమి వసించి నీవిలా
సమ్ములు చూచుచుండెదము జర్జరితంబుగ దత్తుఁ జంపి యా
గమ్ము హరించి రక్షనుచు నానతి యిచ్చిన వీరుఁ డి ట్లనెన్.

*నీ పేరుదలఁచక నిఖిలలోకంబులు నన్య దైవములయం దున్నవారో?

†ఆ. అట్లుగాక వాయు వగ్గలంబయ్యెనో
కలఁగి జలములెల్లఁ గలఁగఁబడఁగ
యేమి తెలఁగ నాకు నీకాన చెప్పవే
యొక్కనాకని కేల నుక్కడంతు.

క. భావజమదసంహార సా
నావేదాతీత వినుత నాగాధిపతీ
దేవేంద్రార్చిత పదయుగ
దేవా దేవాదిదేవ త్రిదశాధిపతీ. 63

ఉ. కుంభిని ద్రెంతునో జమునిగుండెలు చెండుదునో సురాచల
స్తంభము ద్రెంతునో సురలచట్టలు చీరుదునో కడంగి ది
క్కుంభుల ద్రుంతునో యజుని క్రొవ్వణగింతునొ సూర్యచం
ద్రులఁ, జృంభణమెల్ల మాన్పుదునొ చుక్కల డుల్తునొ
పార్వతీశ్వరా. 64

శా. బ్రహ్మేంద్రామర పూజితాంఘ్రియుగళా బాలేందుచూడా
మణీ, బ్రహ్మేంద్రాదులఁ బట్టి వ్రేల్పు టడి మద్బాహాబలప్రా
ఢికిన్, బ్రహ్మంబవె పరమేశ నీవుఁ బ్రణుతింపం గర్వదుర్వారు
లన్, బ్రహ్మాదుల్ *దెగ రూపడంతు నొకఁడన్ బ్రహ్మాండ
భాండావళుల్. 65

మ. నడతున్ దక్షునిమీఁదఁ గయ్యమునకున్ నారాచఘోరా
గ్నులన్, బుడమిం దేవగణంబులం దునిమి సంపూర్ణాహుతుల్ వోసెదన్, గడిమిం గెల్చెదఁ గూల్చెదం గలచెదం
గాలించెదన్ జంపెదన్, గడిఖండంబులు జేసెదన్ నుతికెదన్ ఖండించెదన్ మించెదన్. 66

క. నాకెదురెవ్వరు జగముల
నీకెదురెవ్వరు మహేశ నిఖిలాధిపతీ
నాకీ తెరువునఁ బోడముఁగ
నీకంఠవిషంబు నీవె నిర్మలమూర్తీ. 67

---

* దెగడొంద రూపడఁతు నే బ్రహ్మాండభాండావళుల్.

వ. అనిన విని మెచ్చి పార్వతీదేవి యవ్వీరశేఖరున కిట్లనియె.

శా. కట్టల్కన్ గణలోకనాథ నిను మత్కార్యార్థమై యీ
యెడన్, బుట్టించెన్ భుజగేంద్రభూషణుఁ డొగిన్ భూతేశు
నిందించి తాఁ, బెట్టన్ జన్నము దక్షుఁ డద్దివిజులన్ బిల్వం
చినాఁ డాసభన్, గట్టుగ్రంబుగఁ గూల్చి రక్షనుచు నా
కళ్యాణి దీవించుచున్. 69

క. కట్టడ వారుఁడును దానును
బెట్టిరి తగ వీరసేను బీరముతోడన్
నెట్టనఁ బ్రణమిల్లి వెసన్
జెట్టిమగండైన వీరశేఖరుఁ డెలమిన్. 70

వ. అట్టిపనిఁ బూని దక్షయాగంబుపైఁ బోవ గమకించి వీర
భద్రుం డతులితరౌద్రాకారుం డై యి ట్లని విచారింపం
దొణంగె. 71

ఉ. శూలము యూపగంబమును శోణితధారలు శ్రేయుబాణ
ముల్, చాలినదర్భలుం గుఃఖము చప్పుడు మంత్రము
స్రుక్కులుం దోనల్, గ్రాలురణోర్వి మంటపముగా సుర
గోవులసోమయాజి యై, వ్రేలుచు రోషణాగ్నులను
వీరుఁడు భద్రుఁడు శంభుప్రీతిగన్. 72

వ. అని సకలలోకంబులుం గొనియాడ వీరయాగంబు సేయ
వలయు నని విచారించి. 73

శా. ఝుంకారభ్రుకుటాననుం డయి ధరాచక్రంబు ఘూర్ణిల్లఁ గా
హుంకారించిన భద్రుమేన లయకాలోగ్రాగ్నికీలావళిన్
సంకాశోద్ధతకోపచిత్తులు రణోత్సాహుల్ జగద్భీషణా

హంకారుల్ ఘను లంత కాంతకు లుదగ్రాగ్నుల్ మహావిక్ర
ముల్. 74

ఉ. సాహసధైర్యమానసులు చంద్రఫణీంద్రవిభూషణుల్ శివ
ద్రోహరగండకీర్తు లతిదోర్బలగేయులు భూరితీవ్రహా
లాహలజృంభితుల్ శిఖవిలంబితనేత్రులు చారుగోపతీ
వాహులు వైరివీరమదవారణసింహులు పుట్టి రుగ్రతన్. 75

వ. ఇట్లు పుట్టిన. 76

ఉ. ఎక్కడఁజూడ వారెయయి యేపున లక్షలుఁగోట్లునెందఱో
దిక్కులు పిక్కటిల్ల నతితీవ్రత లెక్కకుదాఁటి యుగ్రతఁ
జొక్కులు మోవ నేచి యలచుక్కలు రాల నుదగ్రమూర్తు
లై, యొక్కట యార్పుగొన్నఁ బ్రతిహుంకృతిఁ జేసె
నజాండఖాండముల్. 77

వ. అంతఁ దదీయగణనికాయంబులు తన్నుఁ బరివేష్టించి దండ
ప్రణామంబు లాచరించి సంభ్రమంబున. 78

ప్రమథగణములతో వీరభద్రుఁడు దండెత్తుట.

క. కొందఱు మొనలై నడువఁగఁ
గొందఱు పంతంబు పలుకఁ గొందఱుమూకల్
సందడిఁ బొదఁగ మఱియును
గొందఱు దక్షుం దలంచి క్రోధింపంగన్. 79

క. గండఁడు శంభుద్రోహర
గండఁడు మహి నన్యదైవగండరులకుఁ దా
మిండఁడగు వీరభద్రుఁడు
దండెత్తె గణాళి గొల్వ దక్షునిమీఁదన్. 80

వ. ఇట్లు వీరగణసైన్యాధిష్ఠితుండును గోరాజగమనుండును భద్రేశ్వరీసహితుండును నారాచగదాదండభిండివాలత్రిశూల దివ్యబాణనిశితాయుధపరివృతబాహుదండుండును రణదుందుభినిస్సాణశంఖకాహళఘంటికారావ భీకరుండును నతులితకోపాటోపసంరంభుండును సమరసన్నాహుండును వివిధవిలసితవీరలక్ష్మీవిలాసుండును వృషభకేతనాలంకారుండును నై పురంబులు సాధింప వసుంధరారూఢుండును గౌరీసమేతుండును నై యరుదెంచుపురారాతిచందంబున నతిసుందరుం డై వీరభద్రేశ్వరుం డరుగుదెంచుచున్నసమయంబున. 81

క. గణపాదహతులచేతను
వణఁకి గిరుల్ తరులతోడ వసుధం బడియెన్
కణఁగి వసుంధరగిరులును
ఫణిపతిపైఁ బడియెఁ గమఠపతిపైఁ బడియెన్. 82

క. బలువిడి ప్రమథగణంబుల
బలముల పెనుధూళి గగనభాగముఁ గప్పెన్
అలరఁగ రేణువుఁ గప్పెను
తెలువుగ రవి మింటనుండి చీఁకటి గప్పెన్. 83

వ. అంత నవ్వీరభద్రుండు తుహినాచలశిఖరంబు డాయం బోయి కతిపయదూరంబున దక్షాధ్వరకలకలంబు విని గణంబుల కిట్లనియె. 84

సీ. ఘనులార వింటిరే గగనభాగం బెల్ల
హోమధూమము గప్పియున్న భంగి

వినవచ్చెనే మీకు వేదమంత్రంబులుఁ
బలికెడుహోతలకలకలంబు
అల్లనయేతెంచు నదె హావ్యములు గోరి
క్రందైన నిర్జరబృందరవము
అల్లదె పాపాత్ము నధ్వరం బొనరించు
క్రతుశాల దవ్వునఁ గాన వచ్చె
ఆ. నింక దవ్వు లేదు యేర్పడఁ జూడుఁడో
శ్రీగిరీశు వేఁడుచేసినాఁడు
క్రొవ్వినాఁడు వీని క్రొవ్వు నణంపంగ
వలయు దేవదైత్యవరులతోడ. 85
వ. అని హెచ్చరించి మైపెంచి వీరజనచూడామణి యగు వీర
భద్రేశ్వరుండు. 86
సీ. బహుమంత్రములచేత భాసిల్లి యుండంగ
వేదనాదములచే వెలసి వెలసి
విదితవైభవముల విలసిల్లి విలసిల్లి
కలకలరవములఁ జెలఁగి చెలఁగి
హోతలపలుకుల నొప్పారి యొప్పారి
యాచార్యజనులచే నమరి యమరి
పృథుసదస్సులచేతఁ బెంపారి పెంపారి
వరయాగలక్ష్మిచే వ్రాలి వ్రాలి
ఆ. వెలుఁగుచున్న యట్టి వేదిపైఁ గూర్చుండి
బంధుకోటితోడ భాసురముగఁ
గొంతదనుకఁ గ్రతువునంతయు వేల్చిన
దక్షుఁ గనియె వీరదైవ మపుడు. 87

వ. ఇట్లు కాంచి తదీయమందిరంబు గణంబులుం దానును జుట్టు ముట్టి విపులవీరావేశ కోపాటోపాప సంరంభుఁడును గరాళ వదనుండును నై చెలంగి యార్చిన. 88

శా. కంధుల్ వండలి పిండుగాఁ గలఁగె ఘీంకారంబు రోధించె ది గ్గంధేభంబులు గ్రుంగె భూతలము చుక్కల్ రాలె భూ తంబులుగా, మందీభూతము లయ్యెఁ దప్పె రవి బ్రహ్మాం డంబు భేదిల్లె ది, క్స్కంధుల్ ద్రెళ్లెఁ జగంబులుం బెగడె వే శంకించె నా బ్రహ్మయున్. 89

క. కలకలము నొందుయాగము
వెలవెలనై చిన్నవోయె వేల్పులమూఁకల్
కలగిరి ఋషిమునిముఖ్యులు
ఎలుఁగింతయు లేకయుండి రెంతయుఁ భీతిన్. 90

ఉ. కొందఱు మూర్ఛవోయిరటఁ గొందఱు పాఱిరి భీతచిత్తులై
కొందఱు చచ్చి రచ్చటను గొందఱు దూరిరి శాకక్రంతలన్
గొందఱుఁ బుద్ధి ప్రామ్పడిరి గుండెలు ఝల్లని తల్లడింపఁగాఁ
గొందఱుసృష్టిసంహార మొకో యని నివ్వెఱఁగంది రార్తులై.

వ. ఇట్లు సింహనాదంబు చేసి విజృంభితుం డై యుం దెవ్వ రేని పాఱిపోయెదరు వీరల మెదిలిపోనీకుం డని రభసంబున నయ్యాగమంటపంబు చుట్టును ఖడ్గపరశుత్రిశూలహస్తు లైన ప్రమథగణంబులఁ గాపు వెట్టి తానును వీరగణసేవితుం డై యవ్వీరభద్రుండు దక్షముఖమంటపంబుఁ దరియం జొచ్చునమయ్యంబున వెఱచియు వెఱవని చందంబున దక్షుఁ డి ట్లనిరెం. 92

క. ఇచ్చోటి కేల వచ్చెద
వెచ్చోటే యూరు నిన్ను నెవ్వఁడు పంపఁగ
వచ్చితివి యేమి కార్యము
చెచ్చెర వినుపింపు మనినఁ జిత్తములోనన్. 93

ఆ. వెఱ్ఱివాఁడు వీఁడు వెంగలి మూఢుండు
భాగమెల్ల నేలుపలుకుపలుకున్న
మఱిగదా గణంగి మర్దించి వైచెద
నంచు నతనికనియె నలఘుబలుఁడు. 94

చ. ఎనయఁగ దేవదేవుఁ డగునీశ్వరదూతను వీరభద్రుఁడన్
బనివిని నీదుజన్నమునఁ బాలుగొనం జనుదెంచినాఁడ భ
క్తిని శివుభాగ మేది యిట తెచ్చి సమర్పణ మీవు సేయుమా
విను ననుఁ గూర్చి కుత్సితపువిద్యలు చేసినఁ బోదు వెంగలీ.

మ. తలఁపన్ దుర్మతివై యొనర్చు నపరాధంబుల్ శివుం గూర్చి
యున్, గల వెన్నేనియుఁ దొల్లి నీవలన నింకన్ వీరభద్రుం
డలం,తులఁ బోనీరఁడు సైఁప నేరఁడు వృథా దుర్బుద్ధివై
ప్రాణముల్,ఫలమున్ గోల్పడ నేల శంకరునకున్ భాగంబు
దెప్పింపుమా. 96

వ. అనిన నవ్వి దక్షుం డిట్లనియె. 97

క. యాగములోపల శివునకు
భాగము గలదనుచు శ్రుతులు పల్కినచో నీ
భాగము నీకిచ్చెద నీ
యాగమములఁ దెలుపు మనిన నతివేగమునన్. 98

వ. అనిన విని ఋగ్యజుస్సామాథర్వంబులు మహావినయభీతచిత్తు
లై లేచి తదీయముఖమంటపంబున నున్నసదస్యులం జూచి
యి ట్లనియె. 99

సీ. నిఖిలతంత్రములకు నీలకంఠుఁడు వేల్పు
భువి నగ్రదైవంబు పూజసేయ
భాగ్యంబు గొఱఁతయే భావించి చూడుఁడ
కర్మమానసులార కష్టులార
పరమేశుతత్త్వంబుఁ బరికింప రేమిటి
కీశాను నిజతత్త్వ మెఱుఁగ రేల
పరమోపదేశంబు పరమంబు పరమాత్మ
శివుఁ డౌట యెఱుఁగరే స్పష్టిననుచు
ఆ. వేల్పు లెల్ల మాట వినకున్న దక్షుండు
వినియు వినని యట్ల కనలి యున్న
నచటనుండ వెడలి యాగమంబులు వోయి
బ్రహ్మలోకమునకు భయముఁ బొందె. 100

వీరేశ్వరుండు దేవతలను సంహరించుట

వ. ఇట్లు వేదంబులు వివరించుటయును వేల్పులు వినకుండుట
యును వెంగలి యైన దక్షుండు విరోధించుటయును వీర
భద్రుండు వీక్షించి తత్సభవారల కిట్లనియె. 101
శా. కామధ్వంసుఁడు సర్వతంత్రములకుం గర్తారుఁ డంచుం
శ్రుతి, స్తోత్రంబుల్ వినిపింప నేఁడు వినమిం దుర్వృత్తి
నున్నారలా, స్వామిద్రోహులు మీరు మిమ్ముఁ గడిమిం
సంగ్రామరంగస్థలిం, జేమాఱుం బరిమార్చి వైతు నేఁక
దోర్వీర్యం బవార్యంబుగన్. 102
వ. అని పలికి. 103
సీ. జంకించి మైపెంచి శంఖంబు పూరించి
గగనభాగం బెల్ల గలయఁ దిరిగి

అనిక సంరంభించి యార్పులఁ జెలగించి
బ్రహ్మాండభాండంబుఁ బగులఁ జేసి
భుజశాఖ లడలించి భూస్థలి నంకించి
బలువిడి నాయుధంబులు ధరించి
అరులగుండెలు చించి యడిదంబు ఝళిపించి
దర్పించి సింహనాదంబుఁ జేసి

ఆ. అతికరాళభ్రుకుటికాస్యుఁడై కన్నుల
నిప్పులొలుక నురలు నెఱిఁ దలంక
వీరగణవిభుఁడు విలయకాలానల
రౌద్రమూర్తి వీరభద్రమూర్తి. 104

వ. ఇట్లు మహావీరావేశంబున భేరీధంకారనినాదంబులు గగన
మండలంబునిండి చెలంగ వెండియు నిట్లనియె. 105

ఉ. కంటక మైనయాగ మిది గౌరిశివార్పణ మంచు నార్పు మి
న్నంటఁగ నగ్గణంబులకు నందఱికిం జెయి. సన్నఁజేసి తా
మంటలకన్ను విచ్చి మఖమండపశాలలు నీఱుచేసియుఁ గా
మింటమిణుంగురుల్ మెఱయ మేదిని దొల్లఁ గణంగి ఘూర్ణి
లన్. 106

క. వదనంబున రోషాగ్నులు
వెదఁ జల్లుచు ఘోరవీరవైశ్వానరుఁ డై
పదపడి నానాగతులను
విదళించెఁ గా వీరవిభుఁడు వేల్పులమూకన్. 107

వ. మఱియుఁ బ్రళయకాల నీలజీమూతపటలంబులంబోలి పోనీక
వెనుతగిలి పలుదెసలఁ బాఱి విసరు వెనుగాడ్పుచందంబునఁ
జరాచరజంతుసంఘంబుల మండలీభూతసముద్దండ కోదం

డుం డై వైభవాడంబరం బగు బ్రహ్మాండంబుల నొండొండఁ జేర్చి చెండాడెడు ఘోరాడంబరుం డగు నఖండదండధర వైరివిధంబున దివిరాని యరితూల యడుగులపయింబడి యంకిలి లేక దరికొని గరలి వడి గాలి దోఁడుగాఁగల్గు విలయకాలానలంబులకై వడిఁ గవిసి గిరిగహ్వరగహనగుహాంతర్గతశయనసుప్తంబులైన మదగంధగజయూథంబుల ఘీంకారంబుచేత ప్రబోధితంబై వాని వెనుకవిలి కుంభస్థలమాంసంబు నఖదంష్ట్రంబులం జించి చెండాడుసింగంబుపగిది మహార్ణవాంతరంగంబున మత్స్యకచ్ఛపకర్కటక తిమితిమింగిలాది జంతుసంతానంబులాగున పయఃపారావారమధ్యంబున నమృతాహరణార్థంబు దిరుగు మహామందరంబు తెఱంగున మహాభీకరంబుగాఁ గలసి కరాళించి విలయసమయవిజృంభిత జీమూతనిర్ఘాత ప్రచండఘనరవభయంకరంబుగా శంఖంబుఁ బూరించి విడంబించి రొక్కెడఁ జూచినఁ దానవులై హరిపురందరవిరించాదులు దిగులుకొని చెదరి చెదరి పఱవఁ బోనీక యదరంటుందాఁకి కడుసువడి వీఁకమై వెఱచఱచి పఱచునట్లుగా దేవగణంబుల మూకల కులికి యగ్గణరాజకంఠీరవుం డగ్గలిక మెఱయ బలువిడిఁ గడువడి కెరలి పిడుగులం బోలినబాణజాలంబులు పఱపుచు శూలంబులఁ బొడుచుచు నేలపాలుచేయుచుఁ గఠారంబులఁ బొడుచుచుఁ గుఠారంబుల ఖండించుచుఁ బరశువుల నఱకుచు నత్తళంబుల నొత్తుచుఁ జక్రంబులఁ ద్రెంచుచు భిండివాలంబుల ఖండించుచుఁ జంచువుల విజృంభించుచు నఖంబులఁ జీరుచుఁ పాదంబులఁ జవురుచు పిడికిళ్ల రువ్వుచు నరచేతులం

కాడుచుఁ దూపులఁ బఱపుచుఁ గవిసియుఁ దనివిఁ గొనక వెండియు నానావిధపదఘట్టనంబుల మహీమండలంబులఁ గప్పుచు మార్తాండమండలంబు లెఱుంగున నతని వెయిచేతుల విడంబించి యఖండవివిధవిలసిత విశిఖవ్రాతంబుల నందఱకు నన్నిరూపులై తోఁచి గొడుగులు విఱుచుచుఁ జామరంబులఁ జూడి సేయుచు శిరంబులు గూల్చుచు శిఖలు పెఱుఁకుచు వదనంబులు ద్రుంచుచు నూరువులఁ బదంబులు వ్రచ్చుచు గళంబులు గోయుచు భుజంబులు విడిపించుచు నాలుకలు గోయుచు ముక్కులు జిదుముచు చెక్కులు గముకించుచు ప్రేఁగులు ద్రెంచుచు కన్నులు బెఱుకుచు చెవులు ద్రెంచుచుఁ గిరీటంబులు పదతాడనంబున రాల్చుచు కండలు చెండుచు రక్తంబులు గ్రోలుచు నెముకలు రాల్చుచుఁ బడద్రోఁచి పండ్లు పీఁకుచుఁ గొందఱ హోమగుండంబుల నిండను వ్రేల్చుచు నుదరంబులు ఖండించుచు యిట్లు మఱియుం గలంచుచు గుదించుచుఁ గోలాహలంబు సేయుచు రేఁపుమాపియుఁ జమరియుఁ జక్కడిచియు నెఱిచఱచియు నేలపా లొనర్చియు వసంతసమరకేళీవిహారం బొనరింప దేవసంఘంబులు సైరింపఁ జాలక నలంగియుఁ దొలంగియు నొచ్చియుఁ జచ్చియుఁ జర్జరితులై మూర్ఛిల్లియుఁ జెల్లాచెదరై పాఱియు నొండొరువులఁ జొచ్చియు నున్నం గనుంగొని వీరభద్రేశ్వరుండు. 108

సీ. పోకు నాముందఱ పోరాదు దేవేంద్ర
పోయినఁ బోవునే భుజగశయన
యెటుపోయె దెటుపోయె దెందుఁ బోయెద వగ్ని
నిలు నిలు నిలు నిలు నీరజాప్త

బంటుతనము గాదు పాఱకు యమరాజ
పవమాన యక్కుడఁ బాఱె డింక
పంద వైతివి యేమి చందురమగవాఁడ
రణమునఁ బాఱెదే రాజరాజ

ఆ. వీరు లైనవారు వెనుకకుఁ బోదురే
మగతనంబు విడువఁ దగునె వరుణ
పోకుఁ డింక మీరు పోయినఁ బోకున్నఁ
బోటు సిద్ధ మెల్లభంగు లందు. 109

వ. అని మదలకించి యవ్వీరభద్రుండు రౌద్రోద్రేకంబునఁ
బ్రళయకాలరుద్రుం డై. 110

వీరభద్రుఁ డింద్రుఁడు మున్నగువారిని శిక్షించుట

క. పొడ వైనకొండశిఖరము
విడువక పగులంగ పిడుగు వ్రేసినభంగిఁ
పుడమిఁ బడి మన్ను గఱవఁగ
సుడివడ దేవేంద్రుఁ దన్నె సురసుర స్రుక్కన్. 111

క. చెన్నార నీవు నన్నగఁ
బన్నగధరు విడిచి వచ్చి పాపాత్ముఁడ వై
యున్నాఁడ వనుచు సూర్యునిఁ
దన్నిన రక్తంబుఁ గ్రక్కె దారుణవృత్తిన్. 112

ఉ. ఆలరిదత్తునింటఁ జని హవ్యములం దిను చేతు లేవి నీ
నాలుక లేవిరా దహన నాకు మొఱంగిన నేఁడుపోదురా
వాలునఁ ద్రెంతు నంచుఁ గరవాలు మెఱుంగులు రాలఁ బట్టి
తా నాలములోనఁ ద్రుంచె వడి నగ్నికణంబులు ఘోర
జిహ్వాలన్. 113

ఆ. దండధరుని బట్టి దమకించి పడద్రొచి
ముష్టిఘాతపాతదృష్టి ముంచి
త్రోముద్రొక్కి నిలిచి రూపించె ఘనబాహా
దండలీల మెఱయ దండివేల్పు. 114

క. బడబాగ్నులోలుకఁ జూపులఁ
గుడుమిడుగురు లెగయఁ బేర్చి గదరొత్తి వడి
న్నడివడ నైర్ృతిప్రేసెను
జడధీశుని వరుణుఁ గాంచి జగతిం గూలన్. 115

క. తనియని కోపదవాగ్నులు
మునుమిడి దరికొల్ప వీరముఖ్యుఁడు గడిమిన్
దనయార్పులచేఁ గాల్చె
న్ననుకొను నసురాదియుతుమహాకల నలుకన్. 116

క. రుద్రుఁడు శంకరుఁ డుండఁగ
రుద్రుల మని ప్రేలుచున్న రుద్రులె యంచున్
రౌద్రత నెత్తురుఁ గ్రక్కఁగ
రుద్రులఁ గట్టలుకఁ బొడిచె రోషముచేతన్. 117

క. హరుఁ డఖలగురుం డని యు
ర్వరమ్రోయఁగ నిచటి కేలవచ్చితి చెపుమా
వరద యనుచుఁ దుదిగోరున
సరసాకృతివాణిముక్కు సయ్యనఁ జిదిమెన్. 118

క. మఱి రావాంచేత మధ్యము
గరువంబడి యున్న పూర్ణకములారిగతిన్
గఱగఖుఁడు ముక్కుఁ జిదిమినఁ
దెఱవకు భారతికి మోముధృతి నొప్పారెన్. 119

క. నెత్తురుధారలు మెఱుఁగుమునఁ
జొత్తిల్లఁగ నగ్నిదేవుసుందరి ముక్కున్
వృత్తస్తనశిఖరంబులు
నత్తరి తుదిగోరఁ ద్రుంచి యవ్వేలవైచెన్. 120

క. వనితలచనులకు నీడైఁ
జనియెడు నని పంచశరుఁడు జక్కవదోయిం
గొనముక్కులు కోసినక్రియఁ
జనుముక్కులఁ దనరె వహ్నిసతికి రణోర్విన్. 121

మ. భగునిం గూఁకటిఁ బట్టి నిష్ఠురగతిం బండ్లూడ నోరంతయుం
బగులం వ్రేసి కుదించుచుం బదరుచుం బాపాత్మునిం దక్షునిం
దగవే చూచిన కన్నులేవి యనుచుం ధట్టించి లీలాగతిం
భగుకన్నుల్ వెఱికెం సురల్ బెగడఁగా భద్రుండు
రౌద్రాత్ముఁడై. 122

శా. రోషాగాథలు పల్కు మంత్రములు దా నెచ్చోటికిం
బోయెరా, పూషాదిత్య దురాత్మ యంచుఁ బెలుచం భూమిం
బడ వైచి నిర్ఘోషం బాతనిపండ్లు డుల్చె నది హేతు
ఖ్యాతి గా ధాత్రిలో, భాషల్ తప్పులు వోయె నాతనికిఁ
దా భాషించుచో నెప్పుడున్. 123

శా. చంద్రా నిన్ను ధరించియున్నపరముం సర్వేశ్వరుం బాసి
యీ, యింద్రాదిత్యులభంగి నేఁడు భువిపై నేతెంచి
యిచ్చోట మృత్సాంద్రక్రోధహతుండ వైతి వనుచుం
జంకించి పాదంబులం, జంద్రుం భూగతుఁ జేసి ప్రాం
చిదుకం సంగ్రామరంగంబునన్. 124

వ. తదనంతరంబ. 125

చ. పెనిమిటిఁ ద్రాముచోఁ బురుషభిక్షము వెట్టు మటంచుఁ
దారకాంగన లరుదెంచి మ్రొక్కి క్రియఁ గ్రక్కున నొత్తి
శశాంకుఁ ద్రొక్కఁగా, జనసమునొంది పెల్లగసి సర్వజనంబు
నకు న్విచిత్ర మై, యొనరఁగ భద్రుపాదముల నొప్పె
సుధాజలబిందుసంఘముల్. 126

వ. మఱియు సముచితాలాపంబులు పలుకు యుగాంతకాలరుద్రుండునుం బోలె నట్టహాసంబు సేయుచు మహితమందరమహీధ్రమథిత మహార్ణవకల్లోలచయంబునుం బోలె ఘోషించుచు కంఠీరవంబునుంబోలె గర్జించుచు మదాంధసింధురంబునుం బోలె మ్రోయుచు వర్షాకాలమేఘంబునుం బోలె శరవృష్టి గురియుచు రాహుమండలంబునుం బోలె నొడియుచు గంతులు ద్రొక్కుచుఁ దాండవంబాడు పురారాతియునుంబోలె వింతగతుల రణవిహారంబు సలుపుచుఁ బెనుగాలియుం బోలెఁ దూలుచు బడబాగ్నియునుంబోలె నార్చుచు నంధకారంబునుంబోలెఁ గప్పుచు నేలయు నింగియు నొక్కటిరై పొడువుపొడువు పోనీకుఁ బోనీకు చంపు చంపు మని యొఱింగించుచు దశశతకోటిసహస్రలక్షానేకకోటిసంఖ్యలై దేజరిల్లుచు యూపంబులఁ బెఱుకుచు నాచార్యుల నడచుచు హోతలప్రాణంబులు హోమంబులకు నాహుతులు గావించుచు పశువుల నసువులు బాపుచు గంధర్వులకంధరంబులు ద్రెంచుచు సిద్ధసాధ్యచయంబుల ఘట్టించుచు సూర్యులం దూలించుచు తాపసుల విచారించుచు మునిజనులదండకమండలయజ్ఞోపవీతములు తుత్తుమురులు సేయుచు బ్రహ్మశిరంబుఁ గుదియించుచు సురాసురజాతంబుల నొరియించుచు

నిప్పులొలుకుచూపుల నందఱం గప్పి తలలు గోసి కుప్పలు పెట్టుచుఁ బ్రేవులు పోఁగులువైచుచు కండలు చెండి కొండలుగా వైచుచు పీనుఁగుపెంటలనడుమ నెత్తురుటేఱులు గావించుచు దేవభటులమాంసంబు లిచ్చి భద్రకాళి మెప్పించుచు భూతప్రేతపిశాచగణంబులం దనుపుచు వీరజయలక్ష్మీవిలాసుం డై ప్రజ్వరిల్లుచు వీరభద్రేశ్వరుండు. 127

లయగ్రాహి.—

నిక్క గణనాథుఁ డొకయక్కజపు విల్లువడి
  నెక్కిడి గుణధ్వనుల దిక్కు లొగి వ్రయ్యన్
గ్రక్కున మిణుంగురులు గ్రక్క బలుభూతములు
  చక్క దొడఁగేయనగ వెక్కసము దోఁపన్
లెక్కలకు దాఁటి చని యొక్కట సురాదులను
  జక్కడచె నప్పు డతి చిక్కువడి మ్రొక్కన్
డొక్కడువు నిక్కుఁ డను దిక్కురులనాదములఁ
  జుక్క లురలం ధరణి గ్రక్కదలుచుండన్. 128

వ. మఱియు వీరావేశంబున. 129

సీ. పట్టిసంబులఁ ద్రుంచి పలుబాణముల నొంచి
  ముసలాయుధంబుల మోది మోది
అలుగుల నాటించి యరచేతులను వ్రేసి
  ముష్టిఘాతంబుల ముంచి ముంచి
కత్తుల నెఱియించి గదల క్రుళ్ళణగించి
  భూరిశూలంబులఁ బొడిచి పొడిచి
శక్తులఁ దూలించి చక్రాలఁ బరిమార్చి
  పటుసారసంబులఁ బఱపి పఱపి

తే. పెనఁచి నరములు ప్రేగులు పెఱికిఁ బెఱికి
చెనకి మేనులపట్టులు చీరి చీరి
డాసి చెక్కులు ముక్కులు గోసి కోసి
వీరభద్రుండు వేల్పులఁ దోలఁ దొడఁగె. 130

శా. వీచు న్నెత్తురు గమ్ము దేర నఱచున్ వీరంబు దోరంబుగా
వైచున్ నింగికి నేలకున్ దిశలకున్ వజ్రప్రహారంబులన్
దాఁచుం గూల్చునదల్చు నేర్చుఁ గరముల్ ఖండించి హోమా
గ్నిలోఁ, ద్రోచుం గాఁకటి బట్టి మొత్తి సురలన్ దుర్వా
రగర్వోద్ధతిన్. 131

శా. నిక్కున్ ఠాంకృతి సేయఁగాఁ జెలఁగు భృంగి ఘోషఘోషం
బుగాఁ, ద్రొక్కున్ సర్వవసుంధరావహుఁ డనంతుం డెంత
యున్ రోజఁగాఁ, జొక్కున్ భీకర మైనహుంకృతులచేఁ
జుక్కల్ వెసన్ రాలఁగా, దిక్కుల్ మ్రోయ నజాండ
భాండములు భీతిన్ బెల్లు ఘూర్ణిల్లఁగన్. 132

సీ. ఒకమాటు కత్తుల నోరలంగఁ గుత్తుకల్
విడిపించి తనతోఁటి వెలఁది కిచ్చు
నొకమాటు హోతల కుఱికి మధ్యంబులు
ఖండించి భూతసంఘముల కిచ్చు
నొకమాటు నఖముల నూరుస్థలంబులు
వ్రచ్చి వేతాళకవ్రజము కిచ్చు
నొకమాటు గదలచే నూరుతలంబులు
మురియించి మృగసంఘములకు నిచ్చు

ఆ. ఒక్కమాటు గముల నొక్కటఁ జెండాడు
నొక్కమాటు సురల నొల్లఁ బుచ్చు

వీరభద్రరణము వే తెవ్వనిని బోల్ప
వచ్చు నతనిఁ బోల్ప వచ్చుఁ గాక. 133

వ. ఇట్లు రణంబు సేయుచు నవ్వీరజనచూడామణి యగు వీర
భద్రుండు దక్షు నుపలక్షించి. 134

దక్షుని శిరంబుఁ ద్రుంచుట

సీ. ఎఱిఁగితే మనములో నీశానుతత్త్వంబు
నెఱిఁగింతు నిచ్చోట నెఱుఁగ వేని
యుఁకనైన నిచ్చె దే యాశ్వరుఁభాగంబు
వెంగలి కొల్వులో వేల్పు లెల్ల
వీపాట్లు పడిరొద రీక్షించి చూడరా
యాలింపరా యోరి వేల యనుచు
నలుగులనాటించి యఖిలశూలంబులఁ
గ్రొమ్మెఱుంగులు వెసఁ గ్రమ్మఁబట్టి

ఆ. దక్షుబంధుజనులు దక్షునిమూఁకలు
మోదుకొనుచు బిట్టు మొఱలు వెట్ట
దక్షుశిరముఁ ద్రుంచి తగ భద్రకాళిచే
సమ్మదమునఁ గేలిసలుప నిచ్చె. 135

వ. అంత భద్రకాళియు మహాకాళియుం బోలెఁ గరాళించి
దారుణాభీలశూలహస్తయై రణంబున మాఱు లేక తిరు
గుచు వీరభద్రుం డిచ్చిన దక్షుని మస్తకంబు గని మహాభ
యంబున. 136

మ. ప్రియుఁ జూచుం దలయూచు నారుచులకుం బిల్చుచున్ నగు
న్వేదుకం, బయలం బాఱఁగ వైచు నేచు నదుముచున్ బంతెం
బులోఁ బట్టుటన్, నయలీలన్ గబళించు దంచు దివిపై

సాడించుఁ దూలించు న్నిర్భయతం దతుశిరంబు కందుక
గతిగ భద్రాణి వేభంగులన్. 137

వ. తత్సమయంబున నయ్యాగపురుషుండు మాయామృగా
కారం బై తిరిగి పోవుటం గనుంగొని పోకు పోకు నిలు
నిలు మింక నెటు బోయెదు మతో(గ్ర)పబడబానలంబు
బాతేఁ బడితివి గాక యని విల్లు మోపెట్టి బెట్టిదం బగు
నయ్యర్ధచంద్రబాణంబుఁ దొడిగి కడువడి నతనిశిరంబుఁ
బుడమిం బడవేసి కూల్చి బిట్టార్చి చిక్కిన మూకలపైఁ
గవియుచుండ భయంపడిన దేవజనంబు లెల్లను సార్తారా
వంబుల మహోదైన్యంబున. 138

వీరభద్రుఁడు విష్ణువుతో యుద్ధము చేయుట

చ. అరిమురి నన్నిదిక్కులకు సాలములోపలఁ జొచ్చి భీతు లై
పఱచుటఁ జూచి మాధవుఁడు పాఱకుపాఱకుఁ డేను గల్గఁగా
వెఱవఁగ నేల రం డనుచు వేల్పుల నందఱ నిల్పి మొత్తమై
వెఱవక నిల్చి బీరమున వీరునకుఁ గిరివోలె నడ్డ మై. 139

వ. ఇవ్విధంబున. 140

ఉ. ఆలము సేయఁ బూని కడు సాయితమై హతశేషు లైన దే
వాళియు సేన లై నడువ నార్చుచు పన్నగవైరి వాహుఁడై
ప్రాలుచు భద్రుపైఁ గవిసె వారిజనాభుఁడు వాసుదేవుఁ డా
భీలవిహారి యై మృగము బెబ్బులి నుగ్రత చేరునాకృతిన్.

వ. తత్సమయంబున. 142

బ్రహ్మ వీరేశ్వరునకు రథము తెచ్చుట

సీ. లలితనానాయుధాలంకార మగుదాని
గోరాజుపడగచేఁ గొమరుదాని

అనిలవేగములగు హరులు గట్టినదాని
నమరాద్రియునుబోలె నమరువాని
దినపబింబముభంగిఁ దేజరిల్లెడుదాని
మహనీయకాంచనమణులదాని
దుందుభిఘంటికాతూర్యధ్వనులదాని
* దృగ్గోచరంబునై తోఁచుదాని

తే. నొక్కరథము శంభుఁ డుగ్రతఁ బుత్తెరఁ
బద్మభవుఁడు వీరభద్రు కడకుఁ
దెచ్చి కేలుమొగిచి తివిరి యిట్లని విన్న
వించె భక్తితోడ వెఱపుమెఱయ. 143

శా. ఓవీరాగ్రణి యాతపోవనములో నున్నాఁడు శంభుండు యా
దేవిం దాను సురవ్రజంబు గెలువన్ దేరిప్డు పుత్తెంచె రా
జీవాత్ముండును వీఁడె కయ్యమునకుం జేరెన్ రథారూఢుఁడై
వేవేగన్ రిపు గెల్తు గాక కడిమిం వీరప్రతాపాంబుధీ. 144

ఉ. రాజధరుండు తొల్లి త్రిపురంబులపైఁ జనునాఁడు వేదముల్
వాజిగణంబులై పఱవ వారక రొప్పుటఁ జేసి దైత్య ఘో
రాజిని గెల్చె నీశ్వరుఁడు రమ్యత నీకును నేఁడు దేరికిన్
వాజులు రొప్పెడిం గడిమి వైరుల గెల్వుము వీరవారిధీ. 145

వ. దేవా యీదివ్యరథారూఢుండ వై సమరకేళీవిహారంబు సలుపుదువు గాక యని విన్నవించిన నగుంగాక యని యుదయధరణీధరశిఖరంబు ప్రవేశించుదినరాజుచందంబునఁ దన మనోరథంబునకు హితమైన దివ్యరథం బెక్కి యుక్కుమిగిలి గుణయూథంబు లిరుగెలంకులయందును నందంద

---

* బ్రహ్మ సారథియునై వెలఁగుదాని.

వీరభేరీమృదంగశంఖకాహళ నిస్సాణాది వాద్యంబులు
చెలంగ నిలింప శ్రేష్ఠుం డగు పరమేష్ఠి దనకు సారథియై
చరియింప నకంపితవిక్రముం డై ప్రళయకాల భైర
వుండునుం బోలె సింహనాదంబులు సేయుచు దేవగణంబుల
మనంబులు వ్రయ్యలై పగులునట్లుగా శంఖంబు పూరించి
కుంభినీధరంబుపైఁ గవయు దంభోళిధరునిచందం బై
పురందర గోవిందాదులం గదిసి వీరభద్రేశ్వరుండు. 146

ఉ. తన్నని లోనఁ దాఁకి ఘనదారుణబాణము వేయు వెన్నునిం
గన్నులనిప్పు లొల్కఁ గని గర్జితసింహకరాళమూర్తి యై
యున్నఁ గ నొక్కవింట వడి నెక్కిడి టంకృతి చేసి బాణముల్
పన్నగశాయిపైఁ బఱపె భాసురసంగరకేళి నొప్పుచున్. 147

ఉ. గ్రక్కున విష్ణుఁడుం గదిసి కయ్యమున న్వెనువెంట నార్పు
చున్, బెక్కుశరావళుల్ దొడిఁగి బింకముతో గణనాథు
నేసెఁ దెం, వెక్కి గణాధినాయకుఁడు నేసెను వెన్నుని నంత
లోపలన్, జిక్కనలావుతో మెఱసి శ్రీపతి నేసిన నేసె వెండి
యున్. 148

మ. హరి మున్నేసిన కోప మంది వితతాహంకారుఁ డై బాణ
ముల్, పౌరి సంధించి లలాట మేసె నతనిన్ బుంఖానుపుం
ఖంబులై, దొరఁగన్ దీవ్రత నేసె నేసె హరియుం దోర్దండ
శౌర్యోన్నతిన్, బెరయన్ భద్రుభుజంబు బాణమున
నొప్పించెం సురల్ పొంగఁగన్. 149

వ. అంత. 150

క. వీరావేశముతోడను
బోరున రుద్రుండు విష్ణుభుజములు గాఁడన్

ఘోరశరంబులఁ బఱపిన
బీరంబులు మాని దేవబృందము ప్రస్తుతించెన్. 151

వ. మఱియు నయ్యవసరంబున జగంబులఁ బెన్నుద్దులైన బలుమింటిజోదు లిద్దరు కోదండరులం గైకొనక గెలుపు తలంపులు గైకొని మదంబునఁ దమతమలాఘవంబుల మెచ్చక మత్సరంబులు రెట్టించి బెట్టిదంబు లగుపంతంబులు పలుకుచు నగణితగుణఘోషంబుల దిగంతరాళంబులు బిగులు కొలుపుచు గుదుసువడి యుండఁ గోదండంబులఁ దెగటార్చుచు సురసిద్ధసాధ్యసంఘాతంబులకు భయంబు బుట్టించుచు మహితమార్గంబు నిండ నభోమండలంబున మంటలెగయించుచు మర్మంబులు గాఁడిపార ననేకదివ్యబాణంబులు పఱపుచు సంహరించుచు నన్యోన్య శరీరజాలంబులు తుత్తుమురు సేయుచు నిప్పునిప్పును గరిఁ గరియును ధరణిధరణియును మహార్ణవము మహార్ణవంబును గిరీంద్రము గిరీంద్రంబును బ్రహ్మాండము బ్రహ్మాండంబునుం దాఁకి తనివి చనక పోరాడుచందంబున సములై యసమాన రణవిహారంబులు సలుపుచు కాలసర్పంబులుంబోలె మ్రోగుచు కంఠీరవంబులుం బోలె గర్జించుచు జలధరంబులుంబోలె శర జాలంబుల భూమండలంబుఁ గప్పుచు కాలరుద్రులుంబోలె నడరుచు ధారాధరంబులుంబోలెఁ గప్పుచుఁ దారొంటఁ దెలుపుచుఁ బరస్పరభల్లభగ్నాంగులై మూర్ఛిల్లుచుఁ దెలి యుచు సింహనాదంబులు సేయుచు బిట్టుల్కు నట్టహాసంబు సేయుచు సార్చుచు నిజసాయకంబుల నభోభాగభూభాగంబులు వెల్లి విఱియించుచు నజాండభరితంబు లగుహాంకా

రంబు లొనరించుచుఁ దుహినదహనవరుణాంధకార గంధ
వాహంబులనం గలఘోరశరంబులు ప్రయోగించుచు నిరు
వురుఁ గరలాఘవంబులఁ బరిభ్రమించుచుఁ బుంఖానుపుంఖం
బుగా వేయుచు నదల్చుచు నతిభయంకరంబుగా సంగరంబు
సేయుచుండి రయ్యవసరంబున. 152

క. నలి నంపకయ్య మప్పుడు
సొలయక బలు మేటివింటిజోదులు వెలుచన్
సలుపఁగ నెచ్చెలువమునకు
వెలయఁగఁ బెల్లార్చిరపుడు వేలుపు లెల్లన్. 153

క. దేవత లార్పులు వొడఁగని
వావిరిఁ గోపించి కడఁగి వాఁడిశరంబుల్
వేవేగ భద్రుఁ డేసిన
నావిష్ణునియురము గాఁడి యవనిం బడియెన్. 154

మ. పడియున్ వేగమె తేఁ శౌరి పటుపన్ బాణంబు లెన్నే
నియున్, నడుమం ద్రుంచె గణాధిపుండు కడఁక న్నారా
యణాస్త్రంబుఁ దాఁగడిమిన్ మాధవుఁ డేసె సేయుటయు
వేగన్ వీరభద్రాస్త్రమున్, వెడలించెన్ వడిఁ ద్రుంచి వైచెఁ
బోడిగా వీరుండు దద్బాణమున్. 155

మ. మఱియుం భద్రుఁడు తీవ్రబాణతతులన్ మానాథుకోదం
డమున్, విఱిచెన్ దార్క్ష్యుని తెక్కలన్ దునిమినన్ విష్ణుండు
రోషించి యుత్తఱి నత్యుగ్రుల శంఖచక్రధరులన్ దర్పా
ఢ్యులన్ వీరఁ గొందఱఁ బుట్టించె దహించె వారి శిఖనేత్ర
జ్వాలలన్ భద్రుఁడున్. 156

వ. అయ్యవసరంబున. 157

క. ఆహవమున నిజచక్రము
బాహాటోపమున భద్రుపై నటువైవన్
సాహసమున భద్రుండును
ఆహా యొట వైచె దింక నసవుడు భీతిన్. 158

ఉ. ఏపున నేయఁగా వెఱచి యొత్తిన చక్రముతోడ భీతి ల
క్ష్మీపతి సింహము న్గదిసి చిక్కినయేనుఁగుఁ బోలె నేలపైఁ
జూపులు చేర్చి చేడ్పడినఁ జూచి దిగింద్రులు డాయ కుండఁ
గాఁ, గోపము నొంది భద్రుఁడును క్రూరశరంబుల నేసె
నుగ్రుఁడై. 159

వ. మఱియు నయ్యవసరంబున నిర్వికారనిశ్చేతనుండై విరథుండై యున్న మాధవుం జూచి యవ్వీరుండు తనబాణజాలంబుల నతనిప్రాణంబులు గొన నమకట్టి యీశ్వరప్రియుం డని మనంబునం దలంచి ప్రమథగణంబులచేత నచ్చక్రంబు నులిమి తెప్పించి తదనంతరంబ. 160

వీరభద్రుం డింద్రాదులతోఁ బోరాడుట

క. ఎక్కడ వచ్చెద రిచటికి
వ్రక్కలు గావింతు నన్న వాసవుఁ డనిలో
గ్రక్కున వజ్రము వైచెను
చిక్కెను వజ్రంబు వీరసింహునిచేతన్. 161

క. అందంద వీరకాహళ
దుందుభినిస్సాణశంఖతూర్యరవంబుల్
క్రందిల్లె వీరసారథి
బృందారకబృంద మెల్లఁ బొరిఁబొరి వణఁకెన్. 162

వ. ఇట్లు తన కెదురువడు సురనాయకేంద్రాదిదేవగణంబుల కాలంబున పలాయమానంబులం జేసి తనివిచననికోపంబున నొకనికొకనికిం బది నూఱు వేయు లక్షకోటిరూపులై విజృంభించి ప్రళయకాలాగ్నిచందంబున వలయాకారంబుఁ గొని కొఱవిద్రిప్పినతెఱంగున నెక్కడఁ జూచినఁ దానయై కనుపట్టి చంపుచు నెదురులేనిమదగజేంద్రంబుచందంబున సర్వీరగణ కంఠీరవుండు ఘోరవీరతాండవాడంబరుండై సమరకేళీవిహారంబు సలుపుచున్నసమయంబున నిలింపదేవ సంఘంబులు వీరభద్రునిచే భల్లభగ్నాంగులై శిరంబులు దెగి అర్ధచంద్రనిశితవిశిఖంబులఁ గంఠంబులు దెగి పడి బెగడి జేవురు గొండలతెఱంగున నెత్తుటఁ జొత్తిల్లువారును తమ బంధుజనంబులం బాయఁజాలక వారి కెదురుపడి చచ్చువారును గుముర్లు కట్టి వీరభద్రరణంబు చూచి భీతచిత్తులై ప్రాణంబులు విడుచువారును దావానలంబునంబడి కాలు భూరి జంతుచయంబులచాడ్పున భద్రఫాలానలంబున భస్మీభూతు లగువారును మఱియు శివద్రోహుల మగు పాపకర్ముల కింత వలవదే యని తమలోన నెఱింగించుకొను వారును మఱియుఁ గులశైలగుహాంతరములలో డాగువారును గాఱడవుల దూఱువారును నేరుల మునుంగువారును నెఱ్ఱెలు చొఱఁ బాఱువారును బీనుఁగుల మఱువుదీసికొనువారును రూపు చెడి దేహయష్టి తుత్తుమురులైన వారును వీరభద్ర వీరభద్రా శరణంబు శరణం బనువారును భల్లాయుధంబులచేత దేహంబులు వ్రయ్యలై పలుమాఱు నెలుంగెత్తి యేడ్చువారును పూరి గఱచుకొని నిరాయుధు

లై పడువారును నై రయుద్ధవసరంబున కొండలరాసులు ప్రేగులప్రోవులు నెరుకలతిప్పలు మాంసంబులు పీనుఁగు తలలు పెంటలు మెదడు రొంపియు నెత్తురుచేరులును నై పీనుంగులు జలచరంబులచాడ్పునను ధవళచామరంబులు వెలినురుఁగుల చందంబునను గంధర్వాదివిజశల్యంబుల కిట్టలు కొండలకైవడియు నై పడియున్న దేవభట్టారకు లరవిందపుఁ దూండ్లభంగియుఁ దునిసినధవళచ్ఛత్రంబులు పుండరీకంబుల కరణియు రాలినకరకంకణాదిభూషణజాలంబులు మరాళాది జలపక్షులలాగునను గుప్పలుగొని పడియున్నశిరంబులు శంఖంబులును దట్టంబులు నానాద్వీపంబులును మార్తాండ మండలకిరణంబులవలనఁ దేరి చూడరానినెత్తురుచేరులును శరంబులచేత నురంబులు పగిలి పఱచు నిలింపసంఘంబులు తరంగంబులచందంబునను మహాభీతచిత్తులై పఱచు నార్తా రవంబులు మ్రోఁతయు నై మహార్ణవంబుతో ననుకరించె నప్పుడు శరచ్చంద్రికామయూఖవిలసితుం డైనచందురుం డనుం బోలె రక్తార్ణవంబు నుబ్బించుచు వీరభద్రుం డొప్పు చుండె నయ్యవసరంబున. 163

మత్తకోకిల.—

ఓహటించె రణంబులోఁ బడియున్న మాధవముఖ్యులన్
సాహసంబునఁ జేరి వెండియుఁ జండకోపముతో శివ
ద్రోహు లిద్దఱు నెల్ల వెంటనఁ దూలి పోవఁగ నీక విూ
రాహవంబునఁ బట్టు డిందఱి నంచుఁ బల్కె గణాధిపుల్.

తరల. కఱకుఁ బిల్లులఁ బట్టువారలకాళ్లు సేతులు పొట్టలున్
మొఱలు కూఁతలు పెట్ట నుగ్రత ముష్టిఘాతల నొంచుచున్

పటువగం జననీక శృంఖలబంధనంబులు చేసి బా
నరిమురిగా రణకేళి సల్పెను నాత్మ నెంతయు సోలుచున్. 165

వ. అనిన విని మునీంద్రులు విస్మయాత్మకు లై వాయుదేవు
నుపలక్షించి తమలో ని ట్లనిరి. 166

క. శివనిందయు స్మృతినిందయు
శివభక్తులుగానివారి సేవించుటయున్
భువనమునఁ గాదు దక్షుఁడు
శివనిందను దలఁచి యిట్లు చెడియెన్ ధరణిన్. 167

సీ. సలలితంబుగ జన్నశాలలు భస్మమై
తోరణంబులు డుస్సి ధూళిఁ గలసె
హోమగుండము లెల్ల నొగి నెత్తురులఁ దోఁగి
బ్రహ్మలు వేల్పులు పరఁగఁ జచ్చె
బృందారకావలిఁ బొలియించెఁ గులవధూ
జనవిలాపంబులు సందడిల్లె
భాసురం బగులక్ష్మిపతిఁ బట్టి కట్టిరి
తపసులు పెద్దలు ధరణిఁ గూలె

గీ. తెరసితలలగములు పీనుఁగుపెంటలు
మదపుకుప్పలైన మాంసములును
రక్తనదులు మెదడురాసులు నెముకలు
గుట్టలయ్యెఁ జెప్ప జెట్టలగుచు. 168

ఆ. గిరిశుఁగూర్చి సేయు గురుపాతకంబైన
పుణ్య మధికమగుచుఁ బొరయుచుండు
శ్రీగిరీశు వేఁడు సేయుపుణ్యంబైన
పాతకంబు నెల్లభంగులందు. 169

వ. అని మునీంద్రులు సముచితాలాపంబులఁ బల్కుచు వారల
దేవుం జూచి మహాత్మా మఖేశ్వరుని దత్సంగ్రామంబున వీర
భద్రుం డెవ్విధంబునం జయించె వినుపింపు మని యడిగిన
నతం డి ట్లనియె. 170

క. ఈవిధమున గణనాథులు
దేవానీకములఁ బట్టి తెరలనిబలిమిన్
బోవనిశ్రృంఖలబంధము
గావించిరి సంగరమునఁ గలుషాత్మకులన్. 171

వ. తత్సమయంబున. 172

క. దారుతరభక్తితోడను
సారథి యై మెలఁగుచున్న చనవునఁ బ్రీతిన్
వీరగణాధీశ్వరునకు
భారతిపతి మ్రొక్కి నిలిచి పలికెం గడఁకన్. 173

శా. వీరాంభోనిధి నేఁడు మీ యలుకకున్ వీ రెంతవా రయ్య త్వ
త్కారుణ్యంబునఁ గాక యని యాకష్టాత్ములన్
బోరిలోఁ, గాచెంపఁ గబళింప నీప్రముఖుఁ డొక్కండు దైన
జాలండె దు,శ్చారుల్ దివ్యులు వీరి నెన్నక మదిన్ సైరించి
రక్షింపవే. 174

క. తప్పులు చేసినబిడ్డల
తప్పులకును శిక్షఁ బెట్టి తండ్రులు దెలియం
జెప్పుదురు గాక యొందును
తప్పులకును ద్రుంతురయ్య తరుణేందుధరా. 175

క. తారే పెట్టినతరువుల
తారే పెఱుకుదురె పతికి దాసీజనముల్

నేరక యెఱుఁగక చేసిన
నేరంబులు సైఁప వలదె నీలగ్రీవా. 176

క. అని యిట్లు బ్రహ్మదేవుఁడు
వినుతులు సేయంగఁ బ్రీతి వీరాధిపుఁడు
స్వనమున దయ గరుణించుట
గని హరియును సురలు బ్రహ్మ ఘటితాంజలులై. 177

వ. ఇట్లు స్తుతియింపం దొడంగిరి. 178

క. జయజయ నిర్జరముదహార
జయజయ రణరంగభీమ శౌర్యోద్దామా
జయజయ వీరాంభోనిధి
జయజయ లోకైకవీర సంతతధీరా. 179

దండకము. శ్రీవీరరూపా శివద్రోహగండా ప్రచండప్రతాపా సుపర్వాణసంఘా తమోభానుబింబప్రదీపా మహాకోప రూపాదివీరాంకవీరా పురారాతిసంహార ఘోరావతారా శివాచారమందార బృందారకాధీశ గర్వాపహారా దయాకార నాగేంద్రహారా సనందాదియోగీంద్రచేతోవిహారా జనాధార నీదివ్యతత్త్వంబు భావింపఁగా లేక గర్వాంధకారాంధు లేమైతిమో నీదురూపంబు రూపింప సజ్ఞాన బంధంబులం జిక్కి వేదప్రకారంబులన్ మించి యుచ్చోటికిం దక్షయాగంబు వీక్షింపఁగా నిన్ను మూరాకయుల్లం గడుం దప్పులై యుండు సైరింపవే దేవదేవా శివద్రోహులైనట్టి మమ్మున్ విజృంభించి శిక్షించి తీ వింక నీద్వైతవైరంబు చాలింపు తండ్రీ మఖముం గూర్చి మే మెంతవారమ్ము నీయానతిం గాదె యాబ్రహ్మ లోకంబులం బ్రాణనిర్మాణుఁ డై

యుంట నీయానతిం గాదె యావిష్ణులోకైకరక్షాభురం
దరుఁడై యుంట నీయానతిం గాదె రుద్రుండు సర్వ
ప్రపంచహారి యై యుంట నీయానతిం గాదె రేయుం బగలం
బుల్ వెలుంగొందుచుం జంద్రసూర్యాదులుం బ్రవృత్తులై
యుంట నీయానతిం గాదె దేవేంద్రనాగేశముఖ్యుల్
ప్రతాపించి దిక్పాలురై యుంట నీయానతిం గాదె
దేవాధిముఖ్యుల్ సులోకోపకారార్థులై యుంట నీయందుఁ
గాదె సరోజాతజాతాండముల్ దొంతులై యుంట
నీయున్న చందంబు నేమెంత యూహింపఁగా వచ్చు వేదం
బులు న్నీవ వాదంబులు న్నీవ ధైర్యంబులు న్నీవ మర్మం
బులు న్నీవ యీబ్రహ్మయు న్నీవ యీవిష్ణువు న్నీవ యీ
రుద్రుఁడు న్నీవ సర్వంబును న్నీవ సుమ్మీ జగన్నాథ నీపెంపు
నీకుం దలంపంగఁ జిత్రంబు మాబోటివారెల్ల నిన్నుం
విచారింపఁగా నేర్తురే నీవు కారుణ్యదృష్టిం బ్రసన్నుండ
వై పీరు నావారు నాదాసులంచుం ముదంబొప్ప మన్నించి
దివ్యప్రబోధప్రసాదంబులం జేసి రక్షింపఁగా నీకు
భారంబు గా కుండ నజ్ఞానభావంబులం బాపి సుజ్ఞానమార్గం
బులం జేసి నిష్కర్ములై నిత్యసమ్మోదులై యేకచిత్తంబునం
బొంది నిర్వాణులై నిష్కళంకంబులం బొంది మిన్నంది
మీయందు భావంబు గీలించి నీదివ్యరూపంబు దా నెట్టిదోఁ
గాక యంచుం దలం పొంది భావించువా రెల్లదృగ్గోచరం
బైనని న్నెర్పడం గానఁగా లేక విభ్రాంతులై చిక్కు
వడ్డార దెం .దేనిమిత్తంబునం జేసి నీచందము న్నీవిలా
సంబులు న్నీదురూపంబునుం జూచియు న్నీవు

దండించు పుణ్యంబులు నొందఁ గల్గె మహాధన్యుల
మైతిమో దేవ దేవాదిదేవా మహాదేవ నీ లెంక లైనట్టి
నీదాసులైనట్టి మమ్ముం దయాళుండ వై ప్రీతి రక్షింపవే
దేవ నీ కెవ్వరుం గానఁగా లేరు నేరంబు సైరింపవే దేవ
మన్నింపవే దేవ శ్రీవీరభద్రా శరణ్యంబు రుద్రా నమస్తే
నమస్తే నమస్తే నమః. 180

క. జయజయ లోకారాధిత
జయజయ ఫాలాగ్ని నేత్ర శశిరవినయనా
జయజయ శూలాయుధకర
జయజయ సోమార్ధజూట సర్వజ్ఞనిధీ. 181

క. నినుఁ గాన లేవు చదువులు
నినుఁ గానవు జగము లిట్టి నీ విచ్చోటం
జనుదెంచి శిక్ష పెట్టుట
పనిగొని మాతపము లెల్ల పండుట గాదే. 182

క. పాపం బని చింతింపక
పాపాత్ముని దక్షుఁ గూడి మతిమాలి వెసం
బాపపు జన్నముఁ జూచిన
పాపాత్ముల కింత వలదె పాపము ధరణిన్. 183

శా. భూమిస్వాలురు నేయు మెత్తితనముల్ శోషించిరి యవ్వారలం
త్రేమస్నద్ధులు నేయఁ గావలయునో పెంపార మాహింపుమా
మేమెల్లన్ భవదీయపుత్త్రులము గామే తండ్రి మా నేరముల్
స్వామిద్రోహరగండ సైఁచి కరుణన్ సంప్రీతి రక్షింపవే. 184

క. అవధారు వీరవిక్రమ
భవదీయ మహోగ్రకోప పావకకీలన్

వివరంబున నీ కైలిమి
భవమత్తుల కింపె వఱలఁగ భావనమూర్తీ. 185

క. రక్షింపుము కరుణాకర
రక్షింపుము లోకనాథ రమ్యాకారా
రక్షింపుము రిపుసంహార
రక్షింపుము వీరభద్ర రౌద్రసముద్రా. 186

వ. అని మఱియు ననేకప్రకారంబుల దామోదరవిరించీంద్రాది సురగణంబులు వినుతింప ననుకంపాయత్తమానసుండై వీరావేశంబుఁ జాలించి గోవిందపురందరదేవగణసమూహంబులకు శృంఖలాబంధమోచనంబులు చేయించి యప్పరమేశ్వరుం డున్నయెడకుఁ జనుదెంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తనకడిమి మెఱసి దక్షాధ్వరంబు చుట్టుముట్టుకొని పట్టి తెచ్చిన దేవతలను దదీయాంగకంబులును నమ్మహాదేవు సన్నిధిం బెట్టి వేర్వేఱ నెఱింగించువాఁడై యిట్లనియె. 187

### పరమేశ్వరునితో వీరేశ్వరుండు ధ్వంసవృత్తాంత మంతయుఁ జెప్పుట

సీ. ఇది సరస్వతిముక్కు యిది దక్షుతుండంబు
యిదె వహ్నిగాలుక లపహరింపు
మిదె హవ్యవాహునియిల్లాలి చను ముక్కు
భాసురం బగుచున్న నాసికంబు
యివె పావకునిచేతు లివె దేవతలతలల్
నిడుదముక్కును భర్గునేత్రములును
*ఇవె గజదంతంబు లివె దేవగణముల
కాళ్లును చేతులు కాయచయము

* ఆదిత్యుదంతంబు లివె...... కాయములును.

ఆ. తెచ్చినాఁడ సురల నచ్యుతు సాదిగాఁ
బట్టి తెచ్చినాఁడ బరఁగ నింక
నేమిసేయువాఁడ నీశాన యానతి
నీవె నాకుఁ గరుణ నేర్పడంగ. 188

వ. అని విన్నవించి ముకుళితహస్తుం డై వీరభద్రేశ్వరుండు
నిలిచియున్న సమయంబున. 189

క. కలఁగుచు తలఁగుచుఁ గొంకుచు
వెలవెల నై సిగ్గుపడుచు వెఱపున నమరుల్
జలరుహనయనుఁడు మొదలుగఁ
బలుమరుఁ బ్రణమిల్ల నంత భవుఁ డిట్లనియెన్. 190

సీ. మిమ్మెల్లఁ గాఁచితి మేలైన కరుణను
వెఱవకుండుఁడు మీరు వేల్పులార!
యేను గోపించిన మానుపింపఁగ మీకు
దిక్కెది చెప్పుఁడా దివిజులార!
మఱియు దక్షునిఁ గూడి మ మ్మిట్లు మఱతురే
తెలిసియుండవలదె దివ్యులార!
యవ్వఁగాక మీసేయు నపరాధములు గాచి
యభయంబు లిచ్చితి నమరులార!

ఆ. అనుచు నీలకంఠుఁ డల్లన నగవుతో
నానతిచ్చి కరుణ నమరియున్న
చచ్చి మరలఁ బుట్టి వచ్చినవారైరి
సంతసిల్లె దేవ సంఘమెల్ల. 191

వ. అయ్యవసరంబున సరోజసంభవుండు పరమేశ్వరునకు సాష్టాంగ
దండప్రణామంబు లాచరించి కరకమలంబులు నిటలంబున

ఘటియించి విశేషతాత్పర్యచిత్తుండై సర్వేశ్వరా యొక్క
విన్నపం బవధరింపు మని యిట్లనిరి. 192

క. తప్పులు చేసినవారలఁ
దప్పులకుఁ దగినభంగి దండించు దయం
జెప్పుదురు నీ క్రమంబున
నిప్పుడు మన్నించుటొప్పు నిభచర్మధరా. 193

క. పుట్టింప నీవె నేర్తువు
నెట్టన రక్షింప నీవె నేర్తువు గడిమిం
గిట్టింప నీవె నేర్తువు
ఇట్టి దయారసమె చెల్లు నీకు మహేశా. 194

క. సురసంఘములకు నీచేఁ
బోరిఁ జచ్చుట వారివారిపుణ్యము సుమ్మీ
సురచిరముగఁ బ్రాణంబులు
పరమేశా యేము మగుడఁ బడయుట గాదే. 195

క. దేవతల యంగకంబులు
దేవరచేఁజేతఁ బుట్టి తెచ్చి ననంగా
దేవతలకుఁ బెద్దతేకము
దేవా ప్రాప్తించె వినుము దేవాధిపతీ. 196

క. ఖండేందుజూట నీచే
ఖండింపఁగఁ బడినచోట్లు క్రతుభుక్కులకుఁ
మండనములు దొడిగినక్రియ
నొండొండ వెలింగి యొప్పుచున్నవి దేవా. 197

వ. అని విన్నవించిన నప్పరమేశ్వరుండు. 198

ఉ. లోలదయాళుఁ డై నిఖిలలోకవిభుండు శివుండు కొండరా
చూలిముఖేందుమండలముఁ జూచుచు నిట్లను వీరభద్రుఁడున్
వేలుపుమూకలన్ గనలి వేగఁ గలంచి యలంచెఁ గోపమున్
జాలును వీరల న్మనకు నై రణచేయఁగఁ బోలు నంగనా. 199

క. నేరము చేసినవీరుల
వీరిం దెగటార్ప మనము వీక్షించినచో
వారింపఁగ దిక్కెవ్వరు
గౌరీ యిఁకఁ గరుణతోడఁ గావఁగవలయున్. 200

వ. అని సకలభువనప్రతిష్ఠుం డగుపరమేశ్వరుండు కరుణా
కటాక్షుం డై. 201

శివుండు బ్రహ్మాదులగువారి ననుగ్రహించుట

సీ. పావకజిహ్వలు బాహుఖండంబులు
వలనొప్పఁ బిలిపించి వహ్నికిచ్చె
పూషదంతంబులు పూషున కిప్పించె
భర్గునినయనంబు భర్గు కిచ్చె
భారతిముక్కును భారతి కిప్పించి
ముక్కున కొకమంచిముత్తె మిచ్చె
అగ్నిదేవునియాలి నల్లన రప్పించి
చనుముక్కులును ముక్కు సతికి నిచ్చె

తే. మఱియు భద్రుండు దెచ్చిన సురలయంగ
కంబులెల్లను మరలంగఁ గరుణ నిచ్చెఁ
దెగినవారల జీవుల మగుడ నిచ్చి
యభయమిచ్చి సంభావించె నభవుఁ డపుడు. 202

క. హరికి సురపతికిఁ గరుణను
వరుసన్ బిలిపించి చక్రవజ్రాయుధముల్

కరిచర్మధరుం డిచ్చెను
సరభసమున సురలు బ్రహ్మ సంస్తుతిసేయన్. 203

క. శంకర దేవునిపంపున
పంకజభవుం డొక్క తగరు పడియున్న నిరా
టంకముగ దానిశిరమును
లంకించెను దక్షుతనువు లక్షణ మొందవన్. 204

వ. ఇవ్విధంబున. 205

క. దక్షునితల యంటించిన
దక్షుండు నలుదెసలు చూచి తనచిత్తములో
నక్షీణభక్తి వెలయఁగ
దక్షారికి మ్రొక్కి సిగ్గు దనరఁగఁ బ్రీతిన్. 206

క. నినుఁ దెలియక మతిమాలితి
నినుఁ దెలియక ఖలుఁడ నైతి నీలగ్రీవా
నినుఁ దెలియక గతిఁ దప్పితి
నినుఁ దెలియక మరులుకొంటి నిరుపమమూర్తి. 207

క. నీ వేల నాకు నొందెడు
నీవు దురాత్ములను నెల్ల నేరవు బ్రోవన్
నీవిధముఁ దెలియ వశమే
నీవెఱవుఁ దలంపఁ దరమె నిర్మలకీర్తీ. 208

క. బంధురనానాకల్మష
బంధంబులు చుట్టుముట్టి భావములోనన్
బంధించి బలిసి యున్నవి
బంధంబులఁ బాపి కరుణఁ బాటింపు శివా. 209

క. నిను నేవిధమునఁ గొలుతును
నిను నేవిధమునఁ దలంతు నిను నెబ్భంగిన్

వినుతింతు నానతిని వే
యనుపమగుణహార త్రిజగదభినవరూపా. 210

క. గంగారమణిమనోహర
గంగారంగత్తరంగ కలితశిరోజా
గంగాసలిలవినోదన
గంగాతటినీసమీప గమనవిహారా. 211

క. గౌరీకుచపరిరంభణ
గౌరీముఖచంద్రబింబ గంధ * సరోజా
గౌరీమానసరంజన
గౌరీనయనారవింద కమలాధిపతీ. 212

వ. అని మఱియు శరణంబు వేఁడితి దక్షునిం గనుంగొని రజతగిరి
మందిరుం డి ట్లనియె. 213

ఆ. మమ్ము మఱవఁ దగునె మహనీయమగుబుద్ధి
గలిగినదువు మెల్ల కార్యములను
నీకు నిర్విఘ్నంబు నీనేరమునఁ గాని
మత్కృతంబుగాదు మాను దక్ష. 214

క. అని పరమేశుఁడు ప్రియమునఁ
దనగణనాయకులలోన దక్షుని నునిచెఁ
ఘనుఁడు దయాళుఁడు శంభుఁడు
వనజాక్షప్రముఖసురలు వారక పొగడన్. 215

వ. మఱియు తదీయావసరంబున నారాయణబ్రహ్మేంద్రాదిదేవ
గణంబులు దండప్రణామంబు లాచరించి కరకమలంబులు
ఫాలంబునఁ జేర్చి యి ట్లని స్తుతియింపఁ దొడంగిరి. 216

* చకోరా!

సీ. భుజగేంద్రభూషాయ భూతాధినాథాయ
నిత్యానురాగాయ నిర్మలాయ
గంగావతంసాయ ఖండేందుజూటాయ
దేవాదిదేవాయ దిక్పటాయ
వేదాంతవేద్యాయ వీరప్రతాపాయ
కైవల్యనాథాయ ఘనఘనాయ
రణరంగవీరాయ రమణీయరూపాయ
భువనాభిరామాయ పురహరాయ

ఆ. ఓంనమశ్శివాయ ఓంకారరూపాయ
శంకరాయ రిపుభయంకరాయ
మదనసంహరాయ మానితకైలాస
మందిరాయ నీలకంధరాయ. 217

క. జయజయ గౌరీవల్లభ
జయజయ కైలాసనాథ జయ కరుణాబ్ధీ
జయజయ త్రిజగన్మోహన
జయజయ లోకైకమాత జయ శర్వాణీ. 218

వ. అని మఱియు ననేకవిధంబుల నయ్యాదిదంపతుల స్తుతి యింప నంత నప్పరమేశ్వరుండును వీరభద్రునిం జూచి కరుణావిశేషమానసుండై భద్రకాళియును నీవు నిందు రమ్మని చేరం బిలిచి సమ్మదమున గాఢాలింగనంబు చేసి తన యంకపీఠంబున నునిచి వినుతించె వారల గౌరీదేవియును కృపాకటాక్షయై యుల్లంబున సంతసిల్లి వీక్షించె నివ్విధంబున సతియును బతియును గారవించి యిరువురు నిట్లని యానతిచ్చిరి. 219

క. లోకంబులు గల్పింపఁగ
లోకంబులు గావ నణఁప లోకైకనిధీ
నీకును భారము మీఁదట
నాకాధిపవినుతచరణ నాగేంద్రధరా. 220

శివుండు వీరభద్రునకుఁ బట్టంబు గట్టుట

వ. అని పలికి. 221

మ. బలభిద్వహ్నికుబేరభానుజహరిబ్రహ్మాదులం బిల్చి యీ
బలియుం డాధ్యుఁడు వీరభద్రుఁ డఖిలబ్రహ్మాండభేద్యుండుస
ల్లలితానందుఁడు ముజ్జగంబులకు నెల్లన్ దాన కర్తారుఁడై
వెలుఁగం దైవము మీఁకు నీతఁ డనిరయ్యన్ విశ్వేశుఁ డత్యు
న్నతిన్. 222

క. గిరిజాధీశ్వరు నానతి
బరఁగఁగఁ జేపట్టి భువనభరదక్షుఁడై
కరుణన్ జగంబులన్నియుఁ
బరిపాలన సేయు వీరభద్రుం డెలమిన్. 223

వ. అనిన విని వీరభద్రవిజయప్రకారంబుఁ దెలియ విన్నవించిన
వాయుదేవున కమ్మహామును లిట్లనిరి. 224

క. వాయుపురాణాంభోనిధి
నాయక శీతాంశుభంగి నానందకరం
బై యున్న నీప్రసంగము
ధీయుత నీచేత నేఁడు దెలిసితి మనఘా. 225

క. శ్రీరమ్యమైనయీకథ
వారక వినువారు చదువువారును లిఖిత
ప్రారంభు లైనవారును
వారు గదా శంభుకొల్వువారు సమీరా. 226

క. పంచాననచరితము ని
ర్పంచలభక్తిమెయి విన్నఁ జదివినఁ జాలున్
కించిన్మాత్రం బైనను
పంచమహాపాతకములు పాయు మహాత్మా. 227

వ. అని పలికి సఫలమనోరథు లై వాయుదేవుని స్తుతియించి
రని యివ్విధంబున. 228

క. సాకుం దోఁచినవిధమున
నీకథఁ గై కొంటిఁ గాక నీలగ్రీవా
నీకథమహిమాతిశయము
వాక్రువ్వఁగ నిందువశమె వనజజువశమే. 229

క. సాకలిగిన వేరుపులును
సాకలిగిన నేరములును సాగేంద్రధరా
నీకు సమర్పణ సుమ్మీ
లోకేశ్వర భక్తజనక లోకాధారా. 230

మ. ఇలయుండాఁక సురేంద్రపర్వతవిభుం డుండాఁక బృందారకా
వలి యుండాఁక రవీందుమండలములున్ వారాసు లెండాఁకని
చ్చలు నానందకరంబు లై త్రిజగతిం సద్ధిల్లు నందాఁక ని
ర్మల మై యీకథ సర్వలోకనుతమై మానిత్యమై యుండె
డున్. 231

లయగ్రాహి.—

శంకర హాలాహలభయంకర పినాకధర
కింకర దిగీశ యకళంకతరమూర్తీ
పంకజభవాభినుత పంకజభవాండభవ
సంకలితదైత్యకులసంకట సుధాప

రత్నాంకనుతనాగకరకంకణవిరాజితక
ళంక గిరిజాకుచకుంభాంకపరివిలస
త్పంకితనితాంతపులకాంకిత యురస్థలమృ
గాంకశతకోటినిభ పంకజదళాక్షా. 232

క. త్రిపురాటవీ ధనంజయ
త్రిపురాసుర ఘోరశైల దేవాధిపతీ
త్రిపురాంబుధి బడబానల
విపులదయాంభోధిచంద్ర విశ్వస్తుత్యా. 233

మాలిని.—

అఖిలభువనపాలా హస్తకాంతత్రిశూలా
శిఖినయనలలాటా శీతధామార్ధజూటా
నిఖిలనిగమసంగా నిర్వికారాంతరంగా
మఖసమయవిజృంభా మంగళస్ఫూర్తిధామా. 234

గద్య. ఇది శ్రీమన్మహామహేశ్వర యువటూరిసోమనారాధ్య దివ్యశ్రీపాదపద్మారాధక కేసనామాత్యపుత్త్ర పోతయనామధేయప్రణీతంబైన శ్రీవీరభద్రవిజయం బనుమహాపురాణకథయందు దక్షయాగంబును దధీచివివాదంబును దేవతలపరాజయంబును వనజనయన వనజభవప్రముఖులు మహేశ్వరుని స్తుతించుటయు వారల మహేశ్వరుండు కరుణించుటయు నన్నది సర్వంబును జతుర్థాశ్వాసము.

వీ ర భ ద్ర వి జ య ము
సం పూ ర్ణ ము

చెన్నపురి: 'చంద్రికా' ప్రెస్సున ముద్రితము.—1960

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రు॥ | అ॥ |
|---|---|---|
| అధ్యాత్మ రామాయణము, పద్యకావ్యము ... | 2 | 0 |
| ఆంధ్ర భారతము, పద్యకావ్యము:— | | |
| ఆది సభాపర్వములు ... | 4 | 0 |
| అరణ్యపర్వము ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ... | 4 | 0 |
| శాంతిపర్వము ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు ... | 4 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ... | 8 | 0 |
| శాంతిసప్తకము ... | 7 | 8 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ... | 1 | 8 |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము — శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిది, 3 సంపుటములు ... | అచ్చు | |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు ... | 15 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనిమార్పు ... | 6 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవి ... | 8 | 8 |
| కుమారసంభవము—నన్నెచోడ ... | అచ్చు | |
| ఆంధ్రభారతవిమర్శనము—మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... | 1 | 12 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన ... | అచ్చు | |
| చిత్రభారతము—చరిగొండ ధర్మన ... | 1 | 8 |
| అనిరుద్ధచరిత్రము ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక ... | 0 | 6 |
| అన్యవాదకోలాహలము, లఘుటీకతో ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 10 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 12 |
| పంచతంత్రము, వేంకటనాథకవి | ... | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పాండురంగమాహాత్మ్యము సటీక | ... | అచ్చు | |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, టీకాతాత్పర్యసహితము | ... | 5 | 0 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రి గారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | ... | 8 | 0 |
| భాస్కరరామాయణము | ... | అచ్చు | |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 8 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| విల్హణీయము | ... | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 14 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 10 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1872, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి-1.